శ్రీరస్తు.

# బాలసరస్వతీయము

అను

## ఆంధ్రశబ్దానుశాసన టీకాగ్రంథము

ఇది,

శబ్దానుశాసనుఁడగు నన్నయభట్టారకునిచే రచింపఁబడిన

యాంధ్రశబ్దచింతామణికి

బాలసరస్వతీమహోపాధ్యాయునిచే రచింపఁబడిన

వ్యాఖ్యానము.

ఇందు

విజయనగర సంస్కృతకళాశాలాపండితులగు

బ. చినసీతారామస్వామిశాస్త్రిగారిచే రచింపఁబడిన

బాలసరస్వతీయపీఠికయుఁ గలదు.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1932.

మ. ధనమే పావనమంచు నెంచ కధికద్రవ్యంబు వెచ్చించి జీ
వనముం గూర్చుచు సత్కవీంద్రులకు గీర్వాణాంధ్ర సద్వాఙ్మయం
బును దాఁబెంచుచు దానిసుస్థిరముగా ముద్రించు వావిళ్ల వం
శ్యునధీతాగము వేంకటేశ్వరుని బ్రోచుంగాత! శ్రీశుండిలన్.

# బాలసరస్వతీయపీఠిక.

---

శ్లో. సుధియౌ పరిపూతమానసౌ
కలయేఽహం జగతః ప్రియంకరౌ
పితరౌ మమ వేంకటాంబికా
ముఖలింగేశ్వరజంపతీ హృది.

శ్లో. పితామహభ్రాతృసుతం స్వవిద్యా
గురుం చ చింతామణిసత్సమాఖ్యమ్
శ్రీవత్సగోత్రోద్ధరణప్రశస్తిం
నమామి నారాయణసత్కవీంద్రమ్.

(మొదటిశ్లోకమున మాతాపితృపరముగాను పార్వతీ పరమేశ్వరపరముగాను నర్థద్వయము నెన్నునది. రెండవశ్లోకమున గురువులగునారాయణపండితులపక్షముగాను విష్ణుపక్షముగాను నర్థద్వయము నెన్నునది. 'భ్రాతృజాయామ్' అను కాళిదాసప్రయోగమునుబట్టి భ్రాతృసుతశబ్దసమాసము గురుపరార్థమున సప్రమాణమగుచున్నదని యెఱుఁగునది.)

30—4—1930 }
విజయనగరము. }

ఇట్లు గురుజనవిధేయుఁడు,
వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి

# విషయసూచిక.

పేరాలసంఖ్య.

పేరాలసంఖ్య.

# బాలసరస్వతీయ పీఠిక.



1. శ్రీమత్సకలభాషాకవితాస్వతంత్ర భట్టారక యొల కూచి బాలసరస్వతీమహోపాధ్యాయుఁడు నన్నయభట్టారక విరచిత శబ్దానుశాసనాపరనామ కాంధ్రశబ్దచింతామణికి బాల సరస్వతీయ మను పేర నొక టీక వ్రాసియుండె నని యీవఱకుఁ బండితమండలికెల్ల విదితచరమే. ఆంధ్రశబ్దచింతామణి యాం ధ్రవాఙ్మయమహోదయారంభకాలమగు పదునొకండవశతాబ్ది మున నన్నయభట్టారకునిచే రచింపఁబడినదయ్యుఁ గొంత కాలము వఱకు విస్మృతవ్యాప్తినందక కొంత యడంగి యుండి తుదిఁ గీతని మూలమున నాంధ్రలోకమున మహా ప్రసిద్ధిఁగాంచినది. వేయేల! ఈతనికిఁ దర్వాత వెలసిన యాంధ్రవ్యాకరణములెల్లఁ జింతామణి ననుసరించునవే యై యున్నవి.

నన్నయభట్టారకుఁడు సకలాంధ్రకవితాప్రవర్తకుం డనియు శబ్దశాసనుఁ డనియుఁ జెప్పుటయే గాక బాలసరస్వతి, యాంధ్రశబ్దచింతామణిని సైతము శబ్దానుశాసనమని యీ క్రిందిరీతిని వక్కాణించియున్నాఁడు.

వ. "ఆంధ్రశబ్దచింతామణిం దెలిఁగించెద. ఇది తొల్లి సకలకవితాప్రవర్తకుం డగు శబ్దశాసనుండు సకలకవిజనహితంబుగా యథోచిత

ఈ. "పన్నుఁగ నన్నయాఖ్యకవి యాకలికాదిని జెప్ప దాని భీ
మన్న హరించె..." (అప్పకవీయము. 1 ఆ. 96 ప.)

ఈ యప్పకవీయపద్యములో నిక్కలియుగమున మొట్ట మొదట నన్నయభట్టు చింతామణిని రచించె నని యర్థము చేసినచో నిందలివిరోధము నివర్తించును.

3 అప్పకవికిఁ దర్వాతివాఁడగు నహోబలపండితు డను, నప్పకవీయమునకు మూలమగు చింతామణిమాతృకయు లభించియున్నను నాతఁ డందలి యనేకపాఠభేదముల నుపేక్షించి బాలసరస్వతిమాతృకను నాతని టీకను ననుసరించియే చింతామణి కహోబలపండితీయమను నామాంతరముగల కవిశిరోభూషణ మనెడి సంస్కృతభాషామయమగువిశాలవ్యాఖ్యానమును రచించెను.

"పాఠభేదాస్తుబహవో దృశ్యంతే పుస్తకద్వయే,
మయా ప్రాయస్సరస్వత్యాః పుస్తకం పరిగృహ్యతే."

అని యహోబలపండితుఁడే చెప్పియున్నాఁడు. (చూడుఁడు. అహోబలపండితీయపీఠిక).

("అహోబిలపండితుఁడు, అహోబిలపండితీయము" అని వ్యవహరించుటయే సాధుపద్ధతి యైనను నీవఱకుఁ గవిశిరోభూషణమునం దెల్లయెడల 'నహోబల' శబ్దమే వాడఁబడుటం జేసి సంజ్ఞావిషయమునఁ బైరీతిని జెప్పినను క్షతిలేదన్న తలంపునఁ జేసు మార్పలేదు చూడుఁడు. ఆంధ్రవిజ్ఞానసర్వస్వము.)

4. 'గోరువ్రాసినఁ బటమువ్రాసె' అను సామెతచొప్పున 'సిద్ధుఁడు చింతామణిని దనకిచ్చెను' అనిచెప్పిన బాలసరస్వతి

మాట నాధారముగాఁగొని యప్పకవి చెప్పిన, యవిశ్వసనీయం
బును, నన్నయభట్టీకర్తృకత్వచరిత్ర మూలచ్ఛేదకంబును నగు
సారంగధరచరిత్ర మనెడి పుక్కిటిపురాణముతో సంబంధించిన
స్వప్నవృత్తాంతమునుమాత్ర మీయహోబలపతి నిశ్చయ
ముగ విశ్వసించి యాయప్పకవి యల్లిక నెల్లఁ గవిశిరోభూషణ
టీకలో గీర్వాణించియున్నాఁడు. పై విషయములు చదువరు
లకు విశదపడుటకయి బాలసరస్వతి చెప్పిన విషయములను
వానిని మూలముగాఁ గొని యప్పకవి యల్లినయల్లికను నహో
బలపతి దానిని గీర్వాణించినశ్లోకములను నిట నుదాహరించు
చున్నాను.

"ఒక్కనాఁడు విద్యానగరిలో నచింత్యకారణోహాగమ
స్నేహసాహచర్యుఁ డగు శివయోగివర్యుచే దైవచోదనం
బరిప్రాప్తమైన యాంధ్రశబ్దచింతామణి గ్రంథంబునకు లోకో
పకారార్థంబుగాఁ టీకఁ గావింపఁగోరి నెమ్మనంబున,

ఉ. 'ఏమి మహాద్భుతం బిది హరీ హరి! యెక్కఁడియాంధ్రశబ్దచిం
తామణి ఫక్కి! యెక్కఁడి మహార్ణవగంబు యుగాదిసంభవం
బై మని చన్న నన్నయమహాకవి యెవ్వఁడు! సిద్ధుఁ డెవ్వఁడు! డా
హా! మదగ్యప్రభ్యసమదగ్రతఁ జేతఁ జెందె నిన్నియున్.

మ. ఇలఁ బ్రహ్మాదిఖలా కవుల్ మునుప లేరే! వారు వ్యాఖ్యానక
ర్తలు కానోపరె! వెక్కసక్కెము లంకర్యాకృతమై యున్నయీ
తెలుఁగు వ్యాకరణంబు నాకొసఁగెఁ బ్రీతిం టీకఁ గావింపుమం
చల సిద్ధుండు మదిష్టదేవత విరూపాక్షుండు నిక్కంబుగన్.'

('తెలుఁగు న్వ్యాకరణంబు' అను-చో స్థిరపరకత్వమునం
డు నుమాగమము వచ్చుటయుఁ గలదు. 'సిబ్బెపున్నె తెలి' అల్ల
సాని పెద్దనయుత్పలమాల.) 'అని గణించి...'

(బాలసరస్వతీయపీఠిక 3, 4, 5.)

తే-గీ. "..., తలఁచిచూచిన నాకుల దైవ మగుచు, ......
పిలిచె నొకరుఁడు నాదు ముంగలను గలను......

తే-గీ. ఆంధ్రశబ్దచింతామణి వ్యాకరణము
మును రచియించి తత్సూత్రములఁ దెలుంగు
బాసఁ జెప్పెను నన్నయభట్టు తొల్లిఁ
బర్వములు మూఁడు శ్రీమహాభారతమున.

వ. ఆసమయంబున.

తే-గీ. భారతముఁ దెనిఁగించుచుఁ దా రచించి
నట్టి రాఘవపాండవీయము నడంచె
ఛందమునడంప నీఫక్కి సంగ్రహించె
ననుచు భీమన యెంతయు నడఁచెఁ దాని.

... ... ... ... ...

తే-గీ. రాజరాజనరేంద్ర తనూజుఁ డార్య
సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు
నన్నయరచించునెడఁ బఠనం బొనర్చె
నన్యు లెవ్వ రెఱుంగ రీయాంధ్ర ఫక్కి.

క. అతఁడు తనకాళ్లు చేతులు
మతిచెడి జనకుండు తఱుఁగ మత్స్యేంద్రుని సం

గతి నది క్రమ్మఱ మొలచిన
క్షితి సిద్ధులఁ గలసి యొక్క సిద్ధుం డయ్యెన్.

క. ఆలోక పతుఁడు మొన్నటి
కీలక సమ మామతంగగిరికడ నొసఁగెన్
బాలసరస్వతులకు నక
డోలిఁ దెలుఁగు టీక దాని నొప్పుగఁ జేసెన్.

క. ఇల నెపుడైన తెలుఁగార్యులు
గలిగి పరిచ్ఛేదపంచకంబునఁ బగు నీ
విలసిత షట్క మతంగా
చల విప్రుఁడిచ్చెఁగాన నీదు సదనము చేరన్.

క. ......వాసిం, జెలిఁగింపఁగ నీకుఁ దోడు నే నిపు డగుదున్.

... ... ... ... ...

చ. అని యతఁ డానతిచ్చి చన నంతట మేల్కని నాల్గుదిక్కులుం
గనుఁగొని యద్భుతంబు, గురుకంబున డెందమునం బెనంగ వే
గినఁ గల కేరి బద్ధమని కేరుచు నుండెడు వేళ నామతం
గనగ నివాసి పుస్తకనికాయధరుం డొకరుండు వచ్చినన్."

(అప్పకవీయము. 1 ఆ. 42—65 ప.)

శ్లో. "యజ్ఞానపూర్వధియ ఏవ సుధీవతంసా
నిర్ధూషణాంధ్రకవితాభరణం భవంతి,
సోఽయం సుధీ జనశిరోమణి రాంధ్రశబ్ద
చింతామణి ర్విజయతేఽధికగూఢభావః.

శ్లో. సేయం కృతి ర్వేములవాడ భీమ
ప్రబంధక ర్త్రాహితమత్సరేణ

గోదాజలేనాశమవాపితాభూ
దిత్యుద్గతాసీద్భువి కిం వదంతీ.

... ... ... ... ...

శ్లో. వాచానుశాసనాదూర్ధ్వమి లోకవాచానుశాసనాత్,
నిర్మాణకాలవివేమం గ్రంథం జగ్రాహ బుద్ధిమాన్.
శ్లో. రాజరాజ తనూజాత స్సారంగధర బాలకః,
సక్త్వత్ర పాణిపాదేన రహితోఽజని హేతునా.
శ్లో. మత్స్యేంద్రనామసిద్ధేంద్ర మహిమ్నా సిద్ధతాం గతః,
జగ్రాహ వ్యాకృతిం తస్మా త్కవి ర్బాలసరస్వతీ.
శ్లో. ఎలకూచికులాంభోధి శరద్రాకా నిశాకరః,
సమస్త కవితాదక్షో వత్సరే కీలకాహ్వయే.
శ్లో. తత్ర పంచపరిచ్ఛేదా శ్శబ్దశాస్త్రే నియంత్రితాః,
ఆర్యాఖ్యాపద్యై స్తత్సంఖ్యా సమ్మితాస్యా ద్గద్యై ర్గద్యైః.
శ్లో. మతంగశైల విప్రేంద్రా దస్యాద్వ్యాకృతి పుస్తకమ్,
కాకునూ ర్యప్పకవినా గృహీతం తత్ర పద్గతాః.
శ్లో. పాఠభేదా స్తు బహవో దృశ్యంతే పుస్తకద్వయే,
మయా ప్రాయ స్సరస్వత్యాః పుస్తకం పరిగృహ్యతే.
అప్పార్య పుస్తకారూఢ పాఠభేదాద్య దుత్థితమ్,
మయా సంగృహ్యతే రూపం తదప్యాధర్వణోక్తితః."

(కవిశిరోభూషణ గ్రంథాదిపీఠిక.)

5. అహోబలపండితుఁడు గ్రంథచరిత్రవిషయమునఁ బై రీతి నపమార్గమునఁ బడినను బాలసరస్వతీయాప్పకవీయములనేగాక యధర్వణకారికావళినిగూడ నాధారముగఁ జేసి

కాని యాంధ్రశబ్దచింతామణి కొక సంస్కృతభాషామయమగు విశాలమైన వ్యాఖ్యానమును రచించి యాంధ్రలోకమునకు మహోపకార మొనరించెను. ఈవ్యాఖ్యానముమూలముననే చింతామణివలెనే యడఁగియున్న వికృతివివేకమనెడి యథర్వణకారికావళియు నాంధ్రలోకమున వ్యాప్తినందెను. నేఁటికిని నథర్వణాచార్యవిరచిత వికృతివివేకపుఁ బ్రత్యేకమాతృక యెచ్చటను నుపలబ్ధమై యుండలేదు. ఎల్లరును నహోబలపండితీయమునుండియే యథర్వణకారికావళిని సంపాదించుచున్నారు. తుద కథర్వణకారికావళికిఁ టీకవ్రాసిన వ్యైతింత్రిణీ టీకాకారుకవిగారును బైరీతినే సంగ్రహించియున్నారు. ఈ విషయము నారచించిన యథర్వణకారికావళి పీఠికలో విశదీకరింపఁబడియున్నది. (10 పుట. 43 పుట.)

ఈవికృతివివేక మథర్వణాచార్యులచేఁ బదుమూఁడవ శతాబ్దమునాఁటని రచింపఁబడినది. ఆంధ్రశబ్దచింతామణి సాధారణముగాఁ దత్సమపదరూపనిరూపణమాత్ర ప్రవణమై యుండుటం జేసియు నట్టి తత్సమశబ్దరూపసాధనవిషయమునఁగూడఁ గొంత పూరింపవలసియుండుటం జేసియుఁ దచ్ఛేషభూతమగు నాంధ్రవ్యాకరణవిషయజాలమును విపులముగా నథర్వణాచార్యుఁడు వివరించి యాంధ్రభాషకు విశాలమగు వ్యాకరణము లేని కొఱంతను జాలవఱకుఁ దీర్చెను. వేయేల! వికృతివివేకములోని వ్యాకరణవిషయబాహుళ్యము నేఁటి బాలవ్యాకరణ త్రిలింగలక్షణశేషాదులలోఁగూడ లేదనుటకు సందేహము లేదు.

6. అథర్వణకారికావళి బాలసరస్వతికిని నప్పకవికిని లభించియుండలేదు. కావుననే బాలసరస్వతీయాప్పకవీయములు కవిశిరోభూషణమువలె విషయబహుళములు కాఁజాలవయ్యెను.

బాలసరస్వత్యప్పకవులకు వికృతివివేకము లభింపకున్నను బండితపరంపరాయాతముగాఁ గొన్ని యథర్వణకారికలు వారికి శ్రుతిగోచరము లయ్యె ననిమాత్రము గ్రహింపవలసియున్నది. బాలసరస్వతి తన టీకలో ననేకస్థలములం దథర్వణకారికల నుదాహరించుచు వచ్చెను అప్పకవి కొన్ని కారికల నాంధ్రీకరించియున్నాఁడు.

"ఊష్మరేఫాక్ పరిత్యజ్య ద్విత్వం సర్వహలాంమతమ్."
(బాలసరస్వతీయము. 61 శ్లోకము. హలంతపరిచ్ఛేదము. 20 సూ.)

"ఆంధ్రం షడ్వర్ణపర్యంతం సంస్కృతేన సమస్యతే."
(బాలసర. 71 శ్లో. హలం. 44 సూత్రపువ్యాఖ్య.)

"మదీ లిర్వ్యగ్జడస్త్రీషు తేష్వర్థేష్వేకతాం గతౌ."
(బాలసర. 79 శ్లో. క్రియా. 21 సూత్రపువ్యాఖ్య.)

"ప్రార్థనార్థే మురేకత్వే కథ్యతే మధ్యమార్థకః,
విభాషేతి వదంత్యేకే న పాణినే తు కదాపి చ."
(బాల. 81 శ్లో. 24 సూ.)

"తత్రోభయోర్భవేదేకో లకార ఇతి కేచన."
(బాలసర. 84 శ్లో. క్రియా. 33 సూ.)

"పూర్వస్య వటికారోనోః." (బాల. 87 శ్లో. క్రియా. 40 సూ.)

"కేచిన్నాంతాచ్చ గుర్వాదే ర్వ్యవస్థయా త్వట్టిమూచిరే,
ఏకత్తి మాత్రం సర్వత్ర మహితం హ్యట్టువర్ణకాత్,
భవేత్పుంః స్త్రీ సమానాన్ను ఉత్వం కస్మిఙ్ఞ పరేభవేత్,
హ్యాద్వేచ ప్రతిరేకార్థే హాలో ప్రత్యయమిష్యతే."
(బాలసర. 87 శ్లో. క్రియా. 40 సూ.)

బాలసరస్వతికి లభించిన పై కారికలు పండితశ్రుతి పరంపరాయాతము లగుటంజేసి వానియందు స్వల్ప వ్యత్యాసము లుండుట తటస్థించె నని తోఁచుచున్నది.

"పూర్ణేందు పద్మశః పూర్ణ త్వర్ధ త్వర్ధేందు సన్నిభః."
(వికృతివివేకము. సంజ్ఞ. 32.)

తే.గీ. "సగము జాబిల్లివలె వ్రాయ సగము సున్న
నిండు జాబిల్లివలె వ్రాయ నిండుసున్న."
(అప్పకవీయము. 2 ఆ. 40 ప.)

శ్లో. "వరశార్ఙ్గ పిప్పలదళాంకుశపన్నగ సన్నిభాః క్రమా త్పరుషాః,
స్తంభనిరేఖాబద్ధై, స్త్వపిచ వర్గ ద్వితీయవర్ణాద్యాః."

అను చింతామణిశ్లోకమును దానిని సవరించుచున్న యీ క్రింది యథర్వణకారికలను మేళగించి యీ క్రిందిరీతి నప్పకవి యాంధ్రీకరించెను. ఇది యంత సరిగా లేదు. దీనినహో బలపతి కొంత సవరించి వ్యాఖ్యానముచేసెను.

శ్లో. "పంచవర్గాద్యయోవర్ణా స్తింభిశాఙ్గాది సన్నిభాః,
తిర్యగ్రేఖాయుజ శ్చోర్ధ్వం దండరేఖాన్వితా అధః.

త ఏవ చ ద్వితీయాః స్యు రూర్ధ్వరేఖా ద్వితాన్వితాః
ప్రక్రమా స్తు తృతీయాః స్యు స్తృతీయా స్తే చతుర్థకాః,
రేఖాద్వయాధో దండేన యుక్తా స్స్యు రనునాసికాః.
(వికృతివివేకము. సంజ్ఞా. 32 సూ.)

సీ. "శంఖశార్ఙ్గద్విపాశనదళాంకుశ షన్ను
గాకృతులను మీఁద నడ్డరేఖ
పలకల నొక్కటి నిలుపంగఁ బరుషంబు
లైదును వరుసఁ జెన్నారుచుండుఁ
గ్రిందఁ గంబము పోల్కి గీటొక్కటిడిన నా
ద్యములు రెండవలిపు లై పొసంగుఁ
బై నున్న గీటు లిబ్బడిసేయఁ బ్రక్రమాక్ష
రంబులు సరళవర్ణంబు లగును
తే.గీ. కంబ మొక్కటి రేఖాయుగంబు క్రింద
వ్రాసినఁ దృతీయమును జతుర్థంబు నగును
నిలుపు గీటులు రెండును గలిసి తమ్ముఁ
గదియఁ దొల్లిటి వనునాసికంబు లగును." (అప్ప. 2 ఆ. 42 ప.)

శ్లో. ప్రాకృతే తద్భవే చాపి చ జౌ దంత భవౌ స్మృతౌ."
(వికృ. సంజ్ఞ. 8.)

తే.గీ. ప్రాకృతమునందుఁ దద్భవ పదమునందు
దంత్యములె కాని తాలుజాంతములు లేవు."
(అప్పకవీయము. 2 ఆ. 140 ప.)

శ్లో. "తృతీయోఽచ్చ తృతీయోష్మా తృతీయే సరళాస్త్రయః,
షోడశవ్యంజనం చాపి షష్ఠస్థానే నయుజ్యతే."
(వికృతివివేకము. సంజ్ఞా. 29.)

దుదలఁ గ్రియఁ దక్క నెత్వంబు గడియదాది
నత్వ మిడరాదు తెలుఁగున నబ్జనాభ.

(కవిసంజీవని.)

శ్లో. పపుషావా న్వరూపేణ ప్రథమాంతో పస్థితాః,
కాకా సంబోధనే చాపి వ్యావ్యయే కర్మధారయే,
అచేతనార్థకేశబ్దా ఇతి శృంగారభూషణః.

(వికృతివివేకము. సంధి 14.)

ఆ-వె. సంధిఁ గూర్పంగఁ బ్రథమాంతశబ్దవితతి
పై 'క చ ట త ప' లకు వికల్పంబు సెల్లుఁ
గాకు సంబోధనావ్యయకర్మధార
యంబుల నచేతనంబుల నబ్జనాభ.

(కవిజనసంజీవని. 1 ఆ.)

శ్లో. "ధూర్తమూర్ఖాసిచ వృధా వృపంతావపి సమ్మతే,
ఉత్వేనైవ భవం త్యన్యే ప్రయోగ స్తత్ర కారణమ్."

(వికృతివివేకము. అజం. 27)

ఆ-వె. ధూర్త ముఖ్యపదచతుష్టయం బగు నుత్వ
మేనిడుత్వమేని కృష్ణువలన
ధూర్తు నీచుమూర్ఖుఁ ద్రుంచెను గృష్ణుండు
చేసె రాజ్య ముగ్రసేనుఁ డనఁగ.

(కవిజనసంజీవని. 2 ఆ.)

(ఇందుఁ బైశ్లోకములోని పదచతుష్టయమును స్మరించి యందు మూఁడిటినిమాత్రమే యుదాహరించుటంజేసి యీ పద్యము పైశ్లోకము ననుసరించి పుట్టిన దనుట నిర్వివాదము గదా!)

పై రీతినే తాతంభట్టుకవి చింతామణియందును గొన్ని యథర్వణకారికల యర్థము చెప్పఁబడియున్నది.

ఈయిరీతిని నాంధ్రశబ్దచింతామణికి వివరణగ్రంథమగు వికృతివివేకములోని కారికలను బాలసరస్వత్యప్పకవులును వారికిఁ బూర్వులును నుదాహరించుచును వివరించుచును నుండఁగా నాంధ్రశబ్దచింతామణి బాలసరస్వతుల కాలము నాఁటిదనియు నథర్వణకారికావళి యహోబలపతికృతమనియుఁ గీర్తిశేషులగు రాయబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులవారు సిద్ధాంతము చేయుట ప్రామాదిక మనక తీర కున్నది.

7. వెనుక నుదాహరించిన యహోబలపతి శ్లోకముల చొప్పున నాంధ్రశబ్దచింతామణిలో ననేకములగు పాఠభేదము లున్నవి. వానిని మున్ముందు విమర్శింపనున్నాను. ప్రకృతమున బాలసరస్వతీయ టీకామాతృకల పరస్పరభేదమును విమర్శించెదను. ఈవఱకు నాకు లభించియున్నట్టి బాలసరస్వతీయమాతృకలలో నర్థోదాహరణముల విషయమున మాత్ర మన్నిటికిని నైక్యము చాలవఱకు వెలయుచున్నను నట్టి యర్థమును బోధించువాక్యములు భిన్నభిన్నశబ్దఘటితములై యగపడుచున్నవి. వేయేల! వానిని బరిశీలించునపుడు బాలసరస్వతీయ టీకావాక్యములలోనిశబ్దము లర్థభంగము లేకుండ లేఖకాదులచే యథేచ్ఛముగ వ్రాయఁబడుచు వచ్చిన వని తోఁచకమానదు. కాఁగా బాలసరస్వతీప్రయుక్తవాక్యములతోనున్న టీకదుర్లభమే యయ్యెననుటకు సందియము లేదు. దీనినిబట్టి యొక్క బాలసరస్వతీయమే గాక ప్రాచీనులవచనరచ

నము లనేకము లిట్లే మార్పునందెనవనియు ఛందఃప్రతిబంధాదికము లేకుండుటచే నట్టిమార్పు గల్గుట కవకాశము సంభవించెననియు నూహింపవలసియున్నది. కావున వచనరచనములందలి శబ్దములను జూపుచుఁ బ్రాచీనులకు వచనములలో లక్షణవిరుద్ధమయినను వ్యావహారికాంధ్రమును వాడుట సంప్రదాయమనెడి నేఁటి క్రొందఱవాదము సరికాదనక తీరదు. అట్లగుటంజేసియే యీబాలసరస్వతీయము నేఁటికి లభించిన మాతృకలను బట్టి యథార్థముగా సవరింపఁబడి ముద్రితమయ్యెను.

పై విషయములు చదువరులకు విశదపడుటకయి నాకు లభించిన బాలసరస్వతీయమాతృకలరీతి నిటఁ జూపుచున్నాను. అందును ముందుగఁ బ్రాచ్యలిఖిత పుస్తకభాండాగారస్థమాతృకలస్వరూపమును జూపెదను.

౧. '11-12-5'అను నెంబరుగలమాతృక. ఇది కాగితపుఁ బుస్తకము. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారపుఁ గేటలాగులో (మదరాసు) నిది యొక్కటిమాత్రమే బాలసరస్వతీయమను పేరితో నున్నది. ఇపుడు ముద్రింపఁబడు బాలసరస్వతీయ మీమాతృకయొక్క ప్రతికయే యై యున్నది.

ఈభాండాగారములోనున్న మాతృకలలో నెల్ల నిదియే యీక్రింద వివరింపఁబోవుమాతృకలన్నిటితోను ముఖ్యముగాఁ గరకవలసమాతృకతోను విజయనగరపు మాతృకతోను బూర్ణమగు సంవాదము గల్గియున్నది.

ఈ భాండాగారములో బాలసరస్వతీయ టీకాపుస్తకములు నాల్గుగలవు. అందులోఁ బైనివ్రాసిన '11-12-5'నెంబరు

గల పుస్తకమాత్రమే కేటలాగులో బాలసరస్వతీయ మన్నపేరితో నున్నది. తక్కినమూఁడును 'ఆంధ్రశబ్దచింతామణిటీక' అనుపేరితో నున్నవి. ఆమూఁడిటిలో సైతము 'R 257 = K 3-75' అను నెంబరు గల మాతృక యెంత మాత్రమును బాలసరస్వతీయము కాదు. దీనిని సంపాదించి కొంతసవరించి ముద్రించినదే యీవఱకు వావిళ్లవారిచే విక్రయింపఁబడుచున్న యాంధ్రశబ్దచింతామణి టీక. ఇయ్యది బాలసరస్వతీయ మనుపేరితో నీవఱకుఁ గొందఱిచే ముద్రింపఁబడినది. అం దొకదాని ముఖపత్రమునఁ బురాణం హయగ్రీవశాస్త్రులుగారిచేతఁ బరిష్కృతమైనట్లును ప్లవంగసంవత్సరాశ్వయుజ శుద్ధాష్టమి (క్రీ. శ. 1846 సం.) యందు ముద్రితమైనట్లును నున్నది. రెండవదాని ముఖపత్రమున 'శ్రీ. అనంతాచార్యులు'గారిచేఁ గొన్ని సవరణములతోఁ బరిష్కృతమగుచు క్రీ. శ. 1895 సంవత్సరమునఁ బునర్ముద్రణము చేయఁబడినట్లు వ్రాయఁబడియున్నది. ఈటీక వ్రాసినవారు నిజమగు బాలసరస్వతీయమును జూడనైన లేదనియుఁ జింతామణికి బాలసరస్వతీయమనుటీక గలదని వ్రాసిన యన్యకవీయ గ్రంథమును జూచి యీవఱకు బాలసరస్వతీయము బయలుదేఱియుండకుండుటచేఁ దమటీకకా పేరు పెట్టివేసిరనియుఁ దోఁచుచున్నది. ఇది బాలసరస్వతీయము కాదనుటకుఁ గొన్ని నిదర్శనముల నీక్రిందఁ జూపుచున్నాను.

9. I. మొట్టమొదటిదగు 'విశ్వశ్రేయః కావ్యమ్' అనుదానికి 'కావ్యం=కావ్యము, విశ్వశ్రేయః = సర్వధర్మములలో శ్రేష్ఠము' అని యిట్లు ధర్మకార్యములలోనికెల్లఁ

గల పుస్తకముమాత్రమే కేటలాగులో బాలసరస్వతీయ
మన్న పేరితో నున్నది. తక్కినమూఁడును 'ఆంధ్రశబ్దచింతా
మణిటీక' అను పేరితో నున్నవి. ఆమూఁడిటిలో సైతము
'R 257 = K 3-75' అను నెంబరు గల మాతృక యెంత
మాత్రమును బాలసరస్వతీయము కాదు. దీనిని సంపాదించి
కొంతసవరించి ముద్రించినదే యీవఱకు వావిళ్లవారిచే
విక్రయింపఁబడుచున్న యాంధ్రశబ్దచింతామణి టీక. ఇయ్యది
బాలసరస్వతీయ మను పేరితో నీవఱకుఁ గొందఱచే ముద్రిం
పఁబడినది. అందొకదాని ముఖపత్రమునఁ బురాణం హాయ
గ్రీవశాస్త్రులుగారిచేతఁ బరిష్కృతమైనట్లును ప్లవంగసంవత్స
రాశ్వయుజ శుద్ధాష్టమి (క్రీ. శ. 1846 సం.) యందు ముద్రి
తమైనట్లును నున్నది. రెండవదాని ముఖపత్రమున 'కొ. అనం
తాచార్యులు'గారిచేఁ గొన్ని సవరణములతోఁ బరిష్కృత
మగుచు క్రీ. శ. 1595 సంవత్సరమునఁ బునర్ముద్రణము
చేయఁబడినట్లు వ్రాయఁబడియున్నది. ఈటీక వ్రాసినవారు
నిజమగు బాలసరస్వతీయమును జూడనైన లేదనియుఁ జింతా
మణికి బాలసరస్వతీయమనుటీక గలదని వ్రాసిన యప్పకవీయ
గ్రంథమును జూచి యీవఱకు బాలసరస్వతీయము బయలు
దేఱియుండకుండుటచేఁ దమటీక కాపేరు పెట్టివేసిరనియుఁ
దోఁచుచున్నది. ఇది బాలసరస్వతీయము కాదనుటకుఁ గొన్ని
నిదర్శనముల నీక్రిందఁ జూపుచున్నాను.

9. I. మొట్టమొదటిదగు 'విశ్వఃశ్రేయః కావ్యమ్'
అనుదానికి 'కావ్యం=కావ్యము, విశ్వశ్రేయః = సర్వధర్మము
లలో శ్రేష్ఠము' అని యిట్లు ధర్మకార్యములలోనికెల్లఁ

గావ్యరచన ముత్తమకార్యమని యీమాతృకతప్పఁ దక్కిన బాలసరస్వతీయమాతృకలందెల్ల వ్రాయఁబడియున్నది. ఇట్టి బాలసరస్వతియర్థమునే గ్రహించి తర్వాతివాఁడగు నప్పకవి

క. ధర్మములలోన నుత్తమ,ధర్మము కావ్యము నిజంబు...
(అప్పకవీయము. 1 ఆ. 14 ప.)

అని వివరించియున్నాఁడు. ఈటీకయం దన్ననో "కావ్యం= కావ్యము, విశ్వ=ప్రపంచమునకు, శ్రేయః=శ్రేయస్కరము" అని యి ట్లహోబలపండితీయనిర్గళితార్థము వ్రాయఁబడి యున్నది.

II. "శాస్త్ర మపౌరుష మాద్య" మిత్యాదిశ్లోకము గాని దానికిఁ డీకగాని తక్కిన బాలసరస్వతీయమాతృకలలో లేదు. అహోబలపండితీయమున నాశ్లోకము సందర్భాంతర మున నుదాహరింపఁబడియున్నది. కాని యందును నయ్యది మూలములోఁ జేర్పఁబడలేదు. దానికి వ్యాఖ్యానమును, జేయఁబడియుండలేదు. అట్లయినను నద్దానిని మూలములోఁ జేర్చి, యేతట్టీకాకర్త దానికిఁ ఢీక వ్రాసెను.

III. మఱియు "నస్యాత్తద్ధర్మోఽతః" అనునది మొద లగు ననేకసూత్రముల కీటీకలో నపార్థములు వ్రాయఁబడియు న్నవి. తక్కిన బాలసరస్వతీయమాతృకలలోని టీకలలోను, నప్పకవీయాహోబలపండితీయవ్యాఖ్యలలోను నట్టి యపార్థ ములు లేవు. (44 పేరా.)

"నస్యాత్ తద్ధర్మ్యోతః" అను సూత్రమిట్టీకాకర్తచే "నస్యాత్తద్ధర్మ్యోతః" అనుచేసిరి మార్చఁబడెను. "తద్ధర్మ్యోతః-తద్ధర్మ=తద్ధర్మాదిక విశేషణముయొక్క, ఉతః = ఉకారమునకు, అచి = అచ్చుపర మగుచుండఁగా, నః = నకారము, స్యాత్ = అగును......ఇచ్చ్య నచ్చ్యతఃఇడు."

అని యిట్లాకృతక బాలసరస్వతీయమున వ్యాఖ్య చేయఁబడెను. ఆంధ్రశబ్దచింతామణిలో నీసందర్భమునఁ బరరూప సంధియగుచోటులును, గానిచోటులునుమాత్రము చెప్పఁబడుచున్నందున నకారాగమవిధానము నిటుఁ జేసె నని యర్థము చేయుట యెంతమాత్రమును బొసంగనేరదు.

"సంధిర్నా బోచ్యతతోవాతో నాదిషు పట్రిష్వాతో నా, నిత్యమను త్తమపురుషక్రియాస్వితః పరిమితా సమస్తానాం; నస్యాత్తద్ధర్మోత శ్చేద్వాన్యాదేస్తు ద్రుమాన ఇహితస్య, తస్య త్తదాదిజస్య ప్రాయస్తు స్యాత్క్రమాదికస్యేతః"

(ఆంధ్రశబ్దచింతామణి, సంధిపరిచ్ఛేదము. 1-2 శ్లో.)

పయి యాంధ్రశబ్దచింతామణిశ్లోకములను బరిశీలించు నపుడు పైటీక కేవలము ప్రామాణికమై యున్నదని యెవ్వరికైనఁ దోఁచకమానదు గదా! నిజమైన బాలసరస్వతీయమాతృకలం దెందును నిట్టియపార్థము లేదు. 'తద్ధర్మోతః=తద్ధర్మక్రియలయందుండు ఉకారమునకు, నస్యాత్=సంధిలేదు. రక్షించునంబ, పోషించునీశ్వరి' అని యున్నది.

IV. ఇంతియగాక బాలసరస్వతీయములో నున్న వనుచు సహోబలపండితుఁడు తనవ్యాఖ్యానమున నుదాహ

ంచిన యా క్రింది కొన్ని విషయములు, తక్కిన బాలసర
స్వతీయమాతృకలలో నెల్ల నగపడుచుండఁగా నీటీకయందు
లేవు.

i. " మహాకవిప్రయోగరూఢంచేద్గ్రామ్య మపి ప్రయోగార్హ మిత్యా
చార్యతాత్పర్య మితి బాలసరస్వత్యోక్తమ్"
(అహో. 117 పుట.)

" ప్రయోగసిద్ధము గ్రామ్యమైనను యోగ్యమే యని వాగనుశాసనుల
వివక్ష"
(బాలసరస్వతీయము, విరళానిత్యాదిశ్లోకవ్యాఖ్య. సంజ్ఞా. 17 సూ.)

ii. " బాలసరస్వత్యా త్వత్రాహమాదిశబ్దానా మంతగ స్యానుస్వారస్య
ద్విత్వాయోగా త్తత్స్థానే మకారంకృత్వా తస్యద్విత్వమిత్యుక్తమ్"
(అహో. 203 పుట.)

"సున్నకు ద్విత్వము రానేరదు గాన మకారముచేసికొనునది" (బాల
సరస్వతీయము, అహమాదీనా మిత్యాదిసూత్రవ్యాఖ్య, సంధి.
18 సూ.)

iii. " సరస్వత్యాతు మిన్నేరుశివజటావాసినీత్యాద్యుదాహృతమ్"
(అహో. 320 పుట.)

" మిన్నేరు శివజటాజూటవాసిని" (బాలసరస్వతీయము, నియత
స్త్రీప్రత్యయ ఇత్యాదిసూత్రవ్యాఖ్య. అజం. 61 సూ.)

Vi. "ఆదిశబ్దేనమురువు, ముర్వు; దొరువు, దొర్వు; ఇత్యాది గ్రామ్యమ్.
ఆదిశబ్దేన 'కారోప్పతు' ఇత్యాది గ్రామ్య మిత్యుక్తం బాలసరస్వ
త్యా."
(అహో. 236 పుట.)

ఆదిశబ్దముచేత రేఫాదులకు, నుల్లోపమని తెలియునది. ఎట్లన:—

"కాఉపోతు. కార్పోతు; గాఉపులి, గార్పులి;"

(బాలసరస్వతీయము, కలహాదేరిత్యాదిసూత్రవ్యాఖ్య. సంధి. 41 సూ.)

పై నుదాహరించిన నాలుగుస్థలములలోను మూఁడు స్థలములందలి బాలసరస్వతీయవిషయము లీ టీకలో లేవు. ఇఁక నాలుగవస్థలమునందలి బాలసరస్వతీయగ్రంథమునకు బదులుగా నీటీకయందు "ఆదిశబ్దముచేత మురువు, ముర్వు: దొరువు, దొర్వు; కాఉపోతు, కార్పోతు: ఇత్యాదులూహ్యంబులు" అని యున్నది. ఇందు 'కాఉపోతు, కార్పోతు' అను నుదాహరణము బాలసరస్వతీయములోనిది యీ టీకలో నున్నను నది బాలసరస్వతీయటీకామాత్రమును జూచి వ్రాసినది కాదనియు, నహోబలపండితీయమును జూచి వ్రాయుటలో వచ్చినదనియుఁ బై నుదాహరించిన యహోబలపండితీయగ్రంథమును బట్టి విశదము కాకమానదు గదా!

పై కారణములనుబట్టి యీటీక బాలసరస్వతీకృతము కాదనుటకు సందేహము లేదు. కావుననే దీనిని బాలసరస్వతీయమనక కృతకబాలసరస్వతీయమని నేను వ్యవహరించుచున్నాను.

10. ఇఁకఁ బ్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని తక్కిన రెండుమాతృకలలోను '(R. 296) = K. 25.16-3' అను నెంబరుగల మాతృకలోని తాళపత్రములు తారుమారయి యున్నవి. ఇందు తిరుగఁబడియున్న మొదటితాళపత్రములలో నాంధ్రశబ్దచింతామణి మూలమున్నది. తర్వాత మరలఁ

దిరుగఁబడియున్న 38 తాళపత్రములలో 'విశ్వశ్రేయ' ఇత్యాది శ్లోకము మొదలు హలంతపరిచ్ఛేదములోని 'దేశ్యాదస్మ' దిత్యాది శ్లోకమువఱకుఁ గల చింతామణికిఁ బాలసరస్వతీయ టీక గలదు. తర్వాత మరలఁ దిరుగఁబడియున్న తాళపత్రములలో సంజ్ఞాపరిచ్ఛేదములోని స్వస్థానేత్యాది సూత్రము మొదలు దేశ్యాదిత్యాదిసూత్రమువఱకుఁ గల చింతామణికి బాలసరస్వతీయ టీక గలదు. ఇది నలువదితాళపత్రములతో నున్నది. ఇంకఁ దక్కినది '(R. 142) = K. 25-3-9' అను నెంబరుగల తాటియాకులమాతృక. ఇందు నాకు లభించిన తక్కిన యనేక తాళపత్రమాతృకలలోనున్న యనేక విషయములు లేవు.

పయి కారణములచేతనే ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములోని నాల్గుమాతృకలలోను బయినుదాహరించిన "11-12-5" నెంబరుగల మాతృకయే సంపాదింపఁబడి యిట్లు ముద్రింపఁబడినది. ఈమాతృకను సవరించుటకు భాండాగారస్థమాతృక లసంపూర్ణములును న్యూనవిషయకములును నౌటంజేసి యవి యంతగా నుపయోగపడఁజాలనందున మాతృకాంతరసంపాదన మావశ్యకమయ్యెను. అట్లు సంపాదించిన మాతృకాంతరముల వివరణము నీక్రిందఁ జూపెదను.

11. I. గంజాముజిల్లా కరకవలస. యగ్రహారమున లభించినమాతృక. ఇది తాటియాకులపుస్తకము. దీనిలో బాలసరస్వతీయగ్రంథాదిపీఠిక లేదు. మఱియుఁ జింతామణిలోని మొదటియైదుశ్లోకముల టీకయు లేదు. గ్రంథాంతమునందలి మంగళాచరణపద్యములు లేవు. ఈపుస్తకమునఁ దుదిని

"విభవసంపన్న ఆహోబలహూళి కురువాడం సక్కెనాంకరవ త్రి
కృష్ణుండు బాలసరస్వతీయ వ్యాఖ్యానము వ్రాసినాను."

అని యున్నది. దీనిలో నాశ్వాసాంతములందు బాలసరస్వతి చెప్పిన బ్రహ్మార్పణోక్త్యర్థ్యంబా దేవీకృతిపద్యములు కొన్ని గలవు. చింతామణి పరిచ్ఛేదాంతములందు "ఇతి శ్రీసకల భాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాంధ్రశబ్దచింతామణౌ సంజ్ఞాపరిచ్ఛేదస్సమాప్తః" అని యిట్లు నన్నయభట్టగద్యము లున్నవి. అట్లే టీకాంతమునఁ బరిచ్ఛేదాంతములందు "ఇతి శ్రీసకలభాషాకవిశాస్వతంత్రభట్టారకోత్యాది బాలసరస్వతి గద్యములును నున్నవి.

12. II. విశాఖపట్టణము జిల్లా విజయనగరవాసులగు బ్ర. శ్రీ. నిడదవోలు సుందరంపంతులుగా రిచ్చినమాతృక. ఇదియుఁ దాటియాకులపుస్తకమే. దీనిలో మొట్టమొదట నాంధ్రశబ్దచింతామణి శ్లోకము లెల్ల వ్రాయఁబడినవి. తర్వాత బాలసరస్వతీయటీక వ్రాయఁబడియున్నది. ఇందును బాలసర స్వతీయగ్రంథాదిపీఠిక లేదు. కాని మొదటినుండియుఁ జింతా మణిశ్లోకములకుఁ డీకఁగలదు. ఇందజంతవాలంత పరిచ్ఛేదము లలో నించుక గ్రంథపాత మున్నది. ఇందును బరిచ్ఛేదాంతము లందుఁ గొన్ని 'అంబాదేవీ' కృతిపద్యములును, నన్నయబాల సరస్వతుల పరిచ్ఛేదాంతగద్యములును గలవు. ఇందును గ్రియాపరిచ్ఛేదాంతమంగళాచారపద్యములు లేవు. ఈమాతృ కకును బైనివ్రాసిన కరకవలస మాతృకకును విషయభేద

మేమియు లేదు. మఱియు నీరెండుమాతృకలతోను వెనుక వ్రాసిన '11-12-5' నెంబరుగల ప్రాచ్యలిఖితపుస్తకభాండాగార మాతృక చాలవఱకుఁ దుల్యముగా నుండుటచేత భాండాగారమాతృకలలో నదియే ప్రామాణికముగా గ్రహింపఁబడి యిప్పుడు ముద్రింపఁబడుచున్నది.

13. III. విద్వాన్. అంగలూరి శ్రీనివాసతాతాచార్యులుగారిచ్చినమాతృక. ఇది కాకినాడలో లభించినది. కాగితపుఁ బుస్తకము. దీనిలో బాలసరస్వతీయగ్రంథాదిపీఠిక యున్నది. అంబాదేవీకృతిపద్యములును నన్నయబాలసరస్వతుల పరిచ్ఛేదాంతగద్యములును నిం దున్నవి. ఇందుఁ గ్రియాపరిచ్ఛేదములోని సంప్రార్థనార్థకాదిత్యాది చింతామణిసూత్రము మొదలుకొని తుదివఱకుఁ గలసూత్రముల టీకగల కాగితములు పోయినవి. ఇదియుఁ బై రెండుమాతృకలకుఁ జాలవఱకు సరిపోవుచున్నది గాని యిం దచ్చటచ్చట నుదాహరణాదులం దించుక మార్పులు గలవు.

14. IV. మ. రా. శ్రీ. రావుసాహేబు గిడుగు రామమూర్తిపంతులుగారిచ్చినమాతృక. ఇది తాటియాకులమాతృక. ఇందుఁ గ్రియాపరిచ్ఛేదముమాత్ర మున్నది. ఇదియును బైని వ్రాసిన తాతాచార్యులుగారి మాతృకయుఁ జాలవఱకేకరీతిగ నున్నవి. దీని తుదిని 'పర్వేందుప్రతిమాననే'త్యాద్యంబాదేవీకృతిపద్యము గలదు. గ్రంథాంత మంగళాచారపద్యములు లేవు.

15. V. ఆంధ్రసాహిత్యపరిషత్తువారి మాతృకకుఁ బ్రతి క. ఇది కాగితప్పుఁ బుస్తకము ఇందుఁ బాలసరస్వతీయ టీకాగ్రంథాపేక్షిక గలదు. ఇందును బరిచ్ఛేదాంతములం దం బాదేవీ కృతిసమాప్తములు గలవు. సన్నయబాలసరస్వతీపరిచ్ఛేదాంతగద్యములు కొన్ని పరిచ్ఛేదములతుదిని గలవు. క్రియాపరిచ్ఛేదాంతమునందలి యంబాదేవీకృతిసమాప్తము లేదు. గ్రంథాంతమంగళాచరణపద్యములును లేవు. మఱియు నిందుఁ బై నుదాహరించిన మాతృకలలోని యనేకవిషయములు లేవు. దీని నిందు నేను 'సాహిత్యపరిషన్మాతృక' అని వ్యవహరించెదను.

16. VI. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని 322 నెంబరుగల ముద్రితమాతృక. ఇది బల్లారి నరసింహరాజ సింహాకృతమగు కవిజనాంజనమనెడి చింతామణివ్యాఖ్య. ఇందుఁ జాలభాగము బాలసరస్వతీయమే యై యున్నది.

తే.గీ. "ప్రాస్వమున్ టీక బాలసరస్వతియును
చేసె దానికి జేసి విశేషములను
కవిజనోక్తుల లక్ష్యముల్ గాఁగఁ జేసి
కవిజనాంజన మనెడు వ్యాఖ్యాన మొకటి."

అని యిట్లు కవిజనాంజనవ్యాఖ్యాపీఠసంబద్ధమున వ్రాయఁబడి యుండుటచేత నదియు నొకమాతృకవంటిదే యనఁదగును గాని నరసింహరాజుగారు బాలసరస్వతీయటీకను యథేచ్ఛముగ మార్చుచు నుపయోగించుకొనిరి గాన నయ్యది కేవలము సరి యగు మాతృక యనిపించుకొనదు.

"వాచా మాంధ్రమయీనాం యః ప్రవక్తా ప్రథమోఽభవత్,
ఆచార్యం తం కవీంద్రాణాం వందే వాగనుశాసనమ్."

అనుశ్లోకము ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారస్థమాతృకలలో '11-12-5' '12-16-3' '3-75' అను నెంబరులుగల మాతృకలలో మాత్రము గలదు.

17. పయిని వ్రాసినరీతులు గలయెనిమిదిమాతృకల సాహాయ్యమున వెనుకనుదాహరించిన '11-12-5' నెంబరుగల మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమాతృకను యథార్థముగ సవరించి సంపాదించినదే యిపుడు ముద్రితమగుచున్న యీబాలసరస్వతీయటీక యని పాఠకమహాశయులు గ్రహింతురుగాక !

18. పై నుదాహరించినరీతిని సవరించిన సవరణముల పద్ధతి విమర్శకులకు విశదపఱచుటయును, బాలసరస్వతీయము యథాస్థితముగ గ్రంథకృత్ప్రయుక్తశబ్దఘటితమని యంగీకరించుటకు వలనుపడమింజేసి దానిభాషను వ్యాకరణానుసారముగ సవరించుటయే యుక్తమని విద్వాంసులకు విశదపఱచుటయును నిట నావశ్యకము లై యున్నవి.

కావ్యేతరములును వ్యాఖ్యానరూపములును నగు బాలసరస్వతీయాదులు వ్యావహారికభాషతోనే రచింపఁబడినవనియు నట్టివాని నెల్ల ముద్రణసంస్కర్తలు యథేచ్ఛముగఁ గావ్యభాషామయములుగ మార్చివేయుచున్నా రనియు వ్యావహారికభాషావాదులు చెప్పుచున్నారు. ఈవిషయము యొక్క సత్యాసత్యములు విమర్శకులగు విద్వాంసులకు విశద

పఱచుటయు నావశ్యకమే యై యున్నది. కాఁగా నేఁటికి లభించియున్న బాలసరస్వతీయమాతృకలనుండి కొన్నిపంక్తులు యథాస్థితముగా నిట నుదాహరించుచున్నాను. ఎంచి చూచినట్లు సందేహింపకుండుటకయి మొట్టమొదటిసూత్రపు వ్యాఖ్యనుండియే ముందుగ నలంతిపంక్తు లెత్తి చూపుచున్నాను.

19. “విశ్వశ్రేయః=సర్వధర్మాలలో శ్రేష్ఠము, నానృషిః కురుతే కావ్యం అన్నాడు గనుకాను, యత్తేర్ద్రుష్టిః ... అన్నాడు గనుకనున్ను పవిత్రమనుట” సాహిత్యపరిషన్మాతృక.)

“విశ్వశ్రేయః = సర్వధర్మములలో నున్న శ్రేష్ఠము. నానృషిః...అన్నాడు, యతే ర్ద్రుష్టిః...అన్నాడు గనుకానున్ను పవిత్రమనుట” (కాకినాడమాతృక.)

“అట్టి కావ్యం, విశ్వశ్రేయము=సర్వధర్మములలో శ్రేష్ఠము, నానృషిః...అన్నాడు గనక, ఏతైర్ద్రుష్టిః...అంన్నాడు గనకనుంన్ను పవిత్రము” (విజయనగరమాతృక.)

“కావ్యం=కావ్యము, విశ్వశ్రేయః=సమస్తమైన శ్రేయస్సున్ను అవును. సకలధర్మములలోనున్న శ్రేష్ఠము. నానృషిః కురుతే కావ్యం అన్నాడు గనకనున్ను, యత్తేర్ద్రుష్టిః కవేస్స్వచః అన్నాడు గనకనున్ను పవిత్రమున్ను” (ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని 11-12-5 నెంబరుమాతృక.)

"విశ్వశ్రేయః=సర్వధర్మాలలో శ్రేష్ఠము. నారుషిః కురుతే కావ్యం అన్నాడు గనుకాను, యతేర్ద్రష్టిః కవేర్వచః అన్నాడు గనుకనున్ను పవిత్రమనుట." (ప్రాచ్యలిఖిత 25.8.9 నెం. మాతృక)

'కావ్యం=కావ్యము, విశ్వశ్రేయః=సమస్తమైన శ్రేయస్సు అవుచున్నది. సర్వధర్మములలో శ్రేష్ఠము. యట్లంటే నానృషిః కురుతే కావ్యం అన్నాడు గనుక, యతేర్ద్రష్టిః కవేర్వచః అన్నాడు గనుకనున్ను పవిత్రమున్ను' (ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమాతృక. 25-16-3 నెంబరు గలది.)

2౹. "భవతిక్రియాపదానాం త్రివిధానా మించుగాగమో ణేశ్చ,
అనుబంధ ప్రార్థనయోర్ణా వ్యతిరేకాదికేచచోః పః స్యాత్."
(ఆంధ్రశబ్ద. క్రియా. 76 శ్లో.)

"ఇది రెండుసూత్రాలు......అనుబంధప్రార్థనయోః= అనుబంధద్వయమందున్ను, ప్రార్థనార్థమందున్ను, వ్యతిరేకాదికేచ=వ్యతిరేకము మొదలైన యర్థములయందున్ను, ణిచి= ణిచ్చుకువచ్చేది పరమైవుంటేనున్ను, 'చోః'=ఇంచుగాగమము లోని 'చు' అనేటి అక్షరానకు, పః స్యాత్ = పకారము వచ్చును. ఘటింపుచున్నాడు, ఘటింపగలడు అనుబంధాలు. ఘటింపుము ప్రార్థనము. ఘటింపించె ణిచ్చు పరమై. ఘటింపండు వ్యతిరేకము. ఆదిశబ్దముచేత ఘటింపనోపును మొదలైన తుమున్ ప్రత్యయాద్యర్థాలకున్ను పకారము వచ్చును" (సాహిత్యపరిషన్మాతృక).

"అనుబంధప్రార్థనయోః= అనుబంధప్రార్థనములయందు, ణేః=ణిచ్చుయందున్ను వ్యతిరేకాదికేచ=వ్యతిరేకమనే అభావార్థములయందున్ను, చోః చు వర్ణకమున్ను ఆదేశముగా (పకారము?) వచ్చును. తద్ధర్మార్థములకున్ను ఉదాహరణములు:—పోషించును, నుతించును. ఇవి ఉపకృతిక్రియలు, జయించును, అనుభవించును, సంభవించును, అనుసరించును, ఇవిపరిణతి క్రియలు. అనుకంపించును, అధివసించును, ఇత్యాదులు సంవృతిక్రియలు. యీతద్ధర్మక్రియారూపములయందు 'ప్రథమైకవచనలోపః' ముందర చెప్పిపోయే సూత్రముచేతను ప్రథమపురుషైకవచనమైన తిప్పునకు లోపము వస్తే యీతద్ధర్మక్రియారూపములు సిద్ధించును. ణిచ్చునకు ఉదాహరణములు:- రక్షించు, పోషించు.............(స్త్ర్యర్థేపురద్ధీ భవతః అనుసూత్రపు వ్యాఖ్యలో నీక్రిందిది గలదు.) రక్ష అని ఉండెను. ఉంటే వసతిరనుబంధకస్స్యాత్ అనుసూత్రముచేత నవుధాత్వర్థమైన ఉంన అనే పదము కర్త్రర్థమందు అనుబంధకమై నిలిస్తే వ్యతిరేకార్థే అనేసూత్రముచేత ఏకవచనానకు డుజాదులు వస్తే రక్షఉంనాడు అని ఉంటే భవతి క్రియాపదానాం అనేసూత్రముచేత ధాతువునకు ఇంచుకాగమము వచ్చి ఉకారము సంధిచేసుకుంటే రక్షించు ఉంనాడు అని నిలిచెను. ఇచుక్ అనే కిత్యానకు ప్రయోజనమేమంటే ఆద్యంతౌటకితౌ అనే సూత్రముచేతను కిత్తుకనక అంత్యానకు వచ్చేదే ప్రయోజనము. అనుబంధప్రార్థనయోః అనేసూత్రముచేతను బందార్థము గనుక ఇంచుక సంబంధముగల చువర్ణానకు వర్ణమువస్తే రక్షింపు ఉంనాడు నిలిచెను. చు రితిక్రియాపదానాం అని సూత్రముచేత సంధి చేసుకుంటె

రక్షింపుచున్నాడు సంధివికల్పము" (విజయనగరమాతృక. 34-35 తా.)

కరకవలసమాతృకలోఁ గూడఁ జాలవఱకుఁ బై విజయనగరమాతృకలోవలెనే యున్నందున విస్తరభీతిని వేఱుగఁ జూపనయితిని. వీనిలోను స్వల్పభేదములు లేకపోలేదు.

"ఇది రెండుసూత్రములు, త్రివిధానాం = మూఁడువిధములైనషువంటి, క్రియాపదానాం...ఇంచుక్ లోకకారము హలంత్యం అనే వ్యాకరణసూత్రముచేత లోపమైతే ఇంచు అని ఉండెను. ఆద్యంతౌటకితౌ అనే సూత్రముచేత ఇంచుక్ కిత్తుగనక అంత్యపదమై వచ్చెను......అనుబంధప్రార్థనయోః= అనుబంధప్రార్థనములయందును, ణౌ=ణిచ్చుయందున్ను, వ్యతిరేకాదికేచ=వ్యతిరేకాద్యర్థములయందున్ను, చోః ఇంచుక్ సంబంధి చకారమునకు, పస్స్యాత్ పవర్ణము ఆదేశముగా వచ్చును. క్రియారూపతద్ధర్మార్థములకు ఉదాహరణములు: పుషపుష్టౌ ణుస్తుతౌ అన్నధాతువులమీాద ఘఞ్ ప్రత్యయమున్ను స్త్రియాం క్తిన్ అని క్తిన్ప్రత్యయమున్ను కూర్చితే కృదంతములై ఉపకృతిసంజ్ఞలుగలవై పోషంతి అని ఉంట్టే ఆపైని వర్తమానార్థవివక్షగలిగితే భవతిక్రియాపదానాం త్రివిధానా మించుగాగమః అని ఇంచుగాగమము వస్తే పోషించు అని ఉంట్టే చురితిక్రియాపదానాం అనే ఉత్తర సూత్రముచేత చు అనేవర్ణమువస్తే ఆపయిని వసతిరనుబంధక స్స్యాద్యత్రలడర్థోవివక్షితస్తత్ర అని వసత్యర్థకమైన ఆంధ్ర పదము ఉన్న అనివుంట్టే పోషించుచున్న అని ఉండును. ఆపయిని లృటిలటిడుజ్స్యాత్ అనేవక్ష్యమాణసూత్రముచేత

డుజ్ వస్తే అను క్తమస్యవత్ అనేన్యాయముచేత హలంత్యం అనే వ్యాకరణ సూత్రముచేత జకారము ఇత్తైపోతేసాను నాసికోచ్చారణాంజిత్ అనే ప్రాకృతసూత్రముచేత దాపలను అర్థబిందువు వస్తే పోషించుచున్నాడు అని ఉదాహరణములు ఉండును. అనుబంధప్రార్థనయోర్ణ్ణా వ్యతిరేకాదికేచచోః పః స్యాత్ అనేసూత్రముచేత ఒకవేళ అనుబంధకము పరమై వుంట్టే పకారము వచ్చునన్నాడు గనక పకారము వస్తే పోషింపుచున్నాడు నుతింపుచున్నాడు అని కలదు. (రావు సాహేబు గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారి మాతృక. 2-3 తాటాకులు)

“ఇది రెండుసూత్రములు. త్రివిధానాం ఉపకృతిపరిణతి సంవృతిభేదములచాత మూడువిధములైనట్టువంటి క్రియాపదానాం=క్రియాపదములకు, ఇంచుగాగమః=ఇంచుక్ అనేఆగమము,భవతి=అవును. అనగాసకర్మములుగానీ అకర్మములుగానీస్వార్థమునందు ఇంచుకాగమము వచ్చుననుట. ణేశ్చనాయంతములమీాదనున్ను వచ్చును. ఇంచుక్ లో కకారము హలంత్యం అనే వ్యాకరణసూత్రముచేత లోపమయితే ఇంచు అని వుండును. ఆద్యంతావకితౌ అనే వ్యాకరణసూత్రమున ఇది కిత్తుగనక అంత్యావయవమైవచ్చెను. అనుబంధప్రార్థనయోర్ణ్ణా వ్యతిరేకాదికేచచోః పః స్యాత్ అనుబంధ అనుబంధమునందున్ను, ప్రార్థనయోః=ప్రార్థనమునందున్ను, చోః=ఇంచుక్ సంబంధిఅయిన చకారమునకు, పఃస్యాత్=పకారము వచ్చును, ణౌ ణిజర్థమునందు విహితమైనట్టువంటి చకారమునకున్ను, వ్యతిరేకాదికే చ = వ్యతిరేకార్థములయందున్ను విహితమైన

యర్థమునందున్ను పకారమువచ్చును. యీ చెప్పిన సూత్రముల చేత వచ్చిన క్రియారూపములు ఉదాహరిస్తున్నాము. పుష పుష్ణా ణుస్తుతౌ అన్న ధాతువులమీాద ఘుఞ్ ప్రత్యయమున్ను స్త్రియాం క్తిన్ అనె క్తిన్ ప్రత్యయమున్ను గూర్చితే కృదంతములై ఉపకృతిసంజ్ఞలుగలవై నుపోష నుతి అనివుంటే ఆ పయిన వర్తమానార్థవివక్షగలిగితే భవతి క్రియాపదానాం త్రివిధానా మించుగాగమః అనే ఇంచుగాగమము వస్తే పోషించు అనివుంటే చురితిక్రియాపదానాం అనే ఉత్తర సూత్రముచేత చుఅనేవర్ణమువస్తే ఆపయిని వసతి రనుబంధకః స్యాద్యత్రలడర్థో వివక్షితస్తత్ర అనేవసత్యర్థకమైన ఆంధ్ర పదము వున్నా అనివుంటే పోషించుచున్నా అనివుంటే ఆపయిని వ్యతిరేకార్థేల్ృటిలటిడుజ్ స్యాత్ అనే వక్ష్యమాణ సూత్రముచేత డుజ్ వస్తే అనుక్తమన్యవత్ అనేన్యాయము చేత హలంత్యం అనే వ్యాకరణసూత్రముచేత జకారము ఇత్తైపోతే సానునాసికోచ్చారణేజిత్ అనే ప్రాకృతసూత్రము చేత డాపలను అర్ధబిందువుస్తె పోషించుచున్నాడు. నుతించుచున్నాడు అని లడూపములువుండును అన బంధప్రార్థనయోర్ణౌ వ్యతిరేకాదికేచచోః పఃస్యాత్ అనే సూత్రము చేత ఒకవేళ అనుబంధముపరమైయుంటే పకారమువచ్చును అన్నాడు గనక పకారమువస్తే పోషింపుచున్నాడు నుతింపుచున్నాడు అని కలదు" (కాకినాడ మాతృక. 46 కాగితము).

"అనుబంధప్రార్థనయోః = అనుబంధప్రార్థనములయందున్ను, ణౌ=ణిచ్చుయందున్ను, వ్యతిరేకాదికేచ = వ్యతిరేకాదికమనే అభావార్థమందున్ను, చోః=చువర్ణానకు, పః = పవర్ణ

కము, ఆదేశంగాను, స్యాత్ = వచ్చును. తద్ధర్మార్థమునకు ఉదాహారణములు:—పోషించును. నుతించును. యివి ఉపకృతిక్రియలు. జయించును అభినయించును అనుభవించును సంభవించును హరించును అనుసరించును అనుకరించును యివి పరిణతిక్రియలు. అనురంజించును అధివసించును ఇత్యాదులు సంవృతిక్రియలు. యీతద్ధర్మక్రియారూపముల యెందు ప్రథమైకవచనలోపః అని ముందుచెప్ప బోయీసూత్రముచేతను ప్రథమపురుషైకవచనలోపమయిన తిప్పుకు లోపమువస్తే యీతద్ధర్మక్రియారూపములు సిద్ధించెను. ణిచ్చుకు ఉదాహరణములు:—రక్షింపించెను పోషింపించును... ... ...... ............................ ఈదిక్కున రక్షధాతువుమీద వర్తమానార్థమందు అనుక్తన్యాయముచేతను లట్ చేసుకునేది. ఆలట్టుకు తిప్తయే అనే పాణినీయసూత్రముచేతను ప్రథమపురుషైకవచనతిబాదులువస్తే రక్షతి అని వుంటే వసతి రనుబంధకః స్యాత్ అనే సూత్రముచేతను వసధాత్వర్థమైన ఉన్న అనేపదము కర్త్రర్థమందు అనుబంధమైనిలిస్తే వ్యతిరేకార్థే అనేసూత్రముచేతను ఏకవచనానకు డుజ్ వస్తే రక్ష ఉన్నడు అనివుంటే భవతిక్రియాపదానాం అనే సూత్రముచేతను ధాతువుకు ఇంచుగాగమము వచ్చి అకారసంధి చేసుకుంటేను రక్షించు ఉన్నాడు అని నిలిచెను. ఇంచుక్ అనే కిత్యానకు ప్రయోజన మేమంటేను ఆద్యంతౌటకితౌ అనేసూత్రముచేతను కిత్తు గనక అంత్యానకు వచ్చేదే ప్రయోజనము అనుబంధప్రార్థనయోః అనే సూత్రముచేతను అనుబంధార్థను గనుక ఇంచుక్ సంబంధమైన

చువర్ణానకు పవర్ణకంవస్తే అతిక్రింపుచున్నాడు అని నిలిచెను" (ప్రాచ్యలిఖి. 11-12-5. నెం. మాతృక.)

"ఇది ౨ సూత్రాలు......అనుబంధప్రార్థనయోః=అను బంధద్వయమందున్ను ప్రార్థనార్థమందున్ను, వ్యతిరేకాదికేచ= వ్యతిరేకము మొదలైన యర్థాలయందున్ను, ణౌ ణిచ్చుకు వచ్చేది పరమై ఉండినున్ను, చోః యించుగాగమములోని చు అనేది అక్షరాన్కు, పః స్యాత్=పకారమువచ్చును. వ్యతిరే కము ఆది శబ్దము చాత ఘటింప్పనోపును మొదలైనతుముణ్ ప్రత్యయాద్యర్థాలకున్ను పకారము వచ్చును." (ప్రాచ్యలిఖి 25-8-9 నెం. మాతృక)

21. పైవానిలో నేదియు వేఱొకటితోఁ దుల్యరచ నము గలదయి యుండలేదనుటలో సందేహము లేదు గదా! ఇఁక వానిలోని విషయములకు మాత్రము చాలవఱ కైక్య ము గల దనుట నిశ్చయము. అట్టి విషయములలోఁ గూడ స్వల్పముగఁ బరస్పరభేదములు లేకపోలేదు. మఱియు నన్నిటి యందును వివిధములగు నపశబ్దములును నసన్వయరచనము లును నత్యంతప్రచురములై యున్నవి. ఈసందర్భమును బట్టి చూచునపుడు వీనిలో నేమాతృకయు యథాస్థితముగ శాల సరస్వతీప్రయుక్త శబ్దఘటితను కాదనియు ఛందోబద్ధము కామిం జేసి లేఖకపరంపర నిర్నిరోధముగఁ బెక్కుచోటులం దాయాస్థలములందలి యయ్యేవిషయములను దమతమకలవా టయి యున్న వ్యావహారికభాషతో వ్రాయుచు వచ్చె ననియు నెవ్వరికేని తోఁచక మానదుగదా! వ్యావహారికభాషావాదులు

సైతము యథాస్థితముగఁ బై మాతృకలలో దేనిలోని ప్రయోగములను సైత మంగీకరింపఁజాలరుగదా!

మొత్తముమీఁద నన్నిటిలోను వ్యావహారిక భాషా పదములు కొన్ని ప్రయుక్తములై యున్నను నయ్యయిచోట్ల నొకమాతృకలోని వ్యావహారికప్రయోగములు మఱొక మాతృకలో నుండక వేఱొకవిధమైన వ్యావహారిక ప్రయోగ ములు పడియుండుటచేత నవి యేకమాతృకామూలకములు కావని స్పష్టపడుచున్నది. ఇంక నాయాయిచోటులందుఁ గల యన్వయ భ్రంశములును, వ్యావహారికపదములు సైతము గానట్టి యపశబ్దములును, బాలసరస్వతీప్రయుక్తములు కావ నియు వానిని మాత్రము సవరింపవలయుననియు వ్యావహా రికభాషావాదులు సైత మంగీకరింపక తీరదుగదా! 'యాత ద్ధర్మక్రియారూపములయందు ప్రథమైకవచనలోపః ముందర చెప్పిపోయేసూత్రముచేతను ప్రథమపురుషైకవచనమైన తిప్పా నకు లోపము వస్తే యాతద్ధర్మక్రియారూపములు శిద్ధించును' అనురీతినున్న హేయములగు ననన్వితవాక్యములు సవరింప రాదని యెవ్వరును జెప్పఁజాలరుగదా! మఱియు 'ఇంచుకా గమము ఖేదములచాతను ణే ణిచ్చుయందున్ను చెప్పిపోయే అంనాడు గనకనుంన్ను శిద్ధించును' అనుమొదలగు వానిని సవరింపక తీరదనుటలో నెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరు గదా! ఇఁక నిట్టివానిని సవరించి వ్యావహారికపదములను మాత్ర ముంచివేయుటకు బాలసరస్వతిగాని మఱియెవ్వరు గాని యెచ్చట నైన వచనరచనమునఁ గొన్ని వ్యావహారికపద ము లుండవలయునని చెప్పియుండలేదుగదా! మీఁదు మిక్కి లిగ బాలసరస్వతివ్యావహారికభాషయందుఁ దనకుఁగల యనా

దరము నీక్రింది రీతి నొకచో సందర్భము కల్పించుకొని విశదీక రించియున్నాఁడు. "అపభ్రంశము ప్రయోగయోగ్యము కాదు గనుక తద్వివేకము కొఱకీ శాస్త్రమునఁ బ్రవర్తింపవలె ననుట. లక్షణముకలది గ్రామ్యము కాదు. లక్షణము లేనిది గ్రామ్యము. ఇందుల కుదాహరణము.—

కం. హరిముఖ సురపాలులకుం
బరికింపఁగ రాని వెలుఁగు పరమేశ మనో
వర హంససరముసంతత
కరుణశుభాలొసఁగు శైలకన్యామాకున్.

ఇందు 'సురపాలులకును, సరము, శుభాలు, శైలకన్యా' అను నివి యుక్తలక్షణములు కావు. కనుక గ్రామ్యములు. ఇవి సలక్షణములైన సౌమ్యములు.

కం. హరిముఖ సురపాలురకుం
బరికింపఁగ రాని వెలుఁగు పరమేశ మనో
వరహంససరసి సంతత
కరుణ శుభము లొసఁగు శైలకన్యక మాకున్.

ఇట్లే గ్రామ్యసౌమ్య భేదములు తెలియునది." (బాలసరస్వతీయటీక. అనియమాదిత్యాదిసూత్రవ్యాఖ్య. 9 సూ.)

ఇట్లు కంఠోక్తముగా 'శుభాలు' మున్నగునవి సైతము గ్రామ్యములనియు, 'శుభములు' మున్నగునవి సౌమ్యము లనియు, గ్రామ్యము యోగ్యము కాదనియు నుద్ఘోషించుచుండఁగా నాతఁడు మొట్టమొదటిసూత్రము వ్యాఖ్యలోనే "సర్వ

ధర్మాలలోను" అను మొదలగుశబ్దములను బ్రయోగించె
ననుట యర్థమగునా ?

ఆ-వె. "..., అందులోఁ గ్రామ్య మనఁగ నెవ్వరు చెప్ప,
రొరులఁ దెగడుచోట జెప్పఁబడియె."

అనుకేతనామాత్యుని సూక్తి చొప్పునఁ దిట్టుకైతలలో మాత్ర
మే గ్రామ్యములకుఁ జోటుచూపుట లాక్షణికసిద్ధాంతమై
యుండఁగా వేనవేలపశబ్దములను మహోపాధ్యాయ బాల
సరస్వతుల మెడను గట్టుట యెంత యన్యాయ్యమో! విమర్శ
కులు గ్రహింతురుగాక !

22. మఱియుఁ బద్యరచనములోఁ గావ్యభాషయే
యుండవలయునని వ్యావహారికభాషావాదులు సైత మంగీక
రించుచున్నారు గదా! బాలసరస్వతీయటీకామాతృకలలో
దేనియందైన బాలసరస్వతిపద్యములలో నట్టి నియమము
కలదా ? పద్యములందును "అర్ధానుస్వారశకటరేఫలేఖన
మును బాటింపకుండుట, నిత్యములగు సరళాదేశాదిసంధి
కార్యములు చేయకుండుట, ద్రుతయడాగమవిపర్యాసములు"
మున్నగునవి బాలసరస్వతీయమాతృకాసామాన్యములేగాక
సకలగ్రంథతాళపత్రమాతృకాసామాన్యమగు విషయములు
గదా! అట్టి నియమరాహిత్యముకూడఁ దత్తద్గ్రంథకర్తృభి
ప్రేతమే యని వ్యావహారికభాషావాదులు చెప్పఁగలరా?
'సంప్రార్థనార్థకాత్ = సంప్రార్థనార్థకమైన క్రియాపదముమీఁద
ఇత్ =ఇకారము వచ్చును. రక్షింపుమీ ప్రోవుమీ ఏదాతే
ఎకార ఆకారాలు ప్రశ్నలక్షణ = ప్రశ్నలక్షణాలైన స్వభా

వాలు, భవతః=అవును. చేశెద చనియదా' (ప్రాచ్యలిఖి 25-8-9 నెంబరు మాతృక 43 తాటాకు) మాతృకలను సవరింపరాదను వార లిచట నేమందురో? ఈరీతినే ముద్రింపవలయునందురా? ఇకారము వచ్చునను చు 'రక్షింపుమీ' అని యుదాహరించుట యెట్లు? ఎకారఆకారాలు ప్రశ్నలక్షణాలైన స్వభావాలు అవునను చు 'చేశెద చనియదా' అని యుదాహరించు టెట్టు? ఇట్టి ప్రయోగములుకూడ బాలసరస్వతుల మెడకుఁ గట్టవలసినదేనా? విస్తరభీతి నిట నింకను విశాలముగాఁ జూపలేదు. తాటియాకుల పుస్తకములలో నెట్టి తప్పులు పడియున్నవో? పాఠకమహాశయులకు విశదపఱుచుట కిట్లు దిక్ప్రదర్శనముగాఁ జూపితిని. ఇంకను ముమ్ముందా యాసందర్భములలో ననేకస్థలములు చూపఁబడును. (పేరాలు 29-31 చూ.) తుదకిఁ బద్యములలోఁగూడ నెట్టి తప్పులు పడియున్నవో చిత్తగింపుఁడు.

కం. హరిముఖ సురపాలులకుం
బరికింపగ రాని వెలుగు పరమేశమనో
హరహంససరము సంతత
కరుణశుభాగొసగు శైలకన్యామాకును.

ఇందులో సురపాలులకు సరము శుభాలు శైల కన్యాయనేటివియు క్షలక్షణములు గాకుంనవి గనుక గ్రామ్యములు ఇవి సలక్షణములైతే సౌమ్యములు.

కం. హరిముఖ సురపాలులకున్
బరికింపగ రాని వెలుగు పరమేశ మనో

హార హంసపరసపంతత
కరుణాశుభము లొసగు శైలకన్యకమాకును.

గ్రామ్యసౌమ్యభేదములు యిటువలెనే తెలిసీది."
(విజయనగరమాతృక. ౯-౧౦ తాటాకులు.)

ఇక్లే యెల్లమాతృకలలోను బెక్కువిధముల యపప్రయోగములు పడియున్నవి. 'సురపాలులకు' అన్నది గ్రామ్యమనియు 'సురపాలురకు' అన్నది సౌమ్యమనియుఁ జెప్పుచున్న గ్రంథకర్తవాక్యములకైన సరిపడని వ్రాఁతతోనున్న యిట్టి మాతృకలు యథాస్థితముగాఁ బ్రమాణము లనుట సరియా? తక్కిన 'సరళి, మనోహార, మాకును' మున్నగుచోట్లలోని హేయములగు నపప్రయోగముల మాటకేమి? వచనరచనమున నైతము 'భేదములు యిటువలెనే తెలిశీది' అనురీతివి కూడ గ్రంథకృత్ప్రియుక్తము లనుట యర్థమా? మాతృకలు యథాస్థితముగఁ బ్రమాణములనుచును వానిని దిద్దరాదనుచును నిట్టివానినిగూడ సవరింపరాదని చెప్పసాహసింతురా? ఇట్టి మాతృకలు పూర్వపూర్వమాతృకలకు సరియగు ప్రతికలు కావనియు సాకల్యముగాఁ బ్రమాణములు కావేరవనియు యథార్థముగా సవరింపఁదగినవనియుఁ జెప్పుటకు సందేహముండునా ?

మఱియు నిపుడు లభించుచున్న బాలసరస్వతీయాది మాతృకలలోని వచనరచనములలో దేనియందును శుద్ధమగు ననఁగా నిపుడు వ్యావహారికభాషావాదులు వ్రాయుచున్న వ్యావహారికభాషరీతి లేదుగదా! 'పకారము వచ్చుచున్నాడు గనక పకారమువస్తే' అనువాక్యమే శుద్ధమగు వ్యావహారిక

రచనమున నున్నయెడల 'పకారం వస్తుందన్నాడు గనకాపకా
రం వస్తే' అనిగదా యుండవలయును. ఇంకను నిది ప్రాచీనలే
ఖనపద్ధతిచొప్పున నున్నయెడల 'పకారం వస్తుం ద్దంనాండ్డు
గనకాపకారంవస్తే' అని గదా యుండవలయును!

23. ఇట వ్యావహారికభాషతో నెవ్వరును గ్రంథరచ
నము చేయఁరాదని నాయభిప్రాయముకాదు. ఏవేని కొన్ని
నియమములను గల్పించికొని వ్యావహారికభాషతో గ్రంథ
ములు రచించిన రచింతురుగాక! బాలసరస్వత్యాదులు వ్యా
వహారికభాషతోనే వారి వ్యాఖ్యానాదులు వ్రాసి రని
స్వవాదోపయోగార్థముగా వాదించుట సత్యవిదూరమని
మాత్రమే నాయభిప్రాయము.

24. శ్లో. "తత్ర పంచపరిచ్ఛేదా శ్శబ్దశాస్త్రే నియంత్రితాః,
ఆర్యాఖ్యపద్యై స్తత్సంఖ్యా సమ్మితా స్యాద్గణై ర్గణైః."

అను వెనుక నుదాహరించిన (4 పేరా) యహోబలపతి
సూక్తిచొప్పున నాతనికి దొరకిన యాంధ్రశబ్దచింతామణిలో
నెనుబదియెనిమిదిశ్లోకములు గల వని విశదమగుచున్నది.
మఱియు నహోబలపండితీయములోని యీక్రిందిసందర్భము
ను బట్టి మఱొకశ్లోకముకూడ నన్నయరచితమే యని విశద
మగుచున్నది.

"ఆద్యాచ సా ప్రకృతిశ్చాద్యప్రకృతిః సంస్కృతభాషా తస్యాస్సకల
భాషానిదానత్వాత్. అతఏవ 'శాస్త్రమపౌరుషమాద్యం ప్రాయిక
నిత్యప్రయోగలక్ష్మైతత్ దృశ్య మతిష్ఠదిరం, యజ్జ్ఞాత్వా శబ్దః

ప్రయోక్తా ఆర్షసమః' ఇతి క్వచిత్పుస్తకే సరస్వతీకరలిఖిత ఏవ శబ్దానుశాసనప్రతీకత్వేన పద్యం స్థితమ్. ఆర్షసమః=వైదికశబ్దతుల్యః ప్రామాణిక ఇతి యావత్ శేషం సుగమమ్. తతోఽన్వర్థమాద్యప్రకృతి రితిచాను.” (అహో. 119 పుట.)

ఈసంవాదమునుబట్టి 'శాస్త్రమపౌరుష' మిత్యాది కారికను నన్నయభట్టు తన చింతామణిలో రచించి కూర్చి యుండె ననియు దానిని కలిపికొనియే చింతామణికారిక లెనుబదితొమ్మిది యగుననియు విశదమగుచున్నది. ఈశ్లోకము సంస్కృత భాషాప్రశంసాపరముగ నగపడుచుండుటచేతఁ జింతామణిలో దీనికిఁ బ్రసక్తి లేదని తలంచి కావలయును బాలసరస్వతి తాను టీక వ్రాయుటలో దీనిని మూలములోఁ జేర్చి వ్యాఖ్య చేయఁ డయ్యెను. అప్పకవియు దీనిని గ్రహించి వివరించియుండ లేదు. అహోబలపండితుఁడును బాలసరస్వత్యప్పకవులనే యనుసరించి మూలములోఁ జేర్పక పైరీతిని దన వ్యాఖ్యలో సందర్భాంతరమున నుదాహరించియుండెను. పరిశీలింపఁగాఁ జింతామణిలో నాంధ్రభాషాభేదములలోని సంస్కృతసమశబ్దములకు మూలములగు సంస్కృత ప్రాతిపదికముల వ్యుత్పత్తిని గూర్చియు సమాసాదులను గూర్చియుఁ జెప్పకుండుటకుఁ గారణము నుపన్యసించుచుఁ దద్విషయమున నాద్యశాస్త్రమనఁగా సంస్కృతవ్యాకరణము 'దృశ్య' మనఁగాఁ దెలిసికొనఁదగిన దని నన్నయభట్టారకుఁడు సుసంగతముగనే శాస్త్రమపౌరుష మిత్యాదిశ్లోకమును జెప్పి యుండె నని తోఁచుచున్నది. కావున నద్దానిని జింతామణిలోనిదానిఁగనే గ్రహించుట యుక్తము. అట్లద్దానిని గ్రహిం

చిన కృతక బాలసరస్వతీయక ర్తయు నాతని నే యనుసరించిన యుద్ద్యోతినీవ్యాఖ్యాకర్తయు నాశ్లోకమున కాంధ్రవ్యాకరణప్రశంసాపరముగ నర్థము చేయుటసరియై యుండ లేదు. నన్నయభట్టారకుఁడు తన వ్యాకరణమును 'అపౌరుషమ్, ఆద్యమ్, అతిస్థవిరమ్' అను రీతిని వర్ణించియుండు ననుట యెంతయుఁ బరిహాసనీయముగదా!

25. నన్నయభట్టారకుఁ డాంధ్రశబ్దచింతామణి సంజ్ఞాపరిచ్ఛేదమున నాంధ్రలిపుల్పత్తిస్థాపకశ్లోకములు మూఁడిటిని రచించియున్నాఁడు. బాలసరస్వతి తననాఁటి లిపికాయాకారములు పరిపక్షనందున నాశ్లోకముల యర్థమును సరిగా గ్రహింపఁజాలక వానికి వ్యాఖ్యానము చేయకుండుటంజేసి కావలయు నయ్యవి బాలసరస్వతీయ మాతృకలలో నుండి తొలఁగింపఁబడినవి. ఇట్లే బాలసరస్వతి మఱికొన్ని కారికలకును నర్థమును సరిగ గ్రహింపఁజాలక వ్యాఖ్యానము చేయకుండుటయు నట్టికారికలు కొన్ని మాతృకలలో వ్రాయఁబడకుండుటయుఁ గలదు. అట్టిస్థలములు ముం దుదాహరింపఁబడును. కావున నట్టి లిప్యుద్ధారకశ్లోకములు మూఁడును జింతామణిలో నుండి యుండెడి వనియు నయ్యవి పయిని వ్రాసినరీతిని గొన్ని మాతృకలలో లేకుండుట సంభవించె ననియు గ్రహింపవలసియున్నది. అపక్షమునఁ జింతామణి కారికలు తొంబది రెండగుచున్నవని గ్రహింపవలెను. అట్టి శ్లోకము లిట నుదాహరింపఁబడుచున్నవి.

"బాలేందు పరిధి శృంగా, వర్తకుశగ్రంథిదాత్రపరశు సమాః, ఆద్యా ఇభకరితుల్యా, స్తద్దీర్ఘాశ్యాలసన్నిభావన్యా దరశార్ఙ్గ పిప్పల దళాంతః

శషస్వ్నగ సన్నిభాః క్రమా త్పుపషాః, ష్టాంఘ పిలేఖాదికై ష్ట
పివర్గ ద్వితీయవర్ణాద్యాః. కిరకక్రియా స్తిమ స్తక శు క్తి తులాసనవితర్ది
సీరసమాః, అంతస్థాస్తోచ్ఛిష్టాణోదంక్యచజా గురురతా చ బిందు
యుతా." (అప్పకవీయము, 2 ఆశ్వాసము.)

ఈ శ్లోకములను పఠరించుచు నథర్వణాచార్యుఁడు రచించినశ్లోకములుగూడ నప్పకవికిశ్రుతిపరంపరాయాతముగా లభించినవనియు నాతఁడా రెండుగ్రంథములలోని శ్లోకములను జోడించి యొకరీతి నర్థము చేసికొని యప్పకవీయమున నాంధ్రీకరించె ననియు నీవఱకువ్రాసి వాని నుదాహరించియే యున్నాను. (చూ. పే. 6)

అథర్వణుఁడు చింతామణిలోని పై నుదాహరించిన 'దరశార్జైత్యాది' శ్లోకభాగమున వెనుక నుదాహరించిన రీతిని (పేరా 6.)

"పంచవర్గాదయో వర్ణా శ్శంఖశార్ఙ్గాది సన్నిభాః"

అని యిట్లనువదించియుండుటచేతఁ, బై చింతామణిశ్లోకములు బాలసరస్వతీయములోఁ బయి నుదాహరించినకారణముచే లోపించినంతమాత్రమునఁ బ్రక్షిప్తము లనుటకు వలనుపడదనియు, నయ్యవి యథర్వణాచార్యుని నాఁటికే చింతామణిలోఁ జేరియుండె ననియుఁ, జెప్పుటకు సందేహము లేదు. అట్టి చింతామణిశ్లోకములలో వర్ణింపఁబడిన యక్షరములయాకారములు సౌదిండియన్ పేలియాగ్రఫీలో (దక్షిణ హిందూస్థానప్ పిశాస్త్రము)బర్నలుదొరగారు చూపినయాఱవ పటములోని క్రీ. శ. 9౦0 సంవత్సరపుప్రాంతమందలిలిపికి సరి

పడియున్నవి. అట్టి వేలియాగ్రఫీలిపిలో హల్లులకుఁ దిర్యగ్రేఖాకారములగు తలకట్టులు లేవు. చింతామణిశ్లోకములలో వర్ణింపఁబడిన లిపియందును నట్టి తిర్యగ్రేఖాకారమగు తలకట్టు వర్ణింపఁబడ లేదు. అట్లు వర్ణింపఁబడకుండుటచేతనే యథర్వణుఁడు సవరించుటలో 'తిర్యగ్రేఖాయుజశ్శోర్ధ్వమ్మ'ని తరువాత వచ్చిన తలకట్టులను జేర్చియున్నాఁడు. హల్లులకుఁ దిర్యగ్రేఖాకారములగు తలకట్టులును వర్గద్వితీయ చతుర్థవర్ణములకు నొత్తులును బేలియాగ్రఫీలోని యేడవపటమునందలి పండ్రెండవశతాబ్దపు లిపిలో నగపడుచున్నవి. అథర్వణుఁడట్టి యొత్తులను 'దండరేఖాన్వితాఽధః' అనుదానితో వర్ణించియున్నాఁడు. చింతామణిశ్లోకములలోఁ జెప్పఁబడిన పరుషముల యొక్కయు నంతస్థోష్మములయొక్కయు నాకారములలో ననేకములు క్రమక్రమముగా 13-14 శతాబ్దముల నాఁటికి బొత్తిగా మాఱిపోయినవి. ఆకారణముచేత వాని యాకారములుత్తరోత్తరులకుఁ దెలియనేరవు.

పయి సందర్భమునుబట్టి బాలేంద్వితాద్యదిశ్లోకములాంధ్రశబ్దచింతామణిలోనివని విశ్వసించుటకేమియు విప్రతిపత్తి యగపడదు. మఱియు నాకాలమున నిప్పటివలె శాసనప్రతిబింబములును బేలియాగ్రఫీలును మున్నగు సాధనములు దుర్లభము లగుటచేత నప్పకవిగాని యంతకుముందటివారుగాని తమకాలపులిపికి భిన్నముగానున్న యీప్రాచీనలిప్యుద్ధారకశ్లోకములు కల్పించుట యసంభవ మగుటచేత వీనివిషయమునఁ బ్రక్షిప్తతాశంకయే లేదన నగును.

అప్పకవి యీచింతామణి కారికలకు వ్యాఖ్యచే
యఁ బూనించి యసంగతముగాఁ దనకాలపు లిపి నుదాహ
రింపసాగెను. చింతామణి నక్షిత ప్రాచీనలిపి:— పరుష
ములు [illegible], [illegible], [illegible], [illegible], [illegible]; అంతస్థోష్మములు.
[illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible]. వీనికి
బదులుగా నప్పకవియిచ్చినది బహుశా అవరశతాబ్దపులిపి యనఁగా
నేఁటిలిపియే యుదాహృతమై యున్నది. అహోబలపండితుఁ
డును నప్పకవిమార్గమునే చాలవఱ కనుసరించెను. ప్రాచీన
లిపి స్వరూపమునే తెలియనివారు లిపిని బోధించు నుద్ధార
శ్లోకములను గల్పించి కనుట యసంగతము కాదా?

26. "ప్రాకృతశౌరసేన్యాదిభేదైః సంస్కృతభాషోత్కృష్ట భాషాకృతి భేదాః
వ్యాకృతిరేషా భూయసాం సా వ్యక్తేర్త్వా స్వప్రదాయతో వేద్యాః."
(బాలసర. హలం. 46 శ్లో.)

ఈశ్లోకము సైతము బాలసరస్వతికి సరిగ నర్థము
గాలేదని చెప్పక తీరకున్నది. కవిజనాంజనమునందలి బాలసర
స్వతీయభాగములోను (ప్రాచ్యలిఖిత 322 నెంబరు మాతృక.)
సాహిత్యపరిషన్మాతృకలోను 'ఈ ఆర్యావృత్తము సంప్ర
దాయవేద్యము' అని యీకారికక్రింద వ్రాయఁబడెనే కాని
దీనికి వ్యాఖ్య చేయఁబడలేదు. అట్లు వ్యాఖ్య లేకుండుటచేత
నే కావలయు నీశ్లోకము వెనుకటి 'బాలేందుపరిధీత్యాది
శ్లోకత్రయమువలెనే విజయనగరమాతృకలోను కరకవలస
మాతృకలోను గ్రంథములోనుండి తొలఁగింపఁబడెను. ప్ర

చ్యలిఖితపుస్తకభాండాగారములోని తాళపత్రమాతృకలలో 'R 112=K 25-8-9' అను నెంబరుగల మాతృకలోఁగూడ నీ శ్లోకమునకుఁ డీక వ్రాయఁబడలేదు. "యీఆర్యావృత్తము సంప్రదాయవేద్యము" అనియే వ్రాయఁబడియున్నది.

ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములోని 11-12-5 నెంబరుగల మాతృకయం దీశ్లోకము 'ఆత్మన ఇమనంతానాం ...' అనుదానితరువాత లేదు. హలంతపరిచ్ఛేదాంతమున బాలసరస్వతి పరిచ్ఛేదాంత గద్యటీకకూడ దాఁటినతర్వాత 'హలంతపరిచ్ఛేదము సమాప్తము' అని వ్రాసినపిదప నీశ్లోకము దీని టీకయు వ్రాయబడియున్నవి.

ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములోని 25-16-3 నెంబరుగల మాతృకలోని రెండు బాలసరస్వతీయములలోను నీశ్లోకమును దీనిటీకయు నజంత పరిచ్ఛేదాంతమున వ్రాయఁబడియున్నవి. వీనిలోని టీకలును కేవలమసంగతములై భావశూన్యములై యీక్రిందివిధమున నేకరీతినే యున్నవి. 'ప్రాకృతభవ సంస్కృతభవవత్ = ప్రాకృతమందు పుట్టినషువంటెన్ని, సంస్కృతమందుపుట్టినవలెనేవె, ప్రాకృతభవ = ప్రాకృతమందు పుట్టినషువంటిన్ని సూరశేనిమాగధి పైశాచికచూళిక అపభ్రంశలు మొదలయినభాషలయందు పుట్టినశబ్దములవును. ఆశబ్దములు, వ్యతిరిక్తాః = అప్రసిద్ధములైనవి, అవ్యతిరిక్తాః = ప్రసిద్ధములైనవి, భూయాంసః=తరుచుగాను, సంప్రదాయతః =మహాకవిముఖోదితాలొటబట్టి గ్రహించ్చిది.'

R. 287=K 3-75 నెంబరుగల కృతక బాలసరస్వతీయమునం దన్నవో యహోబలపండితీయమునందలి వ్యాఖ్యయే

చాలవఱ కనువదింపఁబడినది. కాకినాడమాతృకలోను నిపుడు ముద్రింపఁబడుచున్న దానికి మూలమగుప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని 'K 11-12-5' నెంబరుగల మాతృక లోనుగూడఁ జాలవఱ కహోబల పండితీయములోని వ్యాఖ్య యర్థమే కొన్నితప్పులతో ననువదింపఁబడినది. దాని నిటఁ జూపుచున్నాను. కాని యవియును గవిశిరోభూషణానుకారులగుటచేతను మాతృకాంతరములలో దీనికిఁ డీక లేక పోవుటచేతను మఱికొన్నిటిలో దీని టీక సంప్రదాయవేద్యమని వ్రాయఁబడియుండుటచేతను, నిజముగ దీనికి బాలసరస్వతిటీక వ్రాయలేదనియు మాతృకాంతరములలోఁ గలటీక ప్రక్షిప్త మనియు నాయభిప్రాయము.

అహోబలపండితీయములోని వ్యాఖ్యయందుఁ గూడ 'వ్యతిరిక్తా భూయాంస' ఇత్యాది సూత్రద్వయములోను గొంత కాలుష్యమును నస్పష్టతయుఁ గలదు. అదియే దాని ననువదించు నీటీకలలో మఱికొంత పెరిఁగినది. (అహో 392 పుట). ఈశ్లోకమున కహోబలపండితుఁడు చేసిన టీక నాధారముగఁ గొని నేను చేసికొన్నయర్థము నీక్రిందఁ జూపుచున్నాను. ప్రాకృతభవ వికృతిభవాః=ప్రాకృతభాషా మూలమునఁ దెనుఁగులోనికివచ్చిన శబ్దములు, 'ప్రాకృతభవ, సంస్కృతభవ, సంస్కృతవత్=ప్రాకృతదేశ్యములు, సంస్కృతభవ ప్రాకృతశబ్దములు, సంస్కృతసమప్రాకృతశబ్దములు' అని మూఁడువిధములుగా నుండును. వ్యతిరిక్తాః=ప్రాకృత భాషనుండి వచ్చిన వానికి భిన్నములగు నాంధ్రశబ్దములు, భూయాంసః=పెక్కుగలవు. ప్రాకృతభాషలోనికి రాకయే

తెనుఁగులోనికిఁ బ్రత్యేకముగా వచ్చు సంస్కృతభవశబ్దము లును (ఆకాశః=ఆకసము) నాంధ్రదేశ్యశబ్దములు ననునవి యీావ్యతిరిక్తకోటిలోనివని యెఱుంగునది. 'వ్యతిరిక్తాస్సంప్ర దాయతో వేద్యాః' = ఈవ్యతిరిక్తకోటిలోని శబ్దములు లోకవ్యవహారమాత్ర వేద్యములనిభావము. శ్లోకపూర్వార్ధము చేఁజెప్పఁబడిన ప్రాకృతభాషామూలకములగు మూఁడువిధము లగుశబ్దములన్నియో ప్రాకృతకోశవ్యాకరణాదులచేతఁ దెలిసి కొనఁ దగియుండును. అట్లే ప్రాకృతములోనికి రాకయే ప్రత్యేకముగాఁ దెనుఁగులోనికివచ్చిన సంస్కృతశబ్దములు సంస్కృతవ్యాకరణశాస్త్రమునుండి తెలియనగు నని గ్రంథకర్తయే శాస్త్రమపౌరుషమాద్య మిత్యాదిశ్లోకముతోఁ జెప్పియున్నాఁడు. యుష్మదస్మదాత్మశబ్దములకుఁ బర్యాయములగు 'నీ, నా, తా, మన' శబ్దములరూపములను హాలంతపరిచ్ఛేదమునఁ జెప్పనారంభించి వానికి మూలము సంస్కృతప్రాకృతభాషలు కావనియు నవి లోకవ్యవహారమాత్రవేద్యము లనియుఁ ముందుగ విశదీకరించియున్నాఁ డని పైశ్లోకమున కిచటఁ బ్రసక్తిని బరిశీలింపవలెను.

27. "న తుణౌ భవేచ్ఛలోపో ణ్యర్థే యో వర్తతే పరే తస్మిన్,
పునరాగమః క్రియాణాం పర్యాప్తో మస్మ తేతు సంకేతః."
(బాలసర. 85 శ్లో.)

ఈశ్లోకములోని యుత్తరార్థమునకు నైతము బాలసరస్వతికి సరిగ నర్థము తెలియలేదని చెప్పక తీరకున్నది. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని '25 - 8 - 9' నెంబరుగల మాతృకలో నీశ్లోకమునందలి పూర్వార్ధమునకు

మాత్రమే టీకగలదు. దాని పిదప 'ఉత్తరసూత్రము సాంప్రదాయవేద్యము' అని వ్రాయబడియున్నది. 'పునరాగమ' ఇత్యాద్యుత్తరార్థమునకుఁ డీక లేదు. సాహిత్యపరిషన్మాతృకలో సైతము పై రీతినే పూర్వార్థటీకానంతరమున 'ఉత్తరసూత్రము సాంప్రదాయవేద్యము' అని వ్రాయఁబడియున్నది. దానికిఁ డీక లేదు. కరకవలసమాతృకలోను విజయనగరమాతృకలోను గూడ నీయుత్తరార్థమునకుఁ డీక లేదు. ఈయుత్తరార్థభావమే యనఁదగు 'ణిజర్థక్రియాప్రయోగములు మహాకవిప్రయోగానుసారిగా వాడుకొనీది' అను వాక్యము పూర్వార్థటీకలోనే చేర్పఁబడియున్నది. కాని యీ రెండుమాతృకలలోను నిచట 'ఉత్తరసూత్రము సాంప్రదాయవేద్యము' అని వ్రాయఁబడియుండలేదు. ఇపుడు ముద్రింపఁబడుచున్న దానికి మూలమగు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని 11-12.5 నెంబరుగల మాతృకలోను కాకినాడమాతృకలోను రావుసాహెబు శ్రీ గిడుగు వెంకటరామమూర్తిపంతులవారి మాతృకలోనుగూడ నీయుత్తరార్థమునకుఁ డీకగలదు. ఈమాతృకాత్రయమునందును బూర్వార్థవ్యాఖ్యానాంతమున 'ణిజర్థక్రియాప్రయోగములు ...' ఇత్యాది వాక్యము వ్రాయఁబడియుండలేదు.

పయి సందర్భమునుబట్టి పరిశీలింపఁగాఁ బూర్వార్థవ్యాఖ్యాంతముననున్న 'ణిజర్థక్రియే'త్యాదివాక్యమును నుత్తరార్థటీకయు బాలసరస్వతీరచితములు కావని తోఁచుచున్నది. మఱియు నీక్రింద నుదాహరింపఁబడు కవిశిరోభూషణ వ్యాఖ్యానపంక్తుల సారాంశమే కొన్ని మాతృక

లలోఁ బ్రతిక్షిప్తము చేయఁబడెననియు సువ్యక్తమగు చున్నది.

"పునరాగమః క్రియాణామిత్యుక్తేః పునరపూర్వేవిశేషే చేతిపున రప్యయార్థ విజ్ఞానాత్. విశేషాగమః క్రియాణా మితి హితదర్థః. అతఏవ అవధారుదేవి ఇతిరూపం నిర్బాధమ్. అవధరింపుము ఇతి తదర్థః." (అహో. 468 పుట).

సూ. "పునరాగమః క్రియాణామ్. వ్యా:—వ్యాఖ్యాత మేతత్సూత్ర మధస్తాదేవ. ఘటింపుచున్నాఁడు. ఇత్యత్ర దీర్ఘోప్యనేనైవ సిధ్యతీతి నకశ్చిత్కళంకః."

సూ. " పర్యాప్తోమన్మతేతు సంకేతః. వ్యా:— పర్యాప్తః పూర్ణః. సుప్రసిద్ధ ఇతి యావత్ మన్మతేతు సంకేతః పర్యాప్తోభవతి యత్సంకేతితం శిష్టప్రయోగారూఢంచ పదంతత్ప్రయోజ్య మిత్యత్రాస్తాక మభినివేశః శాస్త్రస్యతుదిక్ప్రదర్శనార్థత్వేన సార్థక్య మితిభావః...... .." (అహో. 494 పుట.)

28. పయినుదాహరించిన సందర్భముచొప్పున 'పునరాగమ' ఇత్యాది సూత్రముల టీక బాలసరస్వతీకృతము కామింజేసి వెనుక నుదాహరించిన 'స్త్ర్యర్థే పునర్దుదీభవతః' అను సూత్ర మునొద్దఁ జూపఁబడిన క్రియాపద ప్రక్రియా ప్రదర్శనసందర్భ మున (పేరా. 20.) 'వసధాత్వర్థమయిన ఉన్నా' అనుపాఠమే గ్రంథకృదభిప్రేతమయి యుండు నని తలంపవలసియున్నది. పునరాగమ ఇత్యాదిసూత్రముచే దీర్ఘము వచ్చునని గ్రహింపని బాలసరస్వతి 'రక్షింపుచున్నాఁడు, పోషింపుచున్నాఁడు' మున్నగువాని ప్రక్రియలో 'ఉన్న' అనుశబ్దము ననుబంధముగ

నిల్చినచో శేషము నెట్లు సాధించికొనియుండును? కాఁగా నాతఁడు 'ఉన్న' అనియే యనుబంధము నంగీకరించియుండు ననియు వ్యాకరణమున వెనుకనుదాహరించిన (మూ పే. 20) కాకినాడప్రతి పాఠము సుసంగతమే యనియు గ్రహింపనగును.

ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని 25-5-9 నెం బరుగల తాళపత్రమాతృకలోను 'వసతి=వున్నాడు అనే వసత్యర్థః ము అనుబంధకః స్యాత్...' అని యున్నది. 'ఉన్నది' మున్నగువాని రూపములకై 'ఉన్న' అనునదియు గ్రాహ్యమే. కాఁగా నేచో యొకయుండు ధాతురూప మచట నుండు ననిమాత్రమే గ్రహింపనగును.

వస్తుగతిని బరిశీలించునెడల నిట బాలసరస్వతివ్యాఖ్య యేగాక యహోబలపతి వ్యాఖ్యయుఁ బ్రామాదికమే యనక తీరదు ఆంధ్రశబ్దచింతామణిలో—అందును క్రియాపరిచ్ఛేదమునందు—ముఖ్యముగాఁ దత్సమక్రియలకు మాత్రమే తిఙ్ప్రత్యయవిధానప్రక్రియను 'వ్యతిరేకాదౌ భావినిచాత్ స్యాత్' అనునవి మొదలగు సూత్రములచేత విధించి యట్టి తత్సమక్రియలకుఁ జెప్పఁబడిన 'అత్' మొదలగునవి దేశ్యక్రియలకుఁ గూడ రావచ్చు నని క్రియాపరిచ్ఛేదాంతమునందు నన్నయభట్టు 'అత్త్వాదితత్సమానామివ దేశ్యానాం క్రియాపదానాం చ' అను సూత్రముచేత నతిదేశించియున్నాఁడు. ఇంతియగాక యాంధ్రశబ్దచింతామణి (క్రియాపరిచ్ఛేదమున) లోఁ జెప్పఁబడిన యాతత్సమధాతుతిఙ్విభక్త్యంతసాధనసూత్రము లాచ్ఛిక క్రియాతిఙ్విభక్త్యంతసాధనమునకుఁ జాలవనితలఁచి గ్రంథాంతమందలి 'అత్త్వాది'త్యాద్యతిదేశసూత్రము తర్వాత 'వర్ణా

గమోవిశేషః పురుషేష్వర్థేషుచాపి వచనేషు' అని సూత్రించి యున్నాఁడు కాన తత్సమక్రియారూపసాధన సందర్భములోని పునరాగమసూత్రముచేత 'ఉన్నాఁడు' అనుచోట దీర్ఘముచే యుట నన్నయభట్టారకహృదయము కాదు. మఱియు పునరాగమసూత్రములోని పునశ్శబ్దము విశేషశబ్దపర్యాయముగ వ్యాఖ్య చేయఁబడుట చేతనే కార్థమునకే 'పునరాగమః క్రియాణాం స్మ'నియు 'వర్ణాగమోవిశేషః...' అనియు సూత్రద్వయము రచింపఁబడెననికూడ నసంగతముగా నంగీకరింపవలసి వచ్చును. ఇంతియకాక నన్నయభట్టారకుఁడు తన భారతభాగమున నెచ్చటను బ్రయోగములేని 'ఉన్నాఁడు' అను రూపమును సాధించుట కిట్లు సూత్రించెననెడి వ్యాఖ్యానము వక్తృతాత్పర్యానుకూలము కానేరదు. నన్నయభట్టారకుఁడు వర్తమానార్థమున వసత్యర్థకాచ్ఛికధాతువనఁగా నుండు ధాతువు తత్సమధాతువుల కనుబంధముగా నిలుచుచుండు నని మాత్రమే చెప్పెను గాని 'ఉన్న, లేక, ఉన్నా' అనురూపమనుబంధముగా నిల్చునని చెప్పియుండలేదని 'వసతిరనుబంధక' ఇత్యాదిసూత్రములోని 'వసతిః' అనుశబ్ద ముద్ఘోషించుచున్నది.

పైసందర్భమునుబట్టి పునరాగమసూత్రము 'ఉన్నాఁడు' అనుచో దీర్ఘమును సాధించుచున్నదనుట నన్నయభట్టహృదయము కాదు. అట్లే, 'అవధరించు' ధాతువునుండి 'అవధారు' అనుగ్రామ్యరూపమును దానిచే సాధించుటయు నన్నయభట్ట సమ్మతము కాదు. అవధారు శబ్దము నాతఁ డెచ్చటను వాడియుండలేదు. ఇయ్యది తరువాతికవులప్రయోగముచే ననింద్యగ్రామ్యముగా నంగీకరింపఁబడినది. ఇట్లే 'చూపెడు' అనునది

మొదలగు దేశ్యక్రియలయందున్న 'ఎదు' అనునది పునరాగమ సూత్రముచే వచ్చె ననందగునని యహోబలపతి వేఱొకచోట వ్రాసెను. అదియు నన్నయాభిప్రేతము కానేరదు.

పై కారణములచేత 'పునరాగమ' ఇత్యాదిసూత్ర మహోబలపతి యుదాహరించిన పయిరూపముల సాధనము విషయమున గ్రంథకర్తచే నుపదేశింపఁబడలేదనియు, నయ్యది 'రక్షింపమి, రక్షింపక, రక్షింపకుము' మున్నగువానిలో వచ్చు 'మి' మొదలగు నాగమముల సాధనమున కుపదేశింపఁబడి యుండెననియు గ్రహింపనగును. ఇట్టి ప్రయోగములు నన్నయ భారతభాగమునఁ బ్రాచిత్యముగా నున్నవి. ఇట్లు ప్రాచిత్య విషయమునం దీసూత్రమును సమన్వయించునపుడే 'పర్యాప్తో మస్మత్తేతుసంకేతః' అను నుత్తరసూత్రము సుప్రసక్తమగును. కాని యహోబలపతిపక్షమున సకలధాతుసాధారణమగు 'ఉన్నా'నుబంధదీర్ఘ విషయమున సమన్వయించినచో 'పర్యాప్త' ఇత్యాద్యుత్తరసూత్రము సుప్రసక్తము కానేరదు.

అహోబలపండితుఁడును నొకచోట నీరీతినే పునరాగమ ఇత్యాదిసూత్రమునకు వ్యాఖ్య చేసియున్నాఁడు. అచటఁ బునరాగమసూత్రసాక్ష్యములుగా 'డి, డు, క, మి' అనునా గమములువచ్చిన దేశ్యక్రియలు తత్సమక్రియలుకూడ నుదా హరింపఁబడినవి. వానిలో 'క, మి' అనునవి గల తత్సమ క్రియలు నన్నయభట్టుచే నుడుగనైనఁ బ్రయుక్తములై యుండుటం జేసి, 'క, మి' అనునవి పునరాగమసూత్రమునకు విషయములగుచుఁ గ్రియాపరిచ్ఛేదమున కెల్ల నతిదేశము చేయుచున్న అత్త్వాదీత్యాదిసూత్రముచొప్పున దేశ్యక్రియ

లలో నున్నపుడును దత్సూత్రమున కుదాహరణములు కానో
పును. కాని 'డి, డు' అనునవి తత్సమక్రియలయం దెచ్చటను
నన్నయభట్టారక ప్రయోగములలో నగపడకుండుటం జేసి యవి
పునరాగమసూత్రమున కేవిషయములు కానేరవు. కాన 'అత్త్వాది'
త్యాద్యతిదేశమున దేశ్యక్రియలయందు బొత్తిగాఁ దత్సూ
త్రముచే సాధ్యములు కావు. ఈవిధమున నన్నయభట్టారకుఁడు
తన భారతభాగములో నెచ్చటను దత్సమక్రియలను 'డి, డు'
ప్రత్యయాంతములనుగాఁ బ్రయోగించియుండమిం జేసి దేశ్య
క్రియలకే గాక తత్సమక్రియలకును డు,డి వర్ణకములు పునరా
గమ ఇత్యాదిసూత్రముచేత సిద్ధించుననుట యసంగత మనక
తీరదు. 'పోయెడిన్, వచ్చెడున్, నవు రాజిల్లెడు, మోము
వాఁడు... రాక, పోక, ఘటింపక,... చేయమి, ఘటింపమి...
* ఏతేప్యాచార్యగ్రంథేచస్థితాః 'అంభోరుహామిత్రుఁడ స్తగిరిఁ
జెందెడు నంచు' 'విషముచేసెడు వారికిన్' 'అసికర్మకౌశలం
బమరఁజూపెడువారు' ఇత్యాది తద్వచనాత్. ఏతేడ్యాదయః
పునరాగమసూత్రేణ విహితా ఇతివా సువచమ్'(అహో. 487
పుట.) 'ఏతేడ్యాదయః' అనుచోట లేఖకాదిప్రమాదమున
'ఏతేన్యాదయః' అని పడియున్నది. పైగ్రంథమునం దెచ్చటను
'ని' వర్ణకవిషయము చెప్పఁబడనందునను జింతామణిలో 'ని'
వర్ణకము చెప్పఁబడుటచే నథర్వణుఁడు చెప్పవలసిన ప్రసక్తిలేనం
దునను 'న్యాదయః' అనునది తప్పు. ఈమాత్రమునైనఁ జూచి
కొనక యథాస్థితముగ శొంఠి భద్రాద్రిశాస్త్రులుగారు 'ఈని
వర్ణకాదులు' అని తెనుఁగు టీక వ్రాయుట శోచనీయము.
ఇచ్చటనే గాక పెక్కుస్థలములలో నీ రహోబలపతిగ్రంథము

నర్థము చేసికొనకయే సంస్కృతసాహిత్యబలమున 'ముక్తస్య ముక్తోర్థః' అన్నట్లుగాఁ దెనుఁగుటీక వ్రాయుచువచ్చిరి.

29. ఈయిరీతిగనే యీక్రిందిస్థలమందును నొకొక్క మాతృకయందు నొకొక్కరీతిని చింతామణిపాఠమును దాని వ్యాఖ్యానమును గనఁబడుచుండుటంజేసి బాలసరస్వతీకృత మగు వ్యాఖ్య యిదియని నిర్ణయించుట దుష్కరముగా నున్నది. బాలసరస్వతిటీకమాట యటుండఁగా నచట నన్న యాభిప్రేతపాఠ మేదియో గ్రహించుట మఱియు దుష్కర ముగ నున్నది.

> "సంప్రార్థనార్థకాదిదే దాతౌ ప్రశ్నలక్షణౌ భవతః,
> ఏదోతౌ వ్యతిరేకాదపి సంప్రార్థనపరౌ క్రియాణాం స్తః."

అనుపాఠము సాహిత్యరత్నమాతృకలోనిటీకవలన వ్యక్తమగు చున్నది. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములోని '26-8-9' నెంబరుగల మాతృకలోఁగూడఁ బైపాఠమే గ్రహింపఁబడి నదని యందాని టీకవలన విశదమగుచున్నది. కాని యం దాకారిక ప్రమాదవశమున వ్రాయఁబడలేదు. కవిశిరోభూ షణమునందును బైపాఠమే యంగీకరింపఁబడియున్నది.

"'సంప్రార్థనార్థకాత్' ప్రార్థనార్థకమైన క్రియాపదము మీఁద, ఇత్=ఇకారము వచ్చును. నతీంపుమీ ప్రోవుమీ ఏదాతౌ ఏకార ఆకారములు, ప్రశ్నలక్షణౌ=ప్రశ్నలక్షణా లైన స్వభావాలు, భవతః=అగును. చేశెద చనియదా ఏదోతౌ ఏకార ఓకారాలు, వ్యతిరేకాదపి=వ్యతిరేకముమీఁదనున్ను,

సంప్రార్థనాపరౌ = సంప్రార్థనార్థప్రధానాలు, క్రియాణాం= క్రియలకు, స్తః=అవును. ననుబ్రోవవెగారి చేపట్టవో అంబ."
(ప్రాచ్యలిఖిత 25-8-9 నెంబరుగల మాతృక.)

'సంప్రదానార్థకాదిదేతో పృశ్నలక్షణౌ భవతః,
ఏదంతౌ వ్యతిరేకా దపి సంప్రార్థనపరౌ క్రియాణాం స్తః.'

'సంప్రార్థనార్థకాత్ =సంప్రార్థనార్థకమైన క్రియాపదము మీాద, ఈత్ =ఈకారమువచ్చును. రక్షింపుమీా, ప్రోవుమీా, ఏదౌతౌ=ఏకారౌకారాలు, ప్రశ్నలక్షణౌ=ప్రశ్నలక్షణాలైన స్వభావాలు, భవతః=అవును. ననుబ్రోవవె గారి, చేపట్టవో అంబ, చెసేవే,చని యద్యా ఏదోతౌ=ఏకారఓకారాలు వ్యతిరేకముమీాఁదనున్న = సంప్రార్థనాపరౌ= సంప్రార్థనార్థప్రధానాలు, క్రియాణాం=క్రియలకు, స్తః=అగును. నునుబ్రోవవె గారి, చేపట్టవో అంబ'
(సాహిత్యపరిషన్మాతృక.)

సూ. "సంప్రార్థనార్థకాదీత్"

వ్యా. 'సంప్రార్థనార్థక ముదుజ్వర్ణకాంతాత్క్రియాపదాదీత్స్యాత్.' ననురక్షింపుమీా కావుమీా పొమ్మీా రమ్మీా కావుఁడీ పొండీ రండీ నాయంనిత్యోవిధిః 'వివాహామొనర్పు' మిత్యాద్యాచార్యవచనాత్.'

"అచ్చతుమ్కుంభవేత్పాణి స్థితం ప్రశ్నాదివాచకమ్" ఇత్యాథర్వణ సామాన్యోక్తి మహిమ్నా ఏడీ సిపాటి ఏరీ సీసాటివారు ఏడీ ఏరీ ఇతిరూపాణి సిద్ధాని." (అహో. 495)

సూ. "ఏదోతౌ ప్రశ్నలక్షణౌ భవతః"

వ్యా. "ఏదోతౌ ప్రశ్నార్థకౌ భవతః. 'కాచితివే మమ్ము నిపుడు కమలదళాక్ష' 'ప్రోచితివా మమ్ము నిపుడు భువనాధీశా" ఇత్యాది.

"ప్రోచెదవా నన్ను ద్రౌపదీపరిత్రాణ ప్రోవవా నాయందు కరిరాజు భువన త్రాణ ఇత్యాది. వ్యతిరేకేషు బహుత్వాదపేత్యుక్తే రనవస్థాత్-పల్కు దేటి కేవధూమణి నీమె బాలికకీమె గాత్రి" ఇత్యాది.

(ఆహో. 496 పుట.)

సూ. "ఏదోతౌ వ్యతిరేకాదపి సంప్రార్థనపరౌ క్రియాణాం స్తః"

వ్యా. 'వ్యతిరేకాదపి క్రియాపదాదేదోతౌ సంప్రార్థనార్థకౌ స్తః, నన్ను రక్షింపవో రామ నళినదయన, ప్రోవవే నన్ను నేవేళ భూమిపుత్త్రి' ఇత్యాది.

" 'అఖిలబ్రహ్మాండనాయకుండవన్నత్రాపి రేన'
'వచ్చునో రాఘవా దరుచు వాఁడెవుఁ మోమున నెదజేరఁగన్'
'పొందవె యైరావతద్విపకుంభకుచకుంభ
సంభారహారి శచీశ్వరుని వంతో'
ఇత్యాది వచనాని సాధూని ....." (ఆహో. 496 పుట.)

ఇపుడు ముద్రింపఁబడుచున్న బాలసరస్వతీయమునకుఁ బ్రచురముగ మూలమగు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములోని '11-12-5' నెంబరుగల మాతృకలోను, మ-రా-శ్రీ, రావుసాహెబు గిడుగు రామమూర్తిపంతులుగారి మాతృక

లోను, ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారముననున్న 322 నెంబరుగల కవిజనాంజన మను పేరితో ముద్రింపఁబడిన బాలసరస్వతీయటీకాభాగములోనునీ క్రిందిరీతిని పాఠాంతరములుగలవు. కాకినాడమాతృకలో నీశ్లోకము మొదలుకొన్న టీక చినిఁగి పోయినది. కాని యీశ్లోకముమాత్ర మున్నది. ఆ యున్న శ్లోకముగూడ నీ పాఠాంతరములరూపముననే యున్నది. ఇంచుమించుగా నన్నియు నేకరీతినే యుండుటచేత గ్రంథవిస్తరభీతిని ద్వైమాతృకలలోఁ బ్రాచ్యలిఖితపుస్తకభాండాగారస్థమాతృకాపాఠమును ('11-12-5' నెంబరు) మాత్రమే యీసందర్భమున నుదాహరించుచున్నాను.

౧౭. "సంప్రార్థనార్థక ముదుజ్వర్ణాద్యంతాత్క్రియాపదాదిత్ స్యాత్,
వ్యతిరేకేతు సుబంతాదేదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః." ౧౫.

'౧౭. టీక. సంప్రార్థనార్థక = సంప్రార్థనార్థకము లైనటువంటి, ముదుజ్వర్ణాద్యంతాత్ = ముకారదుకారములు అంతమందుగలటువంటి, క్రియాపదాత్ = క్రియాపదముమీఁదను, ఇత్ స్యాత్ = ఇకారము వచ్చును. రక్షించుమా అనేచోట రక్షింపుమీ అని వచ్చును. రక్షింపుడు అనేచోట రక్షింపుడీ అనివచ్చును. యీలాగునే కావుమీ, ప్రోమ్మీ కావుడీ పొండీ రండీ అనేశబ్దములు చూచుకొనేది. ఆదిశబ్దముచేత ప్రశ్నాదివాచకములకు ఇకారము గలదు. నీసాటియేదీ, నీసాటియేరీ, యేదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః=ప్రశ్నవాచకములు ఏదాతౌ ఏకారమున్ను ఆ కారమున్ను, భవతః=అవును. మమ్ముగాచితివే రక్షించితివా నన్నుబ్రోవవే.వ్యతిరేకేతు సుబంతాదపి అన్నాడు

గన్క సుబంతమునందు ఏకారము గలదు. పల్కవిదేటికి యేమే యబలాశిరీషగాత్రి ఇత్యాదికము చూచుకొనేది.'

౮౮. "ఏదోతౌ వ్యతిరేకాదపి సంప్రార్థనపరౌ క్రియాణాం స్తః భావేట వక్తణాంతే..............."

౮౮. టీక. "వ్యతిరేకాదపి = వ్యతిరేకార్థము మీఁద నున్ను, క్రియాణాం = క్రియాపదములకు, ఏదోతౌ=ఏకార ఓకారములు, సంప్రార్థనపరౌ = సంప్రార్థనార్థకములై, స్తః = అవును. నన్ను రక్షింపవే, నన్నుబ్రోవవే, అపిశబ్దమువల్ల మరి యొకయర్థముమీఁదనున్ను వచ్చును. వచ్చునో రాడో వాడు, వానిదలచితో ఇత్యాదికములు చూచుకొనేది."

పయినుదాహరించిన పాఠద్వయమునకును నా కారమునఁ బరస్పరభేదమున్నను నభిప్రాయమున నధికభేదము లేదు. 'సంప్రార్థనార్థకాదీత్' అనుదాని యర్థముమాత్రమే 'సంప్రార్థనార్థక ముదుజ్వర్ణాద్యంతాత్' అనుదానివల్లఁ గూడ లభించుచున్నది. ఇఁక నందలి యాదిశబ్దము నర్థముమాత్రమే యాప్రథమసూత్రమునందలి యధికమగు విశేషము. అట్లే రెండవసూత్రములోఁ గూడ 'సుబంతాదపి' అన్నవిషయమే విశేషము. మూఁడవసూత్రమున భేదమే లేదు పై రెండుసూత్రములలోని విశేషములవలన 'వదినీసాటి, వరినీ సాటి' 'పల్కవిదేటికే, ఏమేబాలా' అనురీతిగల సుబంత ప్రశ్నార్థకరూపముల సాధనము సంభవించుచున్నది ఇట్టి రూపములు చింతామణిచేత సాధింపఁబడలేదన్న కొఱంతను బూరించుటకే యథర్వణాచార్యుఁడు,

"అచ్చతుష్కంభవేత్ప్రాశి స్థితం ప్రశ్నాదివాచకమ్."
అనుకారికను సూత్రించియుండెను.

"అచ్చతుష్కంభవేత్ప్రాశి స్థితం ప్రశ్నాదివాచకమ్. ఇత్యాథర్వణ సామాన్యోక్తిమహిమ్నా ఏడి సీసాటి ఏరి నీసాటివారు ఏఁడీ ఏరీఇతి రూపాణి సిద్ధాని.... ......................" (అహో. 495)

అని యిట్టిట్టి కారిక నుదాహరించి యారూపముల నహోబల పతి యుదాహరించిన కవిశిరోభూషణవ్యాఖ్య వెనుక నుదాహరింపఁబడియే యున్నది. ఆంధ్రశబ్దచింతామణిలో లేనివిషయములను చూరించుట సవరింపవలసిన విషయములను సవరించుటమాత్రమే ప్రయోజనముగాఁగల (ఈవిషయము నారచించిన యథర్వణకారికావళి పీఠికలో విపులముగఁ జూపఁబడెను.) యథర్వణగ్రంథములోఁ బైరీతిని సుబంత రూపములు సాధింపఁబడుట నరయఁగా నథర్వణుని నాఁటికిఁ జింతామణిలో నీసుబంతశబ్దసాధకపాఠాంతరములు ప్రక్షిప్తములు కాలేదనియు నాకారణముననే యాతఁడట్లు పూరింపవలసివచ్చెననియు విశదమగుచుండుటచేత నీసుబంతశబ్ద సాధకపాఠాంతరములు ప్రక్షిప్తములే యని సిద్ధాంతితమగు చున్నది. బాగుగఁ బరిశీలించునపుడీ పాఠాంతరములోని 'సంప్రార్థనార్థక ముడుజ్వర్ణాద్యంతాత్ క్రియాపదాదీత్ స్యాత్' 'వ్యతిరేకేతు సుబంతాత్' అను శ్లోకభాగముల రచనలోఁ బ్రక్షిప్తపాఠకర్తలు విశేషశ్రమనందక వెనుక నుదాహరించిన యహోబలపండితీయవ్యాఖ్యానములోని

"సంప్రార్థనార్థక మధ్యమస్యైక కాంతాత్ క్రియాపదాదీత్ స్యాత్."
(అహో. 495 పుట.)

"వ్యతిరేకే సుబంతాదపీత్యుక్తేః." (అహో. 496 పుట.)

అను వాక్యములనే యించుక దిద్దికొని గ్రహించిరా యని యాలోచింపవలసి యున్నది. ఏది యెట్లయినను నీద్వితీయ పాఠ మహోబలపండితీయమును జూచియే కల్పింపఁబడినదను టకు సందేహము లేదు. 'వ్యతిరేకే సుబంతాదపీత్యుక్తే రథ స్యాత్' అను నహోబలపండితీయవాక్యమును బట్టి (అహో. 496 పుట) "వ్యతిరేకేచ సుబంతా" త్తనువాక్యము చింతా మణిలో నున్నదనియు నథర్వణుఁడు వ్యతిరేకమం దని చెప్పి యే యుండలేదనియుఁ దలంచి పయిప్రక్షిప్తపాఠకల్పనము చేసిరా యనియుఁ దోఁచుచున్నది. కాని యట్లు భ్రమింపరాదు. అహోబలపతి వెనుకటిసూత్రప్రవ్యాఖ్యానములో (495 పుట) 'అచ్చతుష్క' మిత్యాద్యథర్వణకారిక నుదాహరించియుండు టచేత నుత్తరసూత్రప్రవ్యాఖ్యలో 'వ్యతిరేకే సుబంతాద పీత్యుక్తే రథస్యాత్' అని వ్రాసెనని గ్రహింపనగును. ఇఁక నట్టి 'అచ్చతుష్క' మిత్యాదికారికలో 'వ్యతిరేకే' అనుదా నికి మూలమగు శబ్దము లేదని భ్రమింపరాదు. ఆంధ్రశబ్ద చింతామణి కథర్వణకారికావళి శేషగ్రంథమగుటచేతను నాంధ్రశబ్దచింతామణిలోని 'సంప్రార్థనార్థకాదిత్యాది శ్లోక మునఁ జెప్పఁబడిన- 'ఈ, ఆ, ఏ, ఓ' 'అను నచ్చులు కొన్ని క్రియారూపములమీఁద నిల్చి ప్రార్థనార్థకము లగుననిమా త్రమే 'సంప్రార్థనార్థకా త్త'ననది మొదలగు నాసూత్రమునఁ జెప్ప బడియుండుటచేతను నాయచ్చులు నాల్గును హల్మాత్ర

ముమీఁద ననఁగా నెల్లక్రియాపదములమీఁదమాత్రమే గాక సుబంతములమీఁద సయితము నిల్చి యథాసంభవ ముగాఁ బ్రార్థనార్థమునే గాక ప్రశ్నాద్యర్థమునుగూడఁ దెల్పు ననియు నిట్లు సంప్రార్థనార్థకాదిత్యాది చింతామణికారికను 'అచ్చుతుమ్మ' యిత్యాదికారిక నవరించుచున్నదని గ్రహింపవల యును. ఆంధ్రశబ్దచింతామణి కథర్వణకారికావళి శేషగ్రంథ మనుట కీసందర్భముకూడఁ బ్రబలమగు నిదర్శనమే యని పాఠకమహాశయులు గ్రహింతురుగాక! పై రీతి నథర్వణుఁడు నవరించిన విషయములు చింతామణిలోనే గలవనుట కేవ లము నసంగతము కదా!

పయిసందర్భముచేత నీ "సంప్రార్థనార్థకము దుజ్వర్ణా ద్యంతా"దిత్యాదిపాఠము ప్రక్షిప్తమని సిద్ధాంతితమయినను నింకను నేతద్విషయము విమర్శింపవలసియే యున్నది. బాగు గాఁ బరిశీలింపఁగా 'సంప్రార్థనార్థకా దీదేదాతౌ ప్రశ్నలక్షణో భవత' ఇత్యాదికారికసైతము నన్నయరచితస్థితినుండి యించుక మాఱినదనియు దానిని బాలసరస్వత్యహోబలపతులు విభా గించిన సూత్రముల విభాగము గూడ సరికాదనియుఁ బయి విషయములలో నన్నయభట్టారకుని యాశయము వేఱుగా నున్నదనియుఁ దోఁచుచున్నది.

సంప్రార్థనేత్యాదిశ్లోకములోని యాద్యంతసూత్రములు ప్రార్థనార్థకరూపమాత్రసాధకములే యై యుండుటం జేసి తత్సూత్రద్వయ మధ్యగతసూత్రముకూడఁ బ్రార్థనార్థకరూప విషయకమే యై యుండు నని తత్కారికాసందర్భస్వారస్య మున విశదమగుచున్నది. తుదిని 'ఈ'శబ్దము నిల్చినను బ్రార్థనా

ర్థకరూపములు స్వార్థమునే బోధించునని గదా ప్రథమాసూ
త్రార్థము. అట్లగుటచే నేకారాకారములు ప్రశ్నలక్షణము
లగునని బోధించెడి యనంతరసూత్రములోని 'ఏకారాకార
ములు' ప్రార్థనార్థకరూపములమీఁద నిల్చిరే యట్టి యర్థము
నిచ్చునని యాసందర్భమున వర్ణనుచేయుట యుక్తము. ఆ
పక్షమున ప్రార్థనార్థకరూపములపై 'ఏ' అనుశబ్దము నిల్చుట
యప్రసిద్ధ మనఁగా నెచ్చటను వాడుకలేదు. కాన నాసూత్ర
మున కల్లర్థముచేయుటకు వలనుపడ దయ్యెను. అట్లగుటం
జేసియుఁ, జేసితివి మొదలగురూపములమీఁద 'ఏ' శబ్దమును
'ఆ'శబ్దమును నిల్పి ప్రశ్నార్థకము లౌటఁ బ్రసిద్ధమై యుండు
టం జేసియు, వ్యాఖ్యాతలీసూత్రమున కట్టియర్థమును జేయ
సాహసించిరి. గ్రంథకర్తకే యట్టియుద్దేశ మున్నయెడల నాసం
దర్భములో నభ్యాహృతమగుచున్న 'సంప్రార్థనార్థకాత్' అను
దానినిదప్పించి యెట్టిక్రియలమీఁద నా 'ఎటిలు'నిల్పి ప్రశ్నా
ర్థకములగునో యను విషయమును విశదీకరించియుండఁడా?
మఱియు 'ఏదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః' అనుదానికిఁ బూర్వ
సూత్రమున నీశబ్దాంతములయ్యుఁ బ్రార్థనార్థకక్రియలు స్వార్థ
మునే బోధించునని చెప్పఁబడినపుడును, నుత్తరసూత్రమున
'ఏ-టీ' శబ్దములతోఁ గూడిన వ్యతిరేకక్రియలుగూడఁ బ్రార్థ
నార్థమునే బోధించు నని చెప్పఁబడుచున్నపుడును, నా రెండు
సూత్రముల నడుమనున్న 'ఏ'దాతావిత్యాదిసూత్రమునఁ
బ్రశ్నార్థవిధానము చేయఁబడియుండునా? మఱియు నెట్టి
క్రియలపై నిల్చునపు డట్టియర్థము వచ్చునో యనువిషయ
ము చెప్పఁబడకుండునా? కాఁగా 'ఏదాతౌ ప్రశ్నలక్షణౌ

భవతః' అని సూత్రమును విభజించి వ్యాఖ్యాతలు చేసిన యీయర్థము సరియై యుండ లేదనక తీరదు.

30. పయి కారణముల చేతఁ బయినిజూపిన యనుపపత్తుల కవకాశము లేకుండ

"సంప్రార్థనార్థకాదీచ్చాదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః,
ఏదోతౌ వ్యతిరేకా దపి సంపార్థనపరౌ క్రియాణాం స్తః."

అని గ్రంథకర్త యీశ్లోకమును రచించియుండునా యని యాలోచింపవలసియున్నది. ఇట్టి పాఠము నంగీకరించినపుడు

I "సంప్రార్థనార్థకాదీచ్చాదాతౌ"
II "ప్రశ్నలక్షణౌ భవతః,
ఏదోతౌ వ్యతిరేకాదపిసంప్రార్థనపరౌ క్రియాణాం స్తః."

అని యిట్లీ కారికను రెండుసూత్రములుగా విభజింపవలసి యుండును. ఈపక్షమునఁ బ్రార్థనార్థకక్రియల మీఁద 'అ, ఆ' అనుశబ్దము లేగాక 'ఈ' శబ్దమును నిల్చునని మొదటిసూత్రమున కర్థము చేయవలయును. అర్థవిశేషము చెప్పఁబడమింజేసి స్వార్థమే బోధ్యమగుననియు గ్రహింప నగును.

"వ్యతిరేకార్థకక్రియల మీఁద 'ఏ, ఓ' అనుశబ్దములు నిల్చి ప్రశ్నార్థకము లగుచున్నవి. అట్లయినప్పటికిని నాప్రశ్నార్థకములు సంప్రార్థనపరము లే యగుచున్నవి" అని రెండవ సూత్రమున కర్థమును గ్రహింపవలెను. నన్నయభట్టారక భారతభాగమునందు

"ఇన్ని దినంబు లేల మసలితి చెపుమా" (ఆది. 1 ఆ. 117)

"ఎవ్వరి సతి యిది చెప్పుమా జాతవేద" (ఆది. 1 ఆ. 130 ప.)

క. "రక్షింపుమ, రక్షింపుమ, రక్షింపుమ యనుచు" (ఆది. 2 ఆ. 217)

"సుందరి మా యిద్దఱలోఁ జెప్పవె వలతు నెవ్వనిమీఁదనప్పుడు"
(ఆది. 8 ఆ. 110 ప.)

అని యిట్లతిప్రచురముగా 'అ, ఆ' శబ్దములును నరుదుగా 'ఈ' శబ్దమును బ్రార్థనార్థక క్రియలమీఁద ననుప్రయుక్తము లగుచుండుట పై పక్షమునకు మిక్కిలి యనుకూలముగా నున్నది.

చ. "వృషగత మైనజీవ మిది యెచ్చునుపాయము సేయ రాదొకో."
(ఆది. 1 ఆ. 150 ప.)

తరల. "పితామహా పిరి కిచ్చుటఁ జిత్తశాంతి యొనర్పవే"
(సభాప. 2 ఆ. 35 ప.)

అని యిట్లు నన్నయభారతభాగమున రెండవసూత్రమునకును ననుకూలములగు ప్రయోగములు వెలయుచునే యున్నవి.

61. 'చేయరాదొక్కొ' అనునవి మొదలగు పయినుదాహరించిన నన్నయభట్టప్రయోగములను బట్టిచూడఁగా నీచింతామణికారికలోని 'ఈత్' అనునది మొదలగు వానియందలి తకార ముచ్చారణార్థకమని యంగీకరింపక తీరకుండుటం జేసి యీచింతామణికారికయందలి 'అదాత్' అనుపాఠముకూడ నన్నయభట్టీయము కాదేమో యని తోఁచుచున్నది. కావున నచట 'సంప్రార్థనార్థకాదిచోదాత్' అనుపాఠము నంగీకరింపవలసియున్నది. ఈపక్షమున 'ప్రార్థనార్థక క్రియలమీఁద స్వార్థమున 'ఈ, ఉ, ఆ' అనుశబ్దములు నిల్చునని యర్థము చెప్పవలెను. అపుడు 'రక్షింపుమీ, రక్షింపుమి, రక్షింపుము, రక్షింపుమ, రక్షింపుమా' అనునవి యీసూత్రమున కుదా

హారణములు కానోపును. ఈసందర్భమువలనఁ బ్రార్థనార్థక క్రియలమీఁద నీ 'ఈ' శబ్దాదులు నిల్చుట నిత్యము కాదని 'నాయంనిత్యోవిధిః వివాహమెునర్పుమి త్యాద్యాచార్యవచనాత్' అను నహోబలపతి వ్యాఖ్యానమువంటి వ్యాఖ్యానము చేసికొనవలసిన ప్రసక్తియుఁ దప్పిపోవుచున్నది. ఎన్ని విధముల నాలోచించినను నీపాఠమే నన్నయభట్టరచితమై యుండు నని దృఢముగఁ దోఁచుచున్నది.

చింతామణిమాతృకలలో పై నుదాహరించిన మాతృకలందుఁ బై రీతి నపపాఠములు పడియున్నను, విజయనగరమాతృకయందును గరకవలసమాతృకయందును నిట్టిపాఠమే వెలయుచున్నది.

> "సంప్రార్థనార్థకాదీశ్చోదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః, ఎదోతౌవ్యతిరేకాదపి సంప్రార్థనపరౌ క్రియాణాం స్తః" (సంప్రార్థనార్థకాదీ, చోదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః.)

ప్రార్థనార్థకమైన ప్రత్యయము మొదలను ఈత్ ఈకారము వచ్చును. "రక్షింపుమీ, పొందింపుమీ, పొందుమీ, ఘటింపుడీ, ఘటింపించుడీ, దేశ్యక్రియలకు నేయుమీ, నేయింపుమీ, ఉదాతౌ=ఉకార అకారాలు, ప్రశ్నలక్షణౌ=ప్రశ్నార్థసూచకములు, భవతః=అవును. శేవింపుడు, పోషింపుడు, పోషింపుమా, అనుసరింపుమా, అనుభవింపుడా, ఎదోతౌ=ఎకారఓకారాలు, వ్యతిరేకాదపి=వ్యతిరేకప్రత్యయములమీఁద సంప్రార్థనపరౌ=యాచ్నార్థపరములైన, క్రియాణాం=క్రియలకు, స్తః = అవును. రక్షింపవే=రక్షింపవో, హారింపవే=హారింపవో, భజిం

షవేం భజింపవో" (విజయనగరమాతృక. 41 తాళపత్రము.)

పైమాతృకపాఠమునకుఁ జాలవఱకు సరిగఁ గరకవలస మాతృకాపాఠమును వెలయుచున్నది.

ఈమాతృకాద్వయమునందలి పాఠమే యథర్వణుని నాఁటి చింతామణిలో నుండియుండె నని యాతఁడు చేసిన యీ క్రిందిసవరణమువలన విశదమగుచున్నది.

"అచ్చతుష్కం భవేత్ప్రాప్తి స్థితం ప్రశ్నాదివాచకమ్,
తత్రాదిచ్ఛభవేత్సిద్ధ పదో తాపభయాత్మకా.
క్వచిదూచ్ఛభవేదర్థ విశేష ఇతికేచన."

(వికృతివివేకము.)

సంప్రార్థనేత్యాది చింతామణిసూత్రములో నైదచ్చులను బ్రసంగించియున్నను నందు నాల్గుమాత్రమే 'అచ్చతుష్క'మిత్యాదికముచే వర్ణింపఁబడెను. ఆ చతుష్కమెద్దియో యుత్తరార్థముచేతనే విశదీకరింపఁబడెను. ఇఁకఁ బరిశిష్టమగు 'ఉకారమునకు' దీర్ఘవిధానము తదనంతర శ్లోకభాగముచే వివరింపఁబడెను.

32. పయి మాతృకాద్వయమునే మూలముగఁ గొని యథార్థముగ సవరించినపాఠమే యిప్పుడు ముద్రింపఁబడుచున్న బాలసరస్వతీయమునఁ జేర్పఁబడెను. ఇందు 'ఉకారమును, ఆకారమును' ప్రార్థనార్థకక్రియలమీఁద నిల్పి ప్రశ్నార్థకములగు ననుపై వ్యాఖ్యానము మాత్రము ప్రామాదికమనక తీరదు. 'పోషింపుఁడు, పోషింపుమా' అనునవి మొదలగురూపములం దెంతమాత్రమును బ్రశ్నార్థభానము లేదుగదా!

'ప్రశ్నలక్షణౌ భవతః' అను శబ్దములను నావలెనే బాలసర స్వతియు నుత్తరసూత్రములోఁ జేర్చియున్నను లేఖకపా ఠకాదులు 'అర్థశ్చాంతమునకు సూత్రము తెగవలదా' అని శంకించికొని పైరీతిని సవరించిరో లేక బాలసరస్వతియే యట్లు రచించెనో తెలియకున్నది. పయిని వ్రాసినరీతిని 'పోషింపుఁడు పోషింపుమా' అను వానియందుఁ బ్రశ్నార్థభానము లేమింజేసియే తరువాతివారు 'ఉదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః' అను దానిని 'ఏదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః' అని సవరించి యుందురనియునందు 'ఏకారము' ప్రార్థనార్థక క్రియాప్రత్యయ ములమీఁద నిల్చుట యెచ్చటను లేనందున నచటి సందర్భ సాంగత్యము విడుచుకొనుటకును సాహసించి 'కాచితివే, ప్రోవవే, రక్షించితివా'అనురీతి నుదాహరణాంతరములను జూపి యుందురనియు నూహింపవలసి యున్నది.

33. పయిరీతినే చింతామణి పాఠములను గుఱించియు వాని యభిప్రాయములను గుఱించియు నుత్తరోత్తరవ్యాఖ్యా తలెల్ల బాలసరస్వతీయమునే యాధారముగా గ్రహించి యుండుటచేత ననేకస్థలములందు బాలసరస్వతిచేసిన ప్రామాదికవ్యాఖ్యలే యుత్తరోత్తరవ్యాఖ్యానములందెల్ల విస్తరించుటం జేసి చింతామణికర్త నిగూఢాశయములు పెక్కు లడుగంటియుండిపోయినవి. ఈవిషయమున విస్తరభీతి నొక్క యుదాహరణమును మాత్రము చూపుచున్నాను.

శ్లో. "లఘ్వేకాక్షరపూర్వక్రియాంతిమస్యానయోర్భవేదిద్వా,......"

‘అనయః=అయ్‌పరిణతి లేనట్టి, లఘ్వ్యకాక్షర=లఘువగు నేకాక్షరము, పూర్వ=పూర్వమందుఁ గల, క్రియా=క్రియల యొక్క, అంతిమస్య=కడపటిదైన, ఇత్=ఇకారము, వా=వికల్పముగ, భవేత్=అగును......ఘట్ అనేది లఘ్వ్యకాక్షరపూర్వము ‘అయ్’లేనిదియుఁ కనుక దీని తుది ఇకారమునకు ఇత్వము రాఁగా ఇంచుగాగమము ప్రత్యేకముగ నిల్చెను. ఘటియించె...’(బాలసరస్వతి 53 శ్లో. క్రియా. 30 సూ.)

దీని ననుసరించియే యహోబలపండితునివంటి వాఁడును నీక్రిందిరీతిని వ్యాఖ్యానము చేసియున్నాఁడు.

వ్యా. “లఘుపకాక్షరం. పూర్వం యస్యాంతిమాక్షరాత్ తస్మాదయంత క్రియావర్తితాత్ క్రియాపదాత్ ఇత్వం వా స్యాత్.”
(కవిశిరోభూషణము. 455 పుట.)

పరిశీలింపఁగా నీసూత్రమునకు నన్నయభట్టారకుఁడు ‘యకారపరిణతి లేనట్టియు లఘువైనట్టియు నేకాచ్కమైనట్టియు నుత్తరపదము కానట్టియు క్రియయొక్క తుది నికారము నిల్చు’నను నర్థమును వివక్షించియున్నట్లు తోఁచుచున్నది. ఇట్లర్థము చేయుటచేత సమస్తపదమునందలి యుత్తరపదముగా ధాతువుండునపుడు “ఇత్వము” రా నేరదనియు, నక్కారణమున ‘ఉత్తరియించు, ప్రతిఘటియించు, సాక్షాత్కరియించు’ మున్నగు రూపములకు సాధుత్వము లేదనియు నన్నయభట్టాశయము విశదమగుచున్నది. తర్వాతికవుల ప్రయోగములలో ‘ఉత్తరియించు, ప్రతిఘటియించు’ అను వానివంటి క్రియలగపడుటం జేసి యథర్వణుఁడు

"నప్రాద్వ్యయసంబంధస్తన్నిషేధేప్రయోజకః."

అని సూత్రించినవాఁడయ్యెను. చింతామణిసూత్రమునఁ గ్రియ సమాసోత్తరపదమై యుండరాదని చెప్పియుండనపుడు పైయథర్వణసూత్రము నిరాలంబమును నిరర్థకమును గావలసి వచ్చును గదా! కాఁగాఁ బయి చింతామణిసూత్రమునకు నా చెప్పిన యర్థమథర్వణవివరణ మూలక మగుటచేఁ బ్రామాణిక మగుచున్నదనియు బాలసరస్వతీయాదుల వ్యాఖ్య సరికాదనియుఁ జెప్పుటకు సందేహము లేదు. చింతామణ్యాథర్వణకారికల కిట్టి సంబంధ మనేకస్థలములందు వెలయుచుండుటచేత నే వాని కేకగ్రంథత్వము సిద్ధాంతిత మగుచున్నది.

34. ఈవఱకు బాలసరస్వతీయమాతృకాభేదముల వలన నాంధ్రశబ్దచింతామణిలోఁ గల్గిన పాఠభేదములు కొన్ని చూపఁబడినవి. ఇంక బాలసరస్వత్యప్పకవుల మాతృకల భేదముల వలనఁ గల్గిన చింతామణిపాఠభేదములు కొన్ని యిట విశదీకరింపఁబడుచున్నవి.

అప్పకవీయపు సంజ్ఞాసంధిపరిచ్ఛేదముల భాగము మాత్రమే యుపలబ్ధమగుచుండుటచే నా రెండు పరిచ్ఛేదములలోని పాఠభేదములు మాత్రమే చూపఁదగియున్నవి. అప్పకవీయపీఠికనుబట్టి చూచినను, నందలి చింతామణికారికలను బట్టి చూచినను గొఱవడిన యనుపలబ్ధములయియున్న యప్పకవీయమాతృకలోని మూఁడుపరిచ్ఛేదములందుఁగూడ ననేకములగు పాఠభేదము లుండియుండునని యూహించుట కవకాశము గల్గుచున్నది.

బాలసరస్వతీయస్థాంధ్రశబ్దచింతామణిలో సంజ్ఞాసంధ్యజంతహలంత క్రియాపరిచ్ఛేదము లయి దగపడుచున్నవి. 'ముందు బృందారకభాష నశేష విద్యాజలజాసనుండగు శబ్దశాసనుండు సంక్షేపంబుగాఁ గూర్చిన యాంధ్రవ్యాకరణము నందలి సంజ్ఞాసంధి తత్సమదేశ్యక్రియాపరిచ్ఛేదంబులైదునుం డెనుఁగుఁబలుకుల నేను విస్తరించి భాషాపరిచ్ఛేదంబును వర్ణపరిచ్ఛేదంబును వళిప్రాసపరిచ్ఛేదంబును బద్యపరిచ్ఛేదంబును సంధిపరిచ్ఛేదంబును దత్సమపరిచ్ఛేదంబును దేశ్యపరిచ్ఛేదంబును క్రియాపరిచ్ఛేదంబును నను నామంబుల నెనిమిదిగా నెలకూచి బాలసరస్వతిసకలభాషాకవి మహోపాధ్యాయప్రణీతాంధ్రవ్యాఖ్యానగ్రంథం బాధారంబుగా రచియింపంబూని' (అప్పకవీయము ౧-ఆశ్వా. ౧౦౩) అను నప్పకవి వాక్యములనుబట్టి యాతనికి దొరకిన చింతామణిలో బాలసరస్వతి మాతృకలోని యజంతహలంత పరిచ్ఛేదములకు మాఱుగఁ దత్సమదేశ్యపరిచ్ఛేదము లున్నట్లు విశదమగు చున్నది. దీనిని బట్టియజంతహలంత పరిచ్ఛేదములలోని తత్సమశబ్దసంబంధి సూత్రముల నేర్చికూర్చి తత్సమపరిచ్ఛేదముగను, నారెండిటిలోఁగల దేశ్యశబ్దసంబంధి సూత్రముల నేర్చికూర్చి దేశ్యపరిచ్ఛేదముగను నెవ్వరేని మార్చిరని స్ఫురింపక మానదు. ఉపలబ్ధమగుచున్న యప్పకవీయ గ్రంథభాగములో నున్న సంజ్ఞాసంధిపరిచ్ఛేదముల నాతఁడు భాషావర్ణసంధి పరిచ్ఛేదములను మూఁటినిగావిభాగించి యట్లు మార్చిన విషయమును స్పష్టముగా వక్కాణించియుండుటచేతఁ బయిని వ్రాసిన యజంతహలంతపరిచ్ఛేదముల నట్లు మార్చి యా విషయమును వక్కాణింపక కప్పిపుచ్చెనని చెప్పుట సాహస

మనిపించును. అట్లయినను నాతఁడు పైని వ్రాసినరీతిని బాల సరస్వతీయము నొకచేతఁ బట్టుకొనియే తనగ్రంథమును వ్రాయుచుండియుఁ దనమాతృకకును, బాలసరస్వతి మాతృకకును ననేకస్థలములందుఁ గల పాఠభేదములను గుఱించి గాని పెక్కుస్థలములలోఁ దార్మారైయున్న సూత్రముల వరుసనుగుఱించిగాని తనగ్రంథమున నుద్ఘాటింపకుండుట మాత్రము శంకాస్పదమగుచున్నది.

ఇఁక బాలసరస్వతీయము నేఁటికిని బ్రచురింపఁబడకుండుటచేత నయ్యది యెవ్వరిచేతనైనఁ దార్మాఱయి యుండఁగూడదా యని సందేహించుట కవకాశము లేదు. ఈ వఱకు లభించుచున్న బాలసరస్వతీయపు మాతృకలన్నిటియందు మూలమగు నాంధ్రశబ్దచింతామణియొక్క సూత్రములును, వానివరుసయు నేకరీతినే వెలయుచున్నవి. మఱియు నప్పకవికి సమీపకాలము వాఁడగు నహోబలపండితుఁడు చేసిన కవిశిరోభూషణవ్యాఖ్యానమునందలి యాంధ్రశబ్ద చింతామణిసూత్రములును, వానివరుసయు నిపుడు దొరకుచున్న బాలసర్వతీయ టీకయొక్క పుస్తకములలో నున్నరీతినే యున్నవి గాని యించుకేని వ్యత్యాసము లేదు. వేయేల? అహోబలపండితున కనేక బాలసరస్వతీయటీకామాతృకలు లభించినట్లును, నింకను బాలసరస్వతీకరలిఖిత మాతృకసైతము లభించియున్నట్లును నాతని కవిశిరోభూషణమునందలి 'అత ఏవశాస్త్రమపౌరుషమాద్యంప్రాయిక ('ప్రాలంబక' అనునది ఛందోభంగముఁజేయుపాఠము)నిత్యప్రయోగలక్ష్యైతత్, దృశ్యమతిష్ఠవిరంయజ్ జ్ఞాత్వా శబ్దః ప్రయుక్తఆర్షసమః' ఇతి

క్వచిత్పుస్తకే సరస్వతీకలిత ఏవ శబ్దానుశాసనప్రణీతత్వేన పద్యం స్థితమ్' (అహోబలపండితీయము. 119 పుట) అను గ్రంథమువలన స్పష్టపడుచుండుటచేత నహోబలపండితీయము లోని చింతామణి, బాలసరస్వతి గ్రహించిన చింతామణి మాతృకకు నభిన్నముగనే యున్నదనుటకు సందేహము లేదు.

కాఁగా, బాలసరస్వతి చింతామణి మాతృకకును నప్పకవి చింతామణి మాతృకకును గల పాఠభేదములును, సూత్రముల వరుసలోని భేదములును వారికిఁ బూర్వమే సంభవించియుండుటగాని, వారి యిరువురలో నొకరిచేతఁ గల్పింపఁబడి యుండుటగాని జరిగియుండవలెననక తీరదు. రెండుమాతృకలకును బాఠభేదము లుండుటయేగాక పరిచ్ఛేదముల విభాగములోను, సూత్రముల యానుపూర్విలోనుగూడఁ జాల వ్యత్యాసములు గలవు. వీనిలోఁ గొన్ని యధికపాఠములును, గొన్ని పాఠభేదములును, సూత్రముల వరుసలోని భేదమును, బరిచ్ఛేదవిభాగములోని భేదమును నప్పకవిచేఁ గల్పింపఁబడినవే యని చెప్పక తప్పదు. ఈవిషయము ముందు విశదీకరింపఁబడును. మఱొకవింత! అహోబలపండితునకు దొరకిన యప్పకవీయమాతృకలో లేని చింతామణి సూత్రములును వాని పద్యవివరణములును, నప్పకవీయములో నగపడుచున్నవి. అహోబలపండితీయములో 'సర్వత్రాజ్ఞతాశ్చర్య మితిసూత్రంతు తత్పుస్తకే నదృశ్యత ఏవ' (అహోబలపండితీయము. ౧౫౨ పుట) అనువాక్యమగపడుచున్నది. ఇప్పటి అప్పకవీయములోని సంధిపరిచ్ఛేదమునందలి చింతామణికారికల పట్టికలో 'సర్వత్రాజ్ఞతా-

ర్యంజ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః, లుక్ సంశ్లేషౌ నాచి ద్రుతస్యసర్వత్రలుక్ సమాసేషు' అను కారికమూఁడవదిగా నుదాహరింపఁబడి యున్నది. మఱియు నక్కారిక వివరణ సందర్భములోఁగూడ నుదాహరింపఁబడి యున్నది. ఆకారిక లోనిసూత్రములకు 'ఉ. ఆరయవైకృతోక్తులఁ బదాదుల యందు యకార ముండ దా, తీరున......' అనునది మొద లగుపద్యగద్యముల(౭౨—౧౧) వివరణముగూడ నగపడు చున్నది. దీనినిబట్టి వీనినెవ్వరేని యహోబలపండితునకుఁ బూ ర్వమున నహోబలపండితీయమునుండి తొలఁగించిరనిగాని, యహోబలపండితుఁ డప్పకవీయమును సరిగఁజూచుకొనక యట్లు వ్రాసెననిగాని యంగీకరింపక తీరదుగదా!

35. అప్పకవి తనకు దొరకిన చింతామణిమాతృకలోని పరిచ్ఛేదము లన్నిటియందునుగల కారికలమొత్తముసంఖ్య యెనుబదిరెండని యీక్రిందిరీతిని జెప్పియున్నాఁడు.

క. ఇల నెనుబదిరెండార్యలు
గలుగు పరిచ్ఛేద పంచకంబునఁ దగునీ
విలసిత ఫక్కి మతంగా
చలవిప్రునివలన నీదు సదనముఁ జేరున్.'

అప్పకవీయము (౧ ఆ. ౧౨౪ ప.)

.............................

క. ఆ విప్రు నతిథిఁగా సరి
భావించి భుజింపఁబెట్టి భాషించునెడన్

దా 'విశ్వశ్రేయ' స్సను
నీవచనము సదువ నేచటి దిది యన నకటఁడున్.

క. నన్నయభట్టీయములో
నెన్నఁగఁ బ్రక్రమార్యగాదె; యా పొత్తములో
నున్నవి యవి యెనుబదిరెం
డన్న మహాద్భుతముఁబొందె యప్పు డెల్లరకున్.

(అప్పకవీయము, ౧ ఆ. ౬౬, ౬౭ ప.)

ఇప్పు డుపలబ్ధములగుచున్న యప్పకవీయ మాతృకల లోను, ముద్రితాప్పకవీయపుస్తకములలోనుగల భాషావర్ణ సంధిపరిచ్ఛేదములు మూఁడిటియందును నున్న శ్లోకముల సంఖ్య నలువదినాలు గయియున్నది. (భాషాపరిచ్ఛేదములో నివి, ౬+సంజ్ఞాపరిచ్ఛేదములోనివి, ౨౦+సంధిపరిచ్ఛేదము లోనివి, ౧౮=కలిసిన [४४] నలువదినాలుగగుచున్నవి.) ఇందు వెనుక నుదాహరించిన వివాదస్థమగు 'సర్వత్రాజ్యత్వాత్కా ర్యమ్......' అను శ్లోకముచేరియే యున్నది. 'శాస్త్ర మపౌ రుషమాద్యమ్......' అను శ్లోకము చేరియుండలేదు. ఇఁక నప్పకవి గ్రంథాదిని బ్రతిజ్ఞచేసిన యెనిమిదిపరిచ్ఛేదములకుఁ గొఱవడి యనుపలబ్ధములయియున్న తత్సమదేశ్య క్రియాపరి చ్ఛేదములనెడి మూఁడిటిలోను ముప్పదెనిమిది శ్లోకములు మాత్రమే యుండవలసియున్నది. బాలసరస్వతీయమందలి చింతామణిలోని యజంత హలంత క్రియాపరిచ్ఛేదముల శ్లోకము లేఁబదియెనిమిదై యున్నవి. ఈ యేఁబదియెనిమిది టిలోఁ జేరినసూత్రములుగాని, వానివిషయములుగల

సూత్రములుగాని సుమారు రెండు కారికల పరిమితిమాత్రమే గల

" '......అయిగవుగాదేశౌ స్తః; క్రమేణ సర్వత్రవక్రతమయో ర్వా.' 9. 'వాస్యా త్క్వచిద్గకారో నాదిగత స్యాద్యవర్గసరళస్య ......' 10. (వర్ణపరిచ్ఛేదము); 'కవిభల్లటైః క్రియాణాం నా మ్నాం చోల్లోపఇష్యతే హ్యేషు, ప్రథమైకవచనమాత్రే వికృ తౌ నాంతాదయోపికథ్యంతే.' 'వికృతిపదేలాటోరపి......' "

(సంధిపరిచ్ఛేదము)

అనునవిమాత్రమే యప్పకవీయములోని . యుపలబ్ధపరి చ్ఛేదములలోఁ జేరియున్నవి. కాఁగా రమారమి పదునేని మిది శ్లోకములు బాలసరస్వతీయమాతృకలోని యజంత హలంత క్రియాపరిచ్ఛేదములలో నున్నవి. యప్పకవి మాతృ కలోని తత్సమదేశ్య క్రియాపరిచ్ఛేదములలో లోపించినవని విశదమగుచున్నది. కాని యట్టి మూఁడు పరిచ్ఛేదములును లభింపమింజేసి ఏయేకారిక లాతని మాతృకలో లేవో, వానివిషయములు వేఱువిధమునఁ జేర్పఁబడెనో, లేదో గ్రహింప వీలుపడకున్నది. బాలసరస్వతీయమాతృకలో లేని పెక్కువిషయముల సూత్రములతోనున్న యుపలబ్ధపరిచ్ఛేద ములు విషయబహుళములయి యుండఁగాఁ, గొఱవడిన పరిచ్ఛేదములు బాలసరస్వతీయ మాతృకకంటె విషయహైన్య ముతో నుండుననుట మిక్కిలి యాశ్చర్యము నొదవించు చున్నది. విషయహైన్యమన నింతింతగాదు. గ్రంథములో మూఁడవభాగము తగ్గియుండుట.

ఇంక బాలసరస్వతీయ మాతృకలలోఁ జింతామణి కారిక లెనుబదియేనిమిది యగపడుచున్నవి. వానిలో 'సర్వతంత్రాస్వతంత్రస్య' యిత్యాది శ్లోకము చేరియే యున్నదని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. 'శాస్త్రమపౌరుషమాద్య'మిత్యాదికారిక చేరలేదు. అద్దానిని మూలములోఁ జేర్చిన వావిళ్ల వారి టీకగల పుస్తకములో నెనుబదితొమ్మిదికారిక లున్నవి. అహోబలపండితుఁడు బాలసరస్వతిమాతృకనే యనుసరించిన వాఁడుగాన నాతని గ్రంథమునందును నాయెనుబదియేనిమిది కారికలకే వ్యాఖ్య చేయఁబడినది. మఱియుఁ బై విషయముల నెల్ల నహోబలపతి తనవ్యాఖ్యానముఖమున నీక్రిందిరీతిని నివేదించి యున్నాఁడు.

"మత్స్యేంద్రనామ సిద్ధేంద్ర మహిమ్నా సిద్ధతాంగతః,
జగ్రాహ వ్యాకృతిం తస్మాత్ కవి ర్బాలసరస్వతీ.
ఏలకూచి కులాంభోధి చంద్రా త్తానితాకరః,
సమస్తకవితాదక్షో వక్ష్యతే టీకాన్వయే.
తత్ర పంచపరిచ్ఛేదా శ్శబ్దశాస్త్రే నియంత్రితాః,
ఆద్యాఖ్యపద్యై స్తత్సంఖ్యా సమ్మితాస్స్యు ర్నగై ర్గజైః.
మతంగశైల విప్రేంద్రా త్తస్య వ్యాకృతి పుస్తకమ్,
తామునా దృష్టకవినా గృహీతం తత్ర సద్గతాః.
పాఠభేదాస్తు బహవో దృశ్యంతే పుస్తకద్వయే.
మయా ప్రాయ స్సరస్వత్యాః పుస్తకం పరిగృహ్యతే.
అపూర్వ్య పుస్తకారూఢ పాఠభేదా ద్యదుత్థితమ్,
మయా సంగృహ్యతే రూపం త దప్యాపద్వినోత్థితః.

(అహోబలపండితీయము. 4-5 పుటలు.)

36. ఇఁక సుఁ్కలబ్ధములగు పరిచ్ఛేదములలోఁ గల పాఠభేదములు మాత్రమే విమర్శింపవలసియున్నది. అద్దాని కన్న మున్నుగ వేఱొక చిన్నవిషయమును విమర్శించు చున్నాను. పాఠభేదవిమర్శనమునకన్న నీ విషయము ముం దుగ విమర్శించుటయే యావశ్యకమగుటచే నట్లు చేయు చున్నాను.

'ఆర్యాఖ్యపద్యైః' అని యహోబల పండితుఁడును, 'ఇల నెనుబది రెండార్యలు', 'ప్రథమార్యగాదె' అని యప్ప కవియుఁ జింతామణికారిక లార్యావృత్తములనియు నందలి మొదటిశ్లోకమార్యయే యనియుఁ జెప్పియున్నారు. బాలసర స్వతియు 'విశ్వశ్రేయః కావ్యమ్...' అనుశ్లోకమునకుఁ డీక వ్రాయనారంభించి 'ఈఆర్య నాలుగుసూత్రములు' అని వ్రాసి యున్నాఁడు. నిజమారయఁగాఁ జింతామణి (బాలసరస్వతి మాతృక) యంతటిలోను సామాన్యార్యాశ్లోకములు నాలు గుమాత్రమే కనఁబడుచున్నవి. తక్కినవెల్ల గీత్యుద్గీతులనెడి యార్యావిశేషములై యున్నవి. అప్పకవి మాతృకలోని యధికపాఠములలో మఱొక యార్యవివాదస్థమై యున్నది. మఱియు బాలసరస్వతిమాతృకలోని యొక యుద్గీతి యప్ప కవీయపాఠములో సామాన్యార్యగా మాఱినది. ఎనుబది యెనిమిదిగాని, యప్పకవి యధికపాఠములనుబట్టి యంతకన్న నధికసంఖ్యగాని గల చింతామణిశ్లోకములలో నయిదాఱు మాత్రమే సామాన్యార్యలై యుండఁ దక్కినవెల్ల గీత్యుద్గీ తులే—అందును నధికసంఖ్య (ఎనుబదికిఁ బైఁగా) గీతులే— యైయుండ గ్రంథమెల్ల సామాన్యముగ నార్యలని వ్యవహ రించుట యుక్తము కాదుగదా!

ఈ సందర్భమున నార్యాభేదముల లక్షణములను జూప్రట యావశ్యకమని తలంచి వాని నీక్రిందిరీతి నుదాహరించుచున్నాను.

'లక్ష్మైతత్సప్తగణా, గోపేతా భవతి నేహ విషమే జః, షష్ఠోఽయం చ నలఘూ వా, ప్రథమేఽర్ధే నియత మార్యాయాః. షష్ఠే ద్వితీయలా న్నలే, పరకే ముఖలాచ్చ సయతిపదనియమః, చరమేఽర్ధే పంచమకే, తస్మాదిహ భవతి షష్ఠో లః.'

(వృత్తరత్నాకరము. ఆర్యాప్రకరణము. ౧, ౨ శ్లోకములు.)

'ఆర్యాప్రథమదళో క్తం, యది కథమపి లక్షణం భవేదుభయోః, దళయోః కృతయతిశోభాం, తాం గీతింగీతవాన్ భుజంగేశః. ఆర్యా ద్వితీయకేఽర్ధే యద్గదితం లక్షణం తత్ స్యాత్, యద్యుభయోరపి దళయో, రుపగీతిం తాంమునిర్బ్రూతే. ఆర్యా శకలద్వితయం వ్యత్యయరచితం భవేద్యస్యాః, సోద్గీతిః కిలగదితా, తద్వద్యత్యంశ భేదసంయుక్తా.' ఆర్యా పూర్వార్ధంయది, గురుణైకేనాధికేన నిధనేయుక్తమ్, ఇతర త్తద్వన్నిఖిలం యదీయ ముదితేయమార్యాగీతిః. ('దళంయదీయముదితేయ మార్యాగీతిః' అని ధీశోధనీ వ్యాఖ్యాపాఠము.)

(వృత్తరత్నాకరము-గీతిప్రకరణము. ౧-౨-3 శ్లోకములు)

ఏడుచతుర్మాత్రాగణములు నొక గురువును బూర్వార్ధమునందును, నాలు చతుర్మాత్రాగణములు నొకగురువును, బంచమషష్ఠగణములనడుమ నొకలఘువును నుత్తరార్ధమునందును గల శ్లోకము సామాన్యార్య. అట్టియార్యయొక్క

పూర్వార్ధలక్షణముతోనే పూర్వోత్తరార్ధములు రెండును నున్న శ్లోకమునకు గీతియని పేరు. ఆర్యయొక్క యుత్తరార్ధ లక్షణమే పూర్వోత్తరార్ధములు రెంటనుగల శ్లోక ముపగీతి యనఁబడును. ఆర్యయొక్క యుత్తరార్ధలక్షణముపూర్వార్ధము నందును, బూర్వార్ధలక్షణ ముత్తరార్ధమునందునుగల శ్లోక ముద్గీతియనఁబడును. ఆర్యాశ్లోక పూర్వోత్తరార్ధములు రెంటను నొక్కొక్కగురువు నెక్కువగానిల్పినశ్లోక మార్యాగీతి యనిపించుకొనునని కొందఱ యభిప్రాయము. (ఇదియే సిద్ధాంతము.) ఆర్యయొక్క పూర్వార్ధమునమాత్ర మొక్క గురు వధికముగానుండునట్లు చెప్పిన శ్లోక మార్యాగీతి యని మఱికొందఱ యభిప్రాయము. ప్రథమ తృతీయపాదములు పూర్వోత్తరార్ధములందలి మొదటి మూఁడేసిగణములతో పదచ్ఛేదము నందినచోఁ బథ్యార్య యనఁబడును. అట్లు కానిది విపులార్య యనఁబడును. విస్తరభీతి నాశ్లోకముల నిట వ్రాయలేదు.

పయిలక్షణములనుబట్టి చింతామణిశ్లోకములఛందస్సును బరిశీలింపఁగా నీక్రింద నుదాహరించిన పట్టికలోని పదిశ్లోకములు తప్పఁ దక్కినశ్లోకము లెల్ల గీతిశ్లోకములై యున్నవి.

చింతామణిలోని సామాన్యార్యలు.

1. "ఔపవిభక్తిక సంజ్ఞా వర్ణాః..." (సంధి-30)
2. "నిత్యందారాదేశ్చ ... ..." (అజంత-49)
3. "అనుతాం స్త్రియాం సమానామ్" (అజంత-52)
4. "ప్రథమైకవచనతుల్యామ్ ..." (హలంత-54)

## చింతామణిలోని యుద్గీతులు.

1. "ఆద్యప్రకృతిః ప్రకృతి, శ్చాద్యే ఏషాతయోర్వికృతిః..."

(సంజ్ఞ-5)

(అహోబల పండితీయమునను, వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్సువారి టీకగల పుస్తకమునందును 'ఏషా తయోర్భవే ద్వికృతిః' అని పాఠాంతర ముండుటచేత నాపక్షమున నిదియు గీతియే యగుచున్నది. ఉద్గీతి కానేరదు.)

2. "ద్వివిధాపిదు దేవోత్థోఁచో వక్రతమాపను స్వారా" (సంజ్ఞ. 7)

('వక్రతమావథాప్యను స్వారా' అని యహోబల పండితీయాప్పకవీయములలోఁ బాఠాంతర మగపడు చుండుటచే నిదియు నీపక్షమున గీతియే యగుచున్నది. ఉద్గీతి కానేరదు.)

3. "నుమ్‌చోకః పరుషాణాం, గసడదవాః స్యుః పదార్ద్వంద్వే, సామానాధికరణ్యే, షాదంతానాం టుగా గమోఁచిస్యాత్".

(సంధి. 28 శ్లో.)

('ప్రథమముగపిద్విసులోర్వద్ధ్రితస్య సర్వత్ర లుక్ సమాసేషు, హేమోక్తేః పరుషాణాం. గసడదవాస్స్యుః పదార్ద్వంద్వే' అని యప్పకవీయములో వ్యత్యాసముగాఁ బాఠాంతర మున్నది. ఈపక్షమున నిది

సామాన్యార్య యగుచున్నది. ఉద్గీతి కానేరదు.) ఇఁక నిర్వివాదములగు నుద్గీతు లీక్రిందివిమాత్రమే.

4. "క్షేపాంచి దుదంతానామ్..." (అజంత-51)
5. "ఆత్మన ఇమనంతానామ్..." (హలంత 56)
6. "స్వగుకర్మధారయా......" (హలంత-69)

పయి నుదాహరించిన పదిశ్లోకములును, ముందు విమర్శింపఁబోవు మఱొక శ్లోకమునుదప్పఁ దక్కిన చింతామణి శ్లోకములెల్ల నెనుబదికిఁ బైఁగా గీతిశ్లోకములై యున్నవి. సామాన్యార్యాశ్లోకములు నిర్వివాదములైనవి నాల్గుమాత్రమే యున్నవి. ఇట్టిస్థితిలో గ్రంథమెల్లసామాన్యముగా నార్యలని వ్రాయుట సరికాదుగదా!

అహోబలపండితుఁడు చింతామణికారికలు పైరీతి నార్యలని వ్రాసియు, 'విశ్వశ్రేయః కావ్య' మిత్యాదిసూత్రవ్యాఖ్యానావసరమున మాత్రము,

> "సర్వాణి గ్రంథేఽస్మిన్ పద్యాన్యార్యాగీతివృత్తాని - 'లక్ష్మైతత్సప్తగణా గోపేతాభవతి నేహవిష మేజః.' "ఇత్యాది సామాన్యలక్షణాత్,'త్రిష్వంశకేషు పాదోదళయో రాద్యేషుదృశ్యతే యస్యాః, పథ్యేతినామ తస్యాశ్ఛందోవిద్భిస్సమాఖ్యాతమ్' ఇతి విశేషలక్షణాచ్చ, 'ఆర్యాద్యర్ధసమాగీతి' రితి పైంగళసూత్రాచ్చ, గురులఘుప్రమాణనిశ్చయాది తత్తత్ప్రపంచనంతు వృత్తరత్నాకరే తద్వ్యాఖ్యానే లలితేచ ద్రష్టవ్యమ్."
>
> (అహోబలపండితీయ. ౬-౭ పుటలు.)

అని యిట్లు వ్రాసియున్నాఁడు. దీనినిబట్టి యహోబలపతి చింతామణిశ్లోకము లార్యాగీతులనెడి యార్యాశ్లోకవిశేష ములని చెప్పెనో, లేక గీతిపథ్యార్యావిశేషములని చెప్పె నో? యను సందేహము పాఠకులకుఁ బొడమక మానదు గదా! చింతామణిశ్లోకములలో నొకటియు నార్యాగీతి శ్లోకము లేకనుట యెల్లరకును విదితమేగదా! ఇంకఁ జింతా మణిశ్లోకములెల్లఁ బథ్యార్యాగీతిశ్లోకములు గావు. "దు ము వు ల వః......(అజంత. ౬౭ శ్లో)" "ద్విగు కర్మధారయా తత్పురుష......(హలంత. ౬౫ శ్లో)" అనునవి మొదలగు విపు లాశ్లోకభేదములుగూడఁ జింతామణిలో ననేకములు గలవు. ఆర్యాభేదములలో నేదియైనను బథ్యగాని విపులగాని కాక తీరదు. కాఁగా సామాన్యార్యకుఁ బథ్యాభేదము విశేషము కానేరదు. సామాన్యార్యకు గీతిభేదములు విశేషములు కానోపును. ఆర్యలు జాతు లగుటచే వృత్తము లనిపించు కొనవు. కొందఱు వ్యాఖ్యాతలతోపాటుగ నహోబలపతి యట్లు వాడుట సరికాదు.

ఇఁక నహోబలపండితుని వాక్యములోని "ఆర్యా గీతివృత్తాని" అనుదాని కార్యాశ్లోకములును, గీతిశ్లోకము లును నని యర్థమనియు, గీత్యుపగీత్యుద్గీత్యార్యాగీతులు నాల్గు ను గీతిప్రకరణములోనివే యగుటచేత వానినెల్ల గీతులని యాతఁడు వాడియుండెననియు నభిప్రాయవర్ణనము చేయుట కవకాశ మగపడుచున్నది. కాని 'ఆర్యాగీతి, గీతి' అనునవి ప్రత్యేకముగా వేర్వేఱు జాతిశ్లోకములకు సంజ్ఞలై యుండు నపుడు నైరీతిని వ్యవహరించుట సరికాదుగదా! మఱియు

నా వాక్యములోని 'సర్వాణి' అనుపదముయొక్క స్వారస్య
ముచేతఁ జింతామణిలోని శ్లోకములెల్ల నొక్కవిధముగల
శ్లోకములేయని గ్రంథకర్తయభిప్రాయము స్ఫురింపకమానదు.
మఱియు నీ యహోబలపండితుఁడు 'ఆర్యాఖ్యపద్యై స్తత్సం
ఖ్యాసమ్మితాస్స్యాద్గజైర్గజైః' అని యిట్లు చెప్పిన చింతామణి
లోని యెనుబదియెనిమిది శ్లోకములును నేకవిధముగల యా
ర్యలే యనువాక్యము విరుద్ధము కాకతీరదు.

> "గీతిచతుష్టయమిత్థం ప్రత్యేకం షోడశప్రకారం స్యాత్ సాక
> ల్యేనార్యాణామశీతిరేవ భేదాః స్యుః"

అను (దీనిచే గీతులెల్లఁబథ్యార్యలే కావలయుననెడి వృత్త
రత్నాకర ధీశోధనీవ్యాఖ్య పరాస్తమగుచున్నది). ఛంద
శ్శాస్త్రసంప్రదాయముచొప్పున గీతిభేదములెల్ల నార్యా
భేదములే యగుటచేత వాని నార్య లని వ్యవహరింపనగు
ననియు, 'ఆర్యాభేదము లగు గీతిశ్లోకములు' అను నర్థమును
బయి యహోబలపండితుని 'ఆర్యాగీతివృత్తాని' అనుదానిచే
గ్రహింపనగుననియు నిటులఁ జెప్పనగునా యని యాలోచింప
వలసియున్నది. గీతులెల్ల నార్యాభేదములే యైనను గీత్యుప
గీత్యాదిసంజ్ఞలతోను 'గీతిపథ్యార్య, గీతి విపులార్య' అనునవి
మొదలగు సంజ్ఞలతోనుమాత్రమే వాడుట సంప్రదాయము
గాని, ప్రత్యేకశ్లోకములకు సంజ్ఞలైయున్న 'ఆర్యాగీతి'
'గీత్యార్య' అనునవి మొదలగు రీతులను వ్యవహరించుట
సంప్రదాయముకాదు. తుదికిఁ బ్రత్యేకముగ గీతులను

చేర్కొనునప్పు డార్య లనుటగూడ ఛందశ్శాస్త్ర సంప్రదాయము కాదు.

37. ఈ సందర్భమును, సంబంధించిన దగుటచేత నీ క్రింది పాఠభేదము ముందుగ నిచట విమర్శింపఁబడుచున్నది. అప్పకవీయమున మాత్రమే యగపడుచున్న యీ క్రింది శ్లోకము వేర్వేఱు పుస్తకములలో వేర్వేఱువిధములుగ నగపడుచున్నది. ఒక్కొక్కపాఠమున నొక్కొక్కవిధమగు ననుపపత్తి కన్పట్టుచున్నది. మీఁదు మిక్కిలిగ నీ శ్లోకమప్పకవి మాతృకలోనిది మాత్రమే యయియుండఁగా నీ పాఠములలో నేదియు నప్పకవీయ వివరణమునకు సరిపడియుండ లేదు.

(ఎ) "శుభవర్ణాశ్శుభశబ్దా
మేవ శుభగణాస్త్వపి చ కావ్యాదౌ;
గ్రాహ్యాః పురాస్త్రసగిరి
రుద్రే ష్వకచటపా మాతృకానింద్యాః".

(అప్పకవీయము.)

(మ-రా-శ్రీ, రావుసాహేబు గిడుగు వెంకటరామమూర్తిపంతులవారు పరిష్కరించిన వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండుసన్సువారి 1922 సంవత్సరపు ముద్రణపుఁ బుస్తకము. ౨ ఆశ్వాసము. 14 శ్లో. 45 పుట. 115 పుట.)

(బి) "......రుద్రే ష్వకచటతపామాతృకానింద్యాః"

(111 పుట.) (అప్ప)

"......... రుద్రేష్వకచటతపానింద్యాః"

(39 పుట.) (అప్ప)

(I పమ్మి యరుణాచలసెట్టిగారి 1902 సంవత్సరపు ముద్రణము పుస్తకము. ఇది నాసొంత పుస్తకము.

II యద్దనపూడి సంజీవయ్యగారి 1901 సంవత్సరపు ముద్రణము పుస్తకము. అను రెండుపుస్తకములలోను పైరీతి నే యున్నవి.)

(సి) "........రుద్రేష్వకచటతపానింద్యాః"

(I అహోబలపండితీయము. 164 పుట.

II ద్విత్రింత్రిణీ సీతారామకవిగారి వికృతివివేకటీక. 19 పుట.)

పై చింతామణిశ్లోకము నీ క్రిందిరీతి నధర్వణుఁడు పూరించియున్నాఁడు.

శ్లో. తృతీయోచ్చ తృతీయోష్మా తృతీయే సరళాస్త్రయః,
షోడశ వ్యంజనం చాపి షష్ఠస్థానే న యుజ్యతే.

(వికృతివివేకము. సంజ్ఞ. 29 సూ.)

పై నన్నయాథర్వణకారికలను (అప్పకవి కథర్వణకారికావళి పూర్తిగదొరకకున్నను, నందలికారికలు పండితపరంపరాపారాయణము మూలమున లభించియుండెనని ముస్ముందు విమర్శించు దానికిసందర్భమును సహాయపడఁగలదు.)

నప్పకవి యీ క్రిందిరీతిని బయి చింతామణిసూత్రపు వివరణము సందర్భమున నాంధ్రీకరించియున్నాఁడు.

క. ఆదిస్వరమును బ్రకమై
కాదశ షష్ఠార్ణములు కకారాదులలో
వాదట దంతోష్ఠ్యము లిడ
రాదు పురశకర్తృ గిరి హారస్థానములన్.

క. మూఁడవతాళన మొదలిడి
మూఁడుసరళవర్ణములును మూఁడవస్వరమున్
మూఁడవ యూష్మాక్షరమును
గూడదు కదియింప నెట్టి కూళకు నైనన్.

తే-గీ. వ్యంజనాహ్వయమున నొప్పు వ్రాలలోన
షోడశాక్షర మాఱవచోట నిలిపి
మచ్చరంబునఁ దనుఁ జంపవచ్చినట్టి
చెడుగునకునైనఁ బద్యంబు తుడుగవలదు.

(ఏ గుర్తు పుస్తకము.)

పయి మూఁడుపద్యములలో నీ క్రింది యొక్కచోట మాత్రమే (బి) గుఱుతు పుస్తకములలోఁ బాఠభేద మగపడుచున్నది.

“......1 అదటదంతోష్ఠ్యము లిడరాదు......”

పయిచింతామణిశ్లోకపాఠభేదములలో ‘ఏ’గుఱుతుగల పుస్తకములోని పాఠము పక్షమున నీశ్లోకము చింతామణిలో

సాధారణమయిన యధికతమసంఖ్య గలిగియున్న గీతియే యగుచున్నది. కాని యీపాఠ మప్పకవ్యంగీకృత మాతృకలోనిదనుటకు వలనుపడదని యాతని యీ సందర్భములోని యాంధ్రీకరణపద్యములవలన సువ్యక్తమగుచున్నది. 'ఆదట దంతోష్ఠ్యము" లను నప్పకవియొక్క పయి యాంధ్రీకరణమును బట్టి యీచింతామణిసూత్రములోఁ దక్కినయక్షరములతోపాటు తకారముండవలెనని యంగీకరింపక తప్పదు. అట్టితకారమందుఁ జేర్పఁబడియుండనందున నాపాఠ మప్పకవి గృహీతమాతృకలోనిది కాదని చెప్పవలసియున్నది.

ఇఁక 'బి' గుర్తుగల పుస్తకములలోని 'మాతృకా' శబ్దఘటితపాఠము ఛందోభంగదోషదూషిత మగుటచే నది లేఖకపాఠకాపభ్రమప్రమాదకృత మనుటకు సందియము లేదు. ఇంక 'అకచటతపానింద్వ్యాః' అను పాఠమును గ్రహింతమన్ననదియు నప్పకవ్యంగీకృత మాతృకలోనిదనుటకు వీలుపడకున్నది. పైసూత్రములలోని తత్తత్ స్థాన నింద్వ్యాక్షరములకు లక్ష్యములు చూపుటలో నప్పకవి కంఠోక్తముగ హాకారమును బేర్కొనుచు రెండులక్ష్యముల నీక్రిందిరీతిని నా సందర్భమునఁ జూపియున్నాఁడు.

'వేములవాడ భీమకవి పదునొకండవచోట హాకారంబు నిలిపి...

ఉ. చక్కదనంబు దీవియగు సాహిణిమారఁడు........." (462-ప.)

'ఎడవల్లి పర్వతన్న పంచమస్థానమునను హకారమును గూర్చి...'

క. "అంగజసంహారుండగు........." (468-ప.)

పై రీతి నప్పకవిచే జూపఁబడిన హకారోదాహరణములు సందర్భశూన్యములయి యసంగతములు కాకుండుట కయి వీఁడిలక్షణములలోఁ జింతామణిశ్లోకమునఁ గాకున్నను నప్పకవి వివరణములోనైన హకారనింద్యత చెప్పఁబడియుండి తీరవలెనుగదా? పై యప్పకవి వివరణములో (దంతోష్ఠ్య పాఠమున) నట్టి హకారనింద్యత లేనందునఁ జింతామణిసూత్రములోని హకారమును గూడినపాఠ మప్పకవిమాతృకలోని దనుట యెంతమాత్రమును బొసఁగదుగదా! పరిశీలింపఁగా నప్పకవీయమున నీ సందర్భమునం దీ క్రిందిరీతి నార్యగఁ బయి శ్లోకముండకతీరదని యప్పకవీయాంధ్రీకరణపద్యములవలనను, (దంతోష్ఠ్యపాఠమున) నాతని యుదాహరణములవలనను విశదమగుచున్నది.

శ్లో. "శుభవర్ణా శ్శుభశబ్దా, మేచ శుభగణాస్తవివకావ్యాదౌ,
గ్రాహ్యాః పురాస్త్ర రసగిరి, రుద్రే ష్వకచటతహానింద్యాః."

ఇఁక నీసందర్భమును బాగుగ విమర్శించునపు డీ యప్పకవి మాతృకాపాఠము నైతము చింతామణి కర్త్రభిప్రేతము కాదేమో యని సందేహింపవలసియున్నది. ఛందోగ్రంథములం దెల్లెడలను దృతీయాదిస్థానములలో నకచటలతో పాటు 'తప' వర్ణములుగూడ నీ క్రిందిరీతిని నింధింపఁబడుచు వచ్చుచున్నవి.

క. పురశర రసగిరిరుద్రుల
నరయనకచటతపలిడుట యనుచితమ య్యా
క్షరములును రసభజంబులుఁ
బరిహరణీయంబు లాడిఁ బంకజనాభా.

(అనంతామాత్యుని ఛందోదర్పణము. 1 ఆశ్వా. 25 పద్యము.)

మఱియు నప్పకవీయమున నీయఁబడియున్న లక్ష్యముల యొద్ద నప్పకవి వ్రాసిన వాక్యములలోఁ జేర్పఁబడకున్నను నా లక్ష్యములలో నీక్రింది మూఁడుపద్యములందుఁ బకారము దుష్టస్థానములలోఁ బ్రయుక్తమై యున్నది.

"నెల్లూరి తిరుమలయ్య ఆఱవచోటఁ దకారంబు నిలిపి తనగుఱ్ఱమును దొంగిలించిన శ్రీపతి రాజు పోతరాజును నేఁడు దినములకుం జావఁబెట్టిన చాటుధార.

చ. హాయమది సీత పోత వసుధాధిపుఁ డారయ రావణుండు......

(అప్ప. 2 ఆశ్వా. 467 పద్యము.)

ఏలూరిమంత్రి యైదవచోటఁ గకారము నిలిపి శ్రీశైలముం ద్రోచిన

చ. మునుపొకకేల రావణుఁడు...... (465 ప.)

తెనాలి రామకృష్ణయ్య పంచమస్థానంబునఁ గకారంబును సప్తమంబున దకారంబును గూర్చి చెప్పిన పద్యము.

క. బసవనకుఁ బుట్టినప్పుడె, పసరము గోవిందరాజు......"

(అప్ప. 2 ఆ. 470 ప.)

పయి సందర్భమునుబట్టి పకారముగూడఁ బయిసూత్రములోఁ జేరియుండఁదగిన దని విశదమగుచుండుటచేతను, పైనిజూపిన యనేకమాతృకలలోఁ బకారఘటితపాఠములగపడుచుండుటచేతను, నందుఁ బకారస్థితి నంగీకరింపనగునని తోఁచుచున్నది. ఇట్లు తపలు రెండిటిని పైసూత్రములో నిలిపి 'అకచటతపానింద్యాః' అనుపాఠ మంగీకరించునప్పుడు వెనుక నుదాహరించిన యప్పకవీయమునందలి పద్యములోని 'ఆదట దంత్యోష్ఠ్యములిడ, రాదు......' అను పాఠాంతరము సమూలక మగును. మఱియు నందలి 'ఆదట' అను వ్యర్థపదమును దీసివేసి 'ఆదులు దంత్యోష్ఠ్యము లిడ, రాదు......' అని సంభావ్యతనుబట్టి సవరించినచో నర్థసందేహముదీరి మఱింత యుక్తముగా నుండును. అట్లయినను బయినివ్రాసినరీతి నప్పకవీయమాతృకలోని యాతని యాంధ్రీకరణమునుబట్టియు, నాతఁడిచ్చిన లక్ష్యములను బట్టియు, పాకారఘటితపాఠమే యుండెనని యంగీకరింపక తీరదని యీవఱకు వ్రాసియేయున్నాను. కాఁగా, నప్పకవ్యాంధ్రీకరణానుమేయ మగు 'అకచటతపానింద్యాః' అను పాఠమును గాని, పైనివ్రాసినరీతిని బకారమేళనావశ్యకతనుబట్టి 'అకచటతపానింద్యాః' అను పాఠమునుగాని యంగీకరింపవలసి యున్నదని తేలుచున్నది.

'అకచటహమాతృకానింద్యాః' అను నప్పకవిమాతృకాపాఠముపక్షమునఁ దకారమును జెప్పనిలోపమును నధర్వణకారిక షోడశవ్యంజనంచాపీత్యాదికముచేఁ బూరించుచున్నదనియు 'అకచటతపానింద్యాః' అనుపాఠము పక్షమున మూల

ములోని రసశబ్దము నవసంఖ్యాపరమనియు నకారణమునఁ దకార మాఱవచోటఁగూడ నింద్యమని తెల్పుచుఁ జింతామణిసూత్రమును సవరించుచున్నదనియు నెన్నునది.

చింతామణిలోని న్యూనవిషయములను బూరించెడి వికృతివివేకమున నిట్టికారిక యుండుటంబట్టియే యట్టి పూరణమునకు మూల మనఁదగు 'శుభవర్ణాః.....అకచటపాః నింద్యాః' అనునవి మొదలగు ఛందోవిషయకశ్లోకములు బాలసరస్వతీయమాతృకలో లేకున్నను బ్రక్షిప్తములు కావనియు, నథర్వణాచార్యులనాఁటికే చింతామణిలోఁ జేరియున్నవనియు సిద్ధాంతితమగుచున్నది. కృత్యాదిప్రయోజ్య వర్ణగణాదివిషయమును స్థానాంతరములందుఁ బ్రసిద్ధముగా నింద్యములై యున్న అకచటాదుల విషయమును జెప్పకయే యథర్వణుఁడు 'తృతీయోచ్చ తృతీయోష్ఠా......' అనునది మొదలగు కారికను జెప్పియుండెనని యెవ్వరును జెప్ప సాహసింపలేరుగదా! చింతామణి వ్యాకరణగ్రంథ మగుటచేత నందలి యా ఛందోవిషయకశ్లోకములు ప్రక్షిప్తములయి యుండునని భ్రమించి పై యథర్వణకారికావళి సంబంధము నెఱుఁగని లేఖకపాఠకాదులు పై 'శుభవర్ణాః శుభశబ్దాః' అనునది మున్నగు కారికలను వ్రాయక విడిచినమాతృకలు బాలసరస్వతికి లభించియుండవచ్చునని యూహింపవలసి యున్నది. పైని వ్రాసినరీతినున్న చింతామణ్యథర్వణకారికల సంబంధమును బాగుగఁ బరిశీలింపలేక ద్వితింత్రిణీ సీతారామకవిగారు పై యథర్వణకారికల కర్థము వ్రాయునపుడు 'తృతీయః=మూఁడవదియైన, అచ్చు=అకారమును.....సరళాః=సర

శివర్ణములైన కచటలును...' అని యీరీతిగ వ్రాయుట
కేవలము ప్రామాదికమనుటలో నెవ్వరును విప్రతిపన్నులు
కాఁజాలరని నా నమ్మకము.

ఈయువిషయములను బాగుగ గమనింపని లేఖకపాఠ
కాదు లెవ్వరో పై చింతామణిసూత్రములో వారి కప్రసిద్ధ
మగు హకారముండుటయుఁ, బ్రసిద్ధమగు తకారము లేకుం
డుటయుఁ జూచి భ్రమించియుఁ దక్కిన పరుషములతోఁ పా
టుగఁ దకార ముండవలెనని తలంచియుఁ బై చింతామణి
సూత్రమును 'అకచటతపానింద్యాః' అని సవరించి యుండ
వచ్చును. ఈ శ్లోకమప్పకవీయములోనిది మాత్రమే యగుట
చేతను నప్పకవి లక్ష్యములలో పకారమును గంఠోక్తముగాఁ
జేర్కొనకుండుటచేతను దర్వాతివా రందలి పకారమును దీసి
వేసి శ్లోకపూరణమునకయి మాతృకాశబ్దమును జేర్చి 'అకచ
టత మాతృకానింద్యాః' అను గీతిశ్లోకపాఠమును గల్పించి
యుండవచ్చును. మఱికొంద ఱాపాఠములోఁ బ్రసిద్ధపకా
రము లేకుండుట సరికాదని తలఁచి ఛందోభంగమును
జూచుకొనక 'అకచటతపా మాతృకానింద్యాః' అను పాఠ
మును గల్పించియుండవచ్చును. తరువాతివా రట్టిఛందోభంగ
మును గ్రహించియుఁ దకారము పునరుక్తమని తలంచియు
నప్పకవియిచ్చిన లక్ష్యములలో హకారము కంఠోక్తముగఁ
జేర్కొనఁబడి పకార మట్లు పేర్కొనఁబడకుండుట నరసియు
తపలనువిడిచి హకారమును జేర్చి 'అకచటహా మాతృకానిం
ద్యాః' అను పాఠమును గల్పించియుండవచ్చును.

బాగుగఁ బరిశీలించినయెడలఁ బైనివ్రాసిన 'అకచటహ మాతృకానింద్యాః' అను నీ పాఠమే యప్పకవ్యంగీకృతచింతామణి మాతృకలో నుండియుండెనని చెప్పుట యుక్తముగ నగపడుచున్నది. ఈ పాఠమునకు విరుద్ధమైయున్న 'ఆదట దంతోష్ఠ్యములు' అను నప్పకవి వివరణపద్యభాగమున 'ఆదట నంతోష్ఠ్యమును' అని సంభావ్యముగ సవరించినచో నట్టి విరోధము వారింపఁబడుటయే గాక యప్పకవీయమునఁ బకార ముదాహరణవాక్యములలోఁ జేర్పఁబడకుండుటయు సమూలకము కాఁగలదు. అట్లయినను 'ప' కార నింద్యత సకల చ్ఛందోలక్షణగ్రంథ ప్రతిపాదిత మగుటచేత వానికి మూలముగఁ జింతామణిలో నారీతి నుండియుండునని తలఁచి పై రీతి నీపాఠము చింతామణ్యభిప్రేతము కాదేమో యని వ్రాయఁబడెను.

తాళపత్రమాతృక లిఖిత లేఖకపాఠకాదుల భ్రమ ప్రమాద సాహసాదికృతములగు పాఠాంతరములచేఁ గలుషితము లయిపోవుటచేత నాంధ్రవాఙ్మయమునందలి గ్రంథకర్తృప్రయుక్తపాఠములను గ్రహించుట దుష్కరమగుచున్నదని విమర్శకమహాశయులు గ్రహింతురుగాక!

38. మఱియు నన్నయభట్టారకుఁడు 'అకచటతపానింద్యాః'' అని చెప్పుటలో నీక్రిందిరీతి నొకయుక్తిని మనసున నిడికొని యుండెనని తోఁచుచుండుటచేతఁగూడఁ దత్పాఠమే నన్నయాభిప్రేతమని తోఁచుచున్నది.

"శుభవర్ణాశ్చాదికస్థా యే చ శుభగణాస్త ఏవ కావ్యాదౌ, గ్రాహ్యాః"

అను పూర్వసూత్రమునఁ గావ్యాదియందు శుభవర్ణమును శుభగణము నుండవలెనని చెప్పిన బహువచనస్వారస్య ముచేతఁ ద్రిత్వేబహుత్వమ్ను న్యాయమున మూఁడుగణము ల వర్ణములు కావ్యాదిని శుభములై యుండవలె నని యా తఁడు తలంచినట్లు వ్యక్తమగుచున్నది. ఇందు కనుకూలముగా

సీ. "ఆదిపద్యాది శ్రీకార మైనదేవ
వాచకం బైనశబ్దంబు పలుకు లిరులు
నాది పద్యాది మూఁడుగణాక్షరములు
చూడవలెఁ గాని యన్నియుఁ జూడవలదు."

అనుసూక్తి సులక్షణసారములో (119 పుట) నగపడుచున్నది. కాఁగా నాలుగక్షరముల గణములుగూడఁ గొన్ని వెలయుచుం డుటచేత మూఁడుగణములకుఁ బండ్రెండక్షరములగు ననియు నకారణమునఁ బండ్రెండక్షరములవఱకును శుభవర్ణముల నిలుపవలయు ననియు నన్నయభట్టారకుఁడుతలంచె నని తోఁచుచున్నది. కావుననే యాతఁడు పండ్రెండుస్థానముల లోను బద్యాదిమాత్రము మొదలుగా విషమసంఖ్యాకస్థల ములలోని వర్ణములు శుభములుగా నుండవలె నని తలంచి యాస్థలములందు వాయుబీజము లగుటచేఁ గేవలము నింద్య ములగు 'అకచటతప'లు ప్రయోజ్యములు కావని చెప్పి యుండె ననియు నట్లు విషమస్థానములలో శుభవర్ణము లున్న యెడల వానికిఁ బరమందుండెడి సమాక్షరములు శుభములే

యగు నని యాతఁడు తలంచియుండు ననియు నూహింప వలసియున్నది. శుభవర్ణసంబంధమున నశుభవర్ణములును శుభములే యగుననుట ఛందశ్శాస్త్రసంప్రదాయసిద్ధము.

క. చందనతరుసంగతిఁ బిచు
మందంబులు పరిమళించు మాడ్కిని నందా
నందకర మైనగణముల
పొందున దుష్టగణవర్ణములు ప్రియ మొసఁగున్.

(సులక్షణసారము. 116 పుట.)

ఆ-వె. వరుస వేదితోడఁ బెరసినలోహంబు
జాతరూపమైన చందమునను
సారమైన గణము సంగతిఁ దనకీడు
మాని దుష్టగణము మంచిదగును.

(సులక్షణసారము. 116 పుట)

పై చింతామణిశ్లోకములోని రసశబ్దము నవరసపర్యాయమైనవసంఖ్యను బోధించు ననియు 'పురాస్త్రగిరి రసరుద్రేషు' అనుపాఠమే నన్నయాభిప్రేతమనియుఁ బై సందర్భమును బట్టియూహింపనగును.

ఈపక్షమున 'షోడశవ్యంజనంచాపి షష్ఠస్థానే నయుజ్యతే' అను నథర్వణకారిక, తకారము విషమస్థానములలోనే గాక షష్ఠస్థానమందును దుష్టమేయని పై చింతామణికారికను నవరించుచున్నదని గ్రహింపవలయును. చింతామణిసూత్రము

లోని రసశబ్దము షష్ఠ్యర్థరహ్యాయ మనుతలంపుచేత 'ప్రాణాస్త్ర గిరిరసమద్రేషు' అని యుండఁదగిన చింతామణిసూత్రమును 'ప్రాణాస్త్రరసగిరిమదేషు' అను నాకారమును బొందించి యుందురనియు నట్లే 'ప్రకరరమ్తు గిరిహారస్థానములన్' అని యప్పకవీయు నాంధ్రీకరించుట సంభవించెననియు నూహింప వలసియున్నది.

ఈ యిరువురి యిట్టి నాయూహ యసంగతమేయని విమర్శకులంగీకరించునప్పుడు 'అకచటతపానింద్యాః' అను ప్రకార ఘటితపాఠము నన్నయాభిప్రేతమని సిద్ధాంతితము కాఁగలదు.

బాలసరస్వతీయ చింతామణికిని నప్పకవీయ చింతామణికిని గల పాఠభేదములు మఱికొన్ని యీ క్రింద విమర్శింపఁబడుచున్నది.

39\. శ్లో. "ఆద్యాయాః పంచాశద్వర్ణాః ప్రకృతేస్తు తే దశోనాః స్యుః,
షట్త్రింశదత్ర తేఽన్యే చానుప్రవిశంతి శబ్దయోగవశాత్."

శ్లో. "ఇత్యాదిభాదిమదేదోతో ఒచో వక్రతమావనుస్వారా,
కగచజయుంగ టడణతదన పబమయరలవసహాళంతుహల్వర్గః."
(బాలసరస్వతీయ చింతామణి.)

శ్లో. "ఆద్యాయాః పంచాశద్వర్ణాః ప్రకృతేస్తు తే దశోనాః స్యుః,
సప్తత్రింశదిహాన్యే చానుప్రవిశంతి శబ్దయోగవశాత్.

శ్లో. "ద్వివిధాదిదుదేదోతో ఒచో వక్రతమా వనుస్వారా,
కగచజయుంగ టడణతదన పబమ య రయుంగ లయుంగ వసహాళ్చ
హాలః." (అప్పకవీయచింతామణి.)

పయి పాఠభేదములుగల ద్వివిధపుస్తకములకును సంస్కృతమున వర్ణము లేఁబదియనియుఁ, బ్రాకృతమున వర్ణములు నలువదియనియుఁ జెప్పుటలో భేదము లేదు. ఇఁక నచ్చాంధ్రమునకు వర్ణములు ముప్పదియాఱని బాలసరస్వతీయ చింతామణిపాఠము చెప్పుచుండఁగా ముప్పదియేడు వర్ణములని యప్పకవీయ చింతామణిపాఠము వక్కాణించుచున్నది. రెండుపక్షములలోను నలఘు లకారమున కనఁగా దొడ్డలాకు (ళ) వర్ణసమామ్నాయమునఁ బృథగ్గణన మున్నదనియు, సప్తత్రింశదిత్యాది పాఠపక్షమున నలఘురేఫమునకు నైతము పృథగ్గణనము గలదనియు, షట్త్రింశదిత్యాది పాఠపక్షమున నలఘు రేఫమునకుఁ బృథగ్గణనము లేదనియుఁ బై చింతామణిశ్లోకములకు వ్యాఖ్యలు చేయఁబడియున్నవి.

"షట్త్రింశదత్ర-అత్ర శుద్ధవికృతా షట్త్రింశద్వర్ణానాం వ్యవహారః. రస్త్వత్ర గృహ్యతే ద్వివిధ ఇతి రేఫస్యద్వైవిధ్యకథనేన గురురేఫస్య వర్ణమధ్యే పరిగణనదశాయాం 'సప్తత్రింశ దిహోన్యే' ఇత్యప్పకవి పుస్తకపాఠోఽపి సాధురేవ. తస్య రేఫభేదత్వేన అవర్ణాంతరత్వాదపరిగణనదశాయాం అయం పాఠ ఇతి వివేకః."

(అహోబలపండితీయము. 139 పు.)

కీర్తిశేషులగు పరవస్తు చిన్నయసూరిగారు చింతామణివివరణ మనఁదగు బాలవ్యాకరణమును రచించుటలో

చందలి వస్త్రాంకరీత్యాదిపాఠమునే యంగీకరించి 'తెలుఁగునకు వర్ణములు ముప్పదియాఱు' (సంజ్ఞా. 3 సూ.) అని సూత్రించిరి. ఇదియే నన్నయభట్టాభిప్రేతమనుచు 'యవలఁబలె రేఫంబును ప్రయత్న (లఘ్వలఘు) భేదంబుచే ద్వివిధంబు గాన శబ్దానుశాసనాదులచే నలఘురేఫము వర్ణాంతరముగా గ్రహింపఁబడదయ్యె' అని యిట్లు త్రిలింగ లక్షణశేషమునఁ (సంజ్ఞా. 1 సూ.) కీర్తిశేషులగు బహుజనపల్లి సీతారామాచార్యుల వారిచే వ్రాయఁబడినది. ఈ త్రిలింగలక్షణశేషవాక్యమును బట్టి యలఘులకారముగూడ నచ్చాంధ్రవర్ణసమామ్నాయమున వేఱుగఁ బరిగణింపఁబడలేదనియు, నచ్చాంధ్రవర్ణసమామ్నాయములోని ళకారము వర్ణాంతరమనియు నన్నయభట్టు తలంచెనని విదితమగుచున్నది. ఇట్టి యభిప్రాయమును బాలవ్యాకరణములోని "వర్ణసమామ్నాయమందలి ళకారము వర్ణాంతరముగాని, యలఘు ళకారము గాదని యెఱుంగునది" (సంజ్ఞా. 15 సూ.) అనువాక్యము సైతము స్పష్టపఱచుచున్నది.

పయి బాలవ్యాకరణగర్భాశయములను పరిగ్రహింపఁజాలక బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికాకర్త "...అప్పకవి పుస్తకమందలి పాఠాంతరము పెక్కుఁ గారణములచే సమంజసంబుగ నున్నది. అహోబలపతియు నిది వక్కాణించెను. (అహోబలపతి చింతామణిపాఠముకన్న నప్పకవిపాఠము సమంజసమని చెప్పలేదని యాతఁడు వ్రాసిన, వెనుక నుదాహరించిన పంక్తులవలనఁ బాఠకమహాశయులకు విశదము కాకపోదు.) తక్కిన యనాద్యవర్ణములభాతిని శకటరేఫంబును వర్ణంబు

లలోఁ బృథక్కుగాఁ బరిగణించుట న్యాయ్యము." అని యిట్లు వ్యాఖ్య చేయుట కేవలము సవిమర్శకృతమనుటకు సందియము లేదు. మఱియుఁ బై నుదాహరించినరీతిని వర్ణసమామ్నాయ గత ళకారము వర్ణాంతరమనియు నలఘులకారముకాదనియు బహుత్వమందు దాదేశముగా వచ్చునది మాత్రమే యలఘు లకారమనియు "ఏళులు, పాళులు, త్రాళులని బహుత్వమందు రలడలకాదేశమయిన ళకార మలఘువు...వర్ణసమామ్నాయ మందలి ళకారము వర్ణాంతరముగాని, యలఘుళకారము గాదని యెఱుంగునది" (బాలవ్యాకరణము. సంజ్ఞా. 18 సూ.) అను పంక్తులతో స్పష్టముగా బాలవ్యాకరణము చెప్పు చుండఁగా నాగ్రంథములోనిదే యగు "యవలలు లఘ్వలఘు వులు మైత్రింబొరయు. రేఫంబులు పొరయవు." (బాలవ్యా. ప్రకీర్ణ. 24 సూ.) అను సూత్రమునకు బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశికాకర్త యుదాహరణము లిచ్చుటలో "పలు, రోలం బక" మున్నగువానిలోని లకారములకును, "తళతళ, వళా వళి," మున్నగువానిలోని ళకారములకును యతి ప్రాసమైత్రిని జూపుట వక్త్ర తాత్పర్యావిమర్శనకృతమే యనుటకు సంది యము లేదుగదా! పయివిషయముల నొకప్పుడు వెల్లడింపఁగా నాతఁడట్టి సత్యవిషయము నంగీకరించుటకుఁ బదులుగా స్వవ చన స్థాపనపరత్వమున బాలవ్యాకరణకర్తగారికిఁగూడఁ దనయ భిప్రాయమే యనఁగా వర్ణసమామ్నాయగత ళకార మలఘు లకార మనునభిప్రాయమే గలదనిచెప్పుచు వెనుక నుదాహ రించిన బాలవ్యాకరణవాక్యమున కీక్రిందిరీతి నపార్థమును జేయ సాహసించెను. 'వర్ణసమామ్నాయగత ళకారము, వర్ణాం తరముగాని = వర్ణాంతరము గానట్టి అలఘులకారము కాదు.

ఇఁక నేమన వర్ణాంతర మయినటువంటి యలఘులకారము.” అనుపద్ధతిని వ్రాసెను సూరిగారికే యట్టి యభిప్రాయ మున్న యెడల వెనుక నుదాహరించిన యాసందర్భములో “ఏళులు, పాళులు, త్రాళులని బహుత్వమందు రలడల కాదేశమైన ళకార మలఘువు.” అని ళకారవిశేషమున కలఘుత్వమును వీఁడిపంక్తిలో విశేషించి చెప్పియుండరా? మఱియు నట్లుగ నలఘులకారమునే వర్ణసమామ్నాయములోఁ బరిగణించి యున్న యెడలఁ దుల్యన్యాయమున నలఘు రేఫమునుగూడ వర్ణసమామ్నాయములో వేఱుగఁ బరిగణించి యుండరా? ఇఁక నాసందర్భమున ళకార విశేషమును వర్ణసమామ్నాయ ములోఁ బఠించియుండుటచేత నది యలఘు లకారమని యెవ్వ రేని భ్రమించి తత్సమానన్యాయమున నలఘు రేఫమునుగూడ నేల వర్ణసమామ్నాయమునఁ జేర్పరయిరని గుప్తార్థప్రకా శికాకర్తలవలెనే శంకింతురేమో యని తలఁచియే సూరిగారు లఘ్వలఘు లకారనిరూపణ సందర్భమున వెనుక నుదాహ రించినరీతిని “వర్ణసమామ్నాయగత ళకారము వర్ణాంతరము గాని, యలఘులకారము గాదని యెఱుంగునది” అని యిట్లు వ్రాసిరని యెవ్వరికేని తోఁచకమానదు గదా!

ఇఁక బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణకర్త లచ్చాంధ్ర వర్ణసమామ్నాయగత ళకారము వర్ణాంతరమనియు, నలఘు లకారము కాదనియు, బహువచనమునం దాదేశముగా వచ్చి నది మాత్రమే యలఘులకారమనియు నన్నయాభిప్రాయ వర్ణనము చేయుట సరి యగునా, కాదా? యనువిషయము విమర్శింపవలసి యున్నది. ళకారసామాన్యమెల్ల నలఘు లకా

కమే యైనయెడలఁ దత్సమానన్యాయమున నింకను "నాన్యే
షాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్"
అని యిట్లు రేఫద్వయమునకును బరస్పర వైధర్మ్యము నుద్ఘో
షించుచుండుటచే నంతకన్న నెక్కువ యావశ్యకత్వమున—
నన్నయభట్టారకునిచేత శకటరేఫముగూడ ళకారమువలెనే
వర్ణాంతరముగాఁ బరిగణింపఁబడవలసి యుండును గదా!
అట్లు పరిగణింపని పక్షములోనివగు 'షట్త్రింశదత్ర', 'యరల
వసహాళంతుహల్వర్గః' అను పాఠములు, ళకారసామాన్యము
నలఘువుగా నన్నయభట్టారకుఁడు తలంచి యుండలేదనియు
నచ్చాంధ్ర ళకారమును ద్వివిధముగా నెంచియుండెననియు
నూహించుటకుఁ బ్రబల నిదర్శనములయి యున్నవి. చాలవఱ
కీరీతిని విమర్శించియే సూరిగారు రహోబలపండితాదుల వ్యా
ఖ్యల నుల్లంఘించి నన్నయభట్టారకాభిప్రాయమును నిర్ణయిం
చుకొని యట్లు వ్రాసిరని తోఁచుచున్నది. ఈ సూరిగారిపద్ధతి
యాయనవ్యాకరణమునకు నన్నయాభిప్రాయము సరిపడునట్లు
కల్పింపఁబడినది. కాని వీరి యీయూహ సాకల్యముగ నాంధ్ర
శబ్దచింతామణికి సరిపడదు. అలఘు లకారమును వేఱుగను,
వర్ణసమామ్నాయగత ళకారమును వేఱుగను నన్నయభట్టా
రకుఁడు తలంచెనన్న విషయమునఁ జింతామణి బాలవ్యాకరణ
ములకు భేదములేదు. ఇఁక సూరిగారు వివరించినట్లు 'ఏళులు,
పాళులు, త్రాళులని బహుత్వమునందు ర ల డ ల కాదేశ
మైన ళకార మలఘు' వనెడి విషయముమాత్రము చింతా
మణికి సరిపడదు. నన్నయభట్టారకుఁ డొక్క రేఫమునకు మా
త్రమే 'రోలః' అను సూత్రముచే లకారాదేశమును విధిం

చెను గాని ల డలకు లకారాదేశమును విధించియుండ లేదు. ఇఁక

> "రలయోర్డడయోస్తద్వ ల్లళయోశ్శసయోరపి; వబయోర్నణయో శ్చాంతే, సవిసర్గావిసర్గయోః; సబిందుకాబిందుకయోః స్యాదభేదేనకల్పనమ్" (అహోబ. ౧౩౭ పుట.)

అనునవి మొదలగు కారికలనుబట్టి 'పాడి-పాళ్లు...అంబలి— అంబళ్లు ... ...ల డ ళా నా మభేదాభిధానాత్ రూపమేతత్' (అహో. 33౬ పుట.) అనురీతిని వ్రాయఁబడిన యహోబలపండితీయ గ్రంథముచొప్పున లకారాదేశమును లడలకు నన్నయభట్టు తలంచియుండెననుట యెంతమాత్రమును సరి కాదు. ఇట్టి ప్రక్రియలో నభేద ప్రతిపాదక కారికలనుబట్టి లకారాదేశమును విధించుటయే నన్నయభట్టారకునకు సమ్మతమైనయెడల నట్టి కారికలలో రలలకుఁగూడ నభేదాభిధానముండుటచేత నాతఁడు 'రో లః' అనెడి రేఫమునకు లకారము నాదేశించిన సూత్రమును బునరుక్తముగాఁ జెప్పియుండఁడు గదా! కాఁగా 'ఊరు, ఊరులు, ఊళ్లు, (ఊళ్ళు) కాలు, కాలులు, కాళ్లు' (కాళ్ళు) మున్నగుచోట్ల నొకప్పుడు లఘులకారముగాఁ గాని, వర్ణాంతరముగాఁగానియుండి మఱొకయప్పుడు ళకారోచ్చారణరూపమగుమార్పునొందిన యదిమాత్రమే లకారముపై నొకబొట్టుపెట్టు లిపిగల యలఘు లకారమనియు నెన్నఁడును మార్పులేక యేకరీతిని ళకారోచ్చారణముతో మాత్రమేయుండెడి ళకారము (కూళ) వర్ణాంతరమగు వర్ణసమామ్నాయగత ళకారమనియు నాతఁడు తలంచియుండునని

గ్రహింపనగును. శకారోచ్చారణము గలశబ్దముల కిట్టి వైజా త్యముండుటచేత నాతఁడట్లు ద్వైవిధ్యము నంగీకరించి యుం డుననెడి పైయూహ మఱింత రూఢమూల మగుచున్నది. ఆతని కాలమున 'త్రాడు—త్రాడులు—త్రాడ్లు' అనురూపములే గ్రాం థికతావస్థ నందఁదగి యుండుటచేతను, 'త్రాల్లు'(త్రాళ్ళు) అను రూప మప్పటికింకను గ్రాహ్యము కాకుండుటచేతను డకారమున కాతఁడు లకారాదేశమును విధించి యుండలేదు. త్రాడ్లు మున్నగురూపము లాతనికాలమున వాడుకలో నున్నట్లు శాసనవిమర్శకులకెల్ల విదితమే గదా! పయిసందర్భమునుబట్టి 'షట్త్రింశదత్ర' 'యరలవసహాశంతు హాల్వర్గః' 'దంత్యచజౌగు రురలౌచ బిందుయుతౌ' అనుపాఠములు పరస్పర సంబంధము గలిగి నన్నయాభిప్రేతములని విశ్వసింపఁదగియుండి ప్రామాణి కము లగుచున్నవనిస్పష్టపడుచున్నది గదా!

అప్పకవి పుస్తకముతప్పఁ దక్కిన చింతామణిపుస్తక ములందెల్ల 'షట్త్రింశదత్ర', 'యరలవసహాశమ్' అను పాఠ ములే యగపడుచుండుటచేతను, నప్పకవి పుస్తకపాఠమును గూడ సాధువుగా నంగీకరించిన యహోబలపండితుఁడు సైత ము షట్త్రింశదిత్యాదిపాఠమునే మూలముగా గ్రహించుట చేతను షట్త్రింశదిత్యాదిపాఠమే ప్రామాణికమనుట యుక్త ముగా నుండునుగదా! మఱియు నిర్బాధముగ నగపడు చున్న సప్తత్రింశదిత్యాదిపాఠము నుపేక్షించి శకారము నకు ద్వైవిధ్యమును గల్పించినం గాని కుదురుపడకున్నట్టి షట్త్రింశ దిత్యాదిపాఠము నెవ్వరును గల్పించి యుండరను టకు సందేహ ముండదుగదా! శకార ద్వైవిధ్య కల్పనా

రూపమగు నావశ్యకత యుండుటచేతనే యట్టి ద్వైవిధ్య మును గల్పించుకొనుటూహ స్థూలదృష్టిని బోడమని కారణ మునఁ గావలయు షట్త్రింశ దిత్యాదిపాఠము నుపేక్షించి యప్పకవిగాని యంతకుఁ బూర్వు లెవ్వరైనంగాని నిర్బాధ ముగ నగపడెడి 'సప్తత్రింశ' దిత్యాదిపాఠమును గల్పించి యుండవచ్చు ననుట యెంతయు సంభావ్యమై యున్నదిగదా!

ఈరీతిని ళకార ద్వైవిధ్యమును, షట్త్రింశ దిత్యాది పాఠముచేత నన్నయాభిప్రేతముగా నూహించుటయే కాక యాతఁడు చింతామణిలోఁ జెప్పిన యాంధ్రలిప్యుద్ధారకకారి కలలోని 'దంత్యచజౌగురురలౌచ బిందుయుతౌ' అనుదాని చేత నట్టియూహను సిద్ధాంతము చేయుటయు మిక్కిలి యుక్త మైయున్నది. ర ల ళ లఘ్వలఘూచ్చారణభేదము నన్నయ కాలమున స్పష్టముగ వాడుకలో నుండుటం జేసి యట్టివిభేద మును లిపితో గుఱితించుటకయి లఘు ర ల ళ పై నొకబొట్టు పెట్టి వానిని నలఘు ర ల ళ కు గుఱుతుగ నెన్నవలెనని పై కారిక కర్థమును గ్రహింపనగును. కాఁగా నట్టిగురు ర ల ళ లను లఘు ర ల ళ సంబంధులనుగా నంగీకరించి 'య ర ల వ సహాళంతు హాల్వర్గః' అని ప్రత్యేకముగ నొక్క ళకా రమునుమాత్రము వర్ణసమామ్నాయమున మరల రేఫసా మ్యమునకు విలక్షణముగాఁ బేర్కొనుటచేత నన్నయభట్టా రకుఁ డలఘులకారముకన్న వర్ణసమామ్నాయగత ళకార మును విభిన్నముగ నంగీకరించెనని నిర్ణయించుటకు సందేహ ముండదు గదా!

వర్ణసమామ్నాయగత ళకారమునకును, నలఘులకారమునకును నుచ్చారణమునం దంతగా భేద మగపడకున్నను వాని చరిత్రములు విభిన్నములగుటచేత వర్ణసమామ్నాయమున ళకారము వేఱుగఁ బరిగణింపఁబడెననియు నాకారణముచేతనే యట్టిభేదము పాటింపఁబడక యలఘులకారము గూడ ళకారలిపితోనే వ్రాయఁబడువాడుక తటస్థించెననియు గ్రహింపవలసి యున్నది. సూక్ష్మదృష్టితోఁ బరిశీలించునపుడు మాత్రము తత్త్వజ్ఞుల యుచ్చారణమునందు వర్ణసమామ్నాయగత ళకారాపేక్షచే నలఘులకారముయొక్క యుచ్చారణమునం దించుకభేదము భాసిల్లకపోదని విమర్శకు లెన్నుదురుగాక. పై రీతినే యలఘురేఫమునుగూడ లఘురేఫము తలపై బొట్టుంచెడిగుఱుతుతో వ్రాయక 'ఱ' అను నాంధ్ర కర్ణాటసామాన్యలిపితో వ్రాయుటయే వాడుకయై యున్నది.

ఆంధ్రలిప్యుద్ధారకశ్లోకములయర్థమును గ్రహింపఁజాలమిచే వానికిఁ డీక వ్రాయక బాలసరస్వతి విడుచుటచేత నవి బాలసరస్వతీయచింతామణిలో లోపించినను నప్పకవీయచింతామణిలో నవి నిల్చియుండుటచేతను, బ్రాచీనలేఖనపద్ధతికవి సరిపడియుండుటచేఁ బ్రాచీనలిపి స్వరూపము నెఱుంగని తరువాతివారు ప్రక్షిప్తము చేసిరనుట యసంభావ్యమగుటచేతను, బాలసరస్వత్యప్పకవులకంటె నతిప్రాచీనుఁ డగునథర్వణుఁ డట్టి చింతామణిలిపి ననువదించి సవరించియుండుటచేతను నవి ప్రక్షిప్తములు కావనుటకు సందేహము లేదు. ఈ విషయ మీావలకు విపులముగాఁ జర్చించియున్నాను.

యవల లఘ్వలఘుధ్వనులకుఁ బ్రత్యేకముగ వర్ణ సమామ్నాయమునఁ బరిగణనము లేనట్లే ర ల ల లఘ్వలఘు ధ్వనులకును బ్రత్యేకపరిగణనము లేకుండుట సంస్కృతవ్యాక రణ మార్గసమ్మతమును యుక్తిసహమును నగుటంజేసియు, నట్లు లఘ్వలఘు యవల భేదములకుఁ బ్రత్యేక పరిగణనము చేయనట్లే ర ల ల లఘ్వలఘుధ్వనులకును నన్నయభట్టార కుఁడు ప్రత్యేక పరిగణనము చేయలేదని చెప్పుటయే న్యాయ్యమగుటం జేసియు, ర ల ల లఘ్వలఘుధ్వనులకుఁ బ్రత్యేక పరిగణనమును జేయనిపక్షములోనివగు 'షట్త్రింశ దత్ర', 'య ర ల వ సహాళమ్' అను పాఠములే నన్నయభట్టా రక ప్రోక్తములనియుఁ దద్విలక్షణములగు 'సప్తత్రింశదిహ', 'యరయుగలయుగ ...' అను పాఠములు నన్నయప్రోక్త ములు కావనియు విమర్శకు లగువిద్వాంసులు గ్రహిం తురు గాక!

40. A. "అద్యశ్చ క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగంవినా సర్వః."
(బాలసరస్వతీయచింతామణి.)

B. "అద్యశ్చ క్రియాసు భూతాద్యర్థసముద్ద్యోతినం వినాసర్వః."
(అప్పకవీయచింతామణి.)

A. 'పోయెన్, చనియెన్' మున్నగు భూతార్థక క్రియ లును, 'రామెవరు' మున్నగు పదాదిస్థలములును దప్పఁ దక్కిన యన్నిచోటులందలి యకారమును "అకార" వంతమయి యుండునని బాలసరస్వతీయపాఠమున కర్థము.

"క్రియాసు = క్రియలయందు, భూతార్థద్యోతితమ్ (నమ్?) = భూతార్థములఁ గనుపించునదియు, ఆద్యగమ్= నామాది నుండునదియు, వినా=కాక తక్కిన, సర్వః=సమస్తమైన, యః=యకారము, అత్=అకారము (అనఁగా తలకట్టు నుట. 'చనియె వినియె' నివి మొదలగు క్రియాభూతార్థస్థిత యకారములు 'యెలమి, యేమి, యేలాగు, యెచటికి, యెంత' యివి మొదలగు నామాది యకారములును దప్ప మిగిలిన యకారములన్నియుఁ దలకట్టుగాఁ దెలియునది" (బాలసరస్వతీయ టీక.)

B. "పోయెన్, చనియెన్" మొదలగు భూతార్థకాది క్రియలు తప్ప నంతటను నున్న యకారము 'అకారవంతమై' యుండునని యప్పకవీయపాఠమున కర్థము. 'పోయెదన్, పోయెడి' మున్నగునవి సూత్రములోని యాదిశబ్దముచే గ్రహింపఁదగినవై యున్నవి.

సీ. "ఆంధ్రోక్తి మొదల నాద్యంతస్థస్ఫ్రముండదు
ప్రాణమై యది గనుపట్టుఁగాని
నడుగుల నడుమను గడను యా కొందును
దలకట్టు దక్క నెత్వంబు లేదు
యాను భూతాది క్రియాద్యోతితములఁ జూ
పట్టు నెత్వము దలకట్టు గాదు......"

(అప్పకవీయము. 2 ఆ. 197 ప.)

'పదాదినీయత్షరము లుండును. ఈయత్షరములుండవు' అనురీతిని దమిళవ్యాకరణములలోవలెఁ దన వ్యాకరణమున

నన్నయభట్టు చెప్పఁదలఁచి యుండ లేదు. సంస్కృతశబ్దములను తెనుఁగులోనికిఁ దెచ్చికొనెడి పద్ధతులను జూపుటమాత్రమే ప్రధానముగఁ జేసికొని చింతామణిని రచించుచు నందచ్చాంధ్ర విషయమున వ్రాతఁ దేవో కొన్ని బహుస్థలోపయోగి సామాన్య విషయములను, సందేహనిర్ణాయకవిషయములను మాత్రమే సూత్రించుచు వచ్చెను. అందుఁ బ్రకృతసూత్ర మొకసందేహ మును దీర్చువిషయమున నుపదేశింపఁబడినది. యకారముపై నుండు 'ఎత్వము' వ్యవహారమున 'అత్వముగా' మాఱు చుండును. కావుననే "మానిపోయను, ఆయలే, యాభై" మున్నగునవి వ్యవహారములోఁ బ్రచురములై వెలయుచున్నవి. ఇట్టి మార్పునుబట్టి యకారముపై "అత్వైత్వములలో" నేది నిల్చియున్నను నది "అత్వమా?" లేక "ఎత్వమా?" అను సందేహము పొడముచునే యుండును. కావుననే నన్నయ భట్టారకుఁ డట్టిసందేహమును దీర్చుటకయి పైసూత్రమును రచించియున్నాఁడు. అట్లు సూత్రించు సందర్భములోఁ బ్రా సంగికముగాఁ బదాదియకారస్థిత్వంగీకారము సూచితమయ్యె నేగాని పదాదిని యకారమున్నదనిగాని లేదనిగాని చెప్పుట యును, నది యెచ్చటెచ్చట నున్నపు డేయేస్వరములతోఁ గూడుకొనియుండునో యావిషయమును జెప్పుటయు గ్రంథ కృదుద్దేశములు గావు. అట్టి యుద్దేశములతోనే గ్రంథకర్త యున్నాఁడని యంగీకరించునెడల "చెయిది, చెయువులు, చేయి, చేయుట" మున్నగు చోటులందలి యకారముపై నిత్వోత్వాదులు నిల్చియుండుట దుష్టమనవలసివచ్చును గదా!

అప్పకవీయపాఠములో బాలసరస్వతీయపాఠమునఁ గల పదాది యకారస్థితి సూచనము తప్పిపోయినది. ఇంతియ గాక యప్పకవీయమునఁ బదాదిని యకారాదు లుండవని ప్రత్యేకముగఁ జెప్పఁబడిన సూత్రముల పాఠవిశేషములును గలవు.

"వికృతిపదాదౌ ప్రక్రమాంతస్థ స్తృతీయానునాసికా నస్తః....
క్వచిదపి నస్త ఉదోతౌ దంతోష్ఠభవస్య వికృతిశబ్దాదౌ."
(అప్పకవీయచింతామణి, 2 ఆ. 221.)

ఈయప్పకవీయ పాఠపక్షమున "అద్యాః క్రియా" స్విత్యాదిసూత్రములోఁ బ్రతిషిద్ధముల కియత్తానిర్ణయము తోఁచకుండునట్లుగ నాదిశబ్దమును నిల్పి సూత్రశేషమున సర్వ శబ్దమును బ్రయోగించుట యర్థవ్యక్తి విదూరమై యున్నది. న్యాయ్యముగా నిచటఁ గ్రియలలోని భూతార్థకములును, దద్ధర్మార్థకములును దప్పఁ దక్కినవోట్లనెల్ల యకార మకార వంతమై యుండునని వాక్యరచనము చేయవలసి యుండును. కాఁగా గ్రంథకర్త కిట్టి యభిప్రాయమును జెప్పుతలంపు లేద నియు, నతడు

"అద్యాః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగంవినాసర్వః."

అనెడి యర్థవ్యక్తి భూషిత బాలసరస్వతీయ పాఠవాక్యమునే రచించి యుండఁగాఁ బ్రతీక్షపాఠకర్తలందుఁ దద్ధర్మార్థకముల ప్రతిషేధమును జొనుపుటకును, బదాదియకారాంగీకార మును ద్రోసిపుచ్చుటకును యత్నించి ఛందః ప్రతిబంధమున

'ఆప' శబ్దమునుపోలె 'అవ్యగ' శబ్దమును వ్రాసి పయిరీతిని పరిపుచ్చికొనిరా యనియు నాలోచింపవలసి యున్నది.

మఱియుఁ బదాది యకారాంగీకారముగల బాలసరస్వతీయపాఠము నంగీకరించునప్పుడే చింతామణి సంధిప్రకరణములోని "సర్వత్రాప్యాత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః" అను సూత్రము సుసంగతము కాఁగలదు. పదాదిని యకారమే లేనపుడు సంధివేళలోనది లోపించి స్వరశేషమగు నను నర్థముగల పైనివ్రాసిన 'సర్వత్రాప్య' దిత్యాదిసూత్రమునకుఁ బ్రసక్తియే యుండదుగదా! అహోబలపండితుఁ డిట్టి విరోధమును గనిపెట్టియే యప్పకవీయమాతృకలో 'సర్వత్రాప్య' దిత్యాదిసూత్రము లేనే లేదని వ్రాసి యున్నాఁడు. ఇంతియ కాక "వ్రాయు, వోడ మొదలగు వానిలోని వకారము వలెనే 'యెప్పుడు, యేఁబది' మున్నగు వానిలో సైతము యకార ముచ్చారణసౌకర్యార్థక మగుచు వ్యవహారమునఁ బ్రవేశించినంతమాత్రమున దానిని సత్యమనియు,సహజమనియు నంగీకరింపనేల? మరల సంధివేళలలో దానికి లోపమును విధించుకొన నేల? అచ్చట స్వరమే యున్నదనియుఁ, దక్కిన స్వరాదిపదములకువలెనే (తండ్రి+అతఁడు=తండ్రియతఁడు) దీనికి సంధ్యభావస్థలమున సంహితయందు యకారము నిల్చుననియుఁ బ్రక్రియాలాఘవముగ సూత్రించుట యుక్తముకాదా?" అని యిట్లు స్థూలదృష్టిని విమర్శించి యహోబలపండితుఁ డీ క్రిందిరీతిని వ్రాసియున్నాఁడు.

"అప్పకవి పుస్తకేతు 'అద్యక్రియాసు భూతాద్యర్థసముద్ద్యోతినం వినా సర్వః' ఇతి పాఠస్థ్సితః, ఆదిశబ్దేన 'పోయెదన్, చనియెదన్'

ఇత్యాదా వేత్వంసిద్ధమ్. పూర్వపాఠే త్వేతన్న గృహ్యతే. కల్పనా గౌరవ మతీవాపాద్యతే. నచోచ్చారణలాఘవ మేవ తస్య ప్రయోజనమ్, తదర్థం కల్పనాగౌరవ మంగీకార్య మితి వాచ్యమ్. తదభావేఽపి బాధకాభావేన, తదపేక్ష యాతికల్పనాగౌరవ స్యానుచితత్వాత్. 'ఆద్యవర్ణాస్తు హ్రస్వేన న గృహ్యంతే కదాపి చేత్యథర్వణాచార్యస్య స్వసిద్ధాంతవచనాచ్చ. తస్మా దప్పకవిపుస్తకపాఠ ఏవ సాధు రితి ప్రతిభాతి. సర్వత్రాజ్వత్కార్య మితిసూత్రంతు తత్పుస్తకే న దృశ్యత ఏవ. తేన 'ఎవ్వఁడు' ఇత్యాదౌ యత్వమాదౌ న పండిత హృదయంగమమ్ కించ 'వికృతిపదాదౌ ప్రథమాంతస్థ్సకృతీయానునాసికౌ నస్తః, క్వచిదపినస్త ఉదోతౌ దంతోష్ఠభవస్య వికృతి శబ్దాదౌ' ఇతి చ తత్పుస్తకే స్థితమ్."

(అహో. 155, 156 పుటలు.)

ఈ సందర్భములోని యహోబలపతివ్యాఖ్య మిక్కిలి ప్రామాదికమై యున్నది. సర్వత్రాజ్వదిత్యాదిసూత్ర మిప్పటి యప్పకవీయమాతృక లన్నిటిలోను "అరయ వైకృతోక్తులఁ బదాదులయందు యకారముండదా, తీరున..." (అప్పకవీయము. 5 ఆశ్వా. 40 ప.) అనునది మొదలగు వివరణపద్యములతోఁగూడ నగపడుచున్నది. అహోబలపతి వీనిని సరిగాఁ జూచుకొనకయే పైరీతిని వ్రాసెనో లేక యహోబలపండితునకు దొరకిన యప్పకవీయమాతృకలో నావఱకే యహోబల పండితునివలెనే విరోధమును బరిశీలించినవా రెవ్వరేని యా సర్వత్రాజ్వదిత్యాదిసూత్రమును "అరయ వైకృతోక్తుల..." మున్నగు వివరణపద్యములను దీసివేసియుండిరో తెలియరాకున్నది. కాని సర్వత్రాజ్వదిత్యాదికారిక యథర్వణునినాఁటికే

చింతామణిలోఁ జేరియున్న దనక తీరదు. చింతామణిలో నిట్లు సర్వత్రాజ్వ ఇత్యాదికారిక యే యథర్వణుని నాఁటికి లేని యెడల నద్దానిని సవరించుచున్న "వికృత్యాదిగతో యోత్రే" త్యాదికారిక వికృతివివేకములో నుండియుండదు గదా! ఆసవరణ మిచటఁ జూపుచున్నాను. చింతామణిలోని "సర్వత్రాజ్వ" ఇత్యాది శ్లోకములో "సర్వత్రాజ్వత్తాఽర్థ్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః" అనుభాగము నొకసూత్రముగ విభాగించి ద్రుతప్రకృతికములకుఁ బరమైన పదాది యకారము లోపించి స్వరము మిగులుననియు, నాస్వరము పూర్వస్థిత ద్రుతముపై నిల్చుననియు దానికర్థము చేసికొని యాపక్షమున ద్రుతప్రకృతికేతరముల కనఁగాఁ (ముఖ్యముగా నుదంత) గళలకుఁ బరమగునప్పు డజ్వద్భావము చెప్పఁబడకుండుటచేత "అతఁ డెప్పుడు" మున్నగు సాధుసంధిరూపములు సిద్ధింపక "అతఁడు యెప్పుడు" మున్నగు నసాధుసంధిరూపములు నిల్చిపోవలసివచ్చునని శంకించుకొని యథర్వణాచార్యుఁడద్దానికి సవరణముగా "వికృత్యాదిగతో యోత్రేతి"కారికను రచించి యున్నాఁడు. ఇయ్యది యచ్ఛాంధ్రపదాదినున్న యకారము ద్రుతప్రకృతికములతో నేగాక యేశబ్దముతో (శబ్దాంతరయోగతః) సంధించినను యకారము లోపించి దానిపై నున్న స్వరము శేషించునని చెప్పుటచేత "అతఁడెప్పుడు" మున్నగు సాధుసంధిరూపములు సిద్ధించుచున్నవి. అట్లే "అతఁడు యెప్పుడు" మున్నగు నసాధుసంధిరూపములు నివారితము లగుచున్నవి.

పయి సందర్భమునుబట్టి "వికృత్యాది గతో యోత్రే" త్యాదికమగు నథర్వణసూత్రముచే సవరింపఁబడుచున్న

"సర్వత్రాజ్వాత్కార్య" మిత్యాది చింతామణిసూత్ర మథ ర్వణాచార్యుని నాటికే యాంధ్రశబ్దచింతామణిలో నుండి యుండెడిదనియు ("వికృత్యాదిగతో యోత్రే" త్యాద్యథర్వణ కారికార్థ మొకప్పు డహోబలపతి యనుకొన్నట్లు శ్రీకవిమతమే యైనను దాని నంగీకరించి యథర్వణుఁడు వికృతివివేకమున నుదాహరించుటచేత నాతని కాలముననే 'సర్వత్రాజ్వ'దిత్యాది సూత్రము చింతామణిలో నుండియుండెడి దనుటకు సందియము లేదు.) నట్లు పదాది యకారాంగీకారమును బోధించెడి యా"సర్వత్రాజ్వ"దిత్యాదిసూత్రము చింతామణిలోనిదని నిశ్చిత మగుటంబట్టి యందలి సంజ్ఞాపరిచ్ఛేదములోని "ఆద్య గంవినా సర్వః" అనెడి పదాది యకారాంగీకారబోధక బాల సరస్వతీయ చింతామణిపాఠమే నన్నయభట్ట ప్రోక్తమని నిర్ణీత మగుచున్నదనియు, నక్కారణమున నప్పకవీయ చింతామణి పాఠములు (పదాదియకారనిషేధకములు) ప్రక్షిప్తము లను టకు సందేహము లేదనియు సిద్ధాంతిత మగుచున్నది.

మఱియు నహోబలపండితుఁడు

"ఆద్యవర్ణాస్తుహ త్త్వేన న గృహ్యంతే కదాచిచ"

అను నథర్వణకారికకుఁ బదాదిని యకారముండనేరదని చేసిన యర్థము సరికాదని చెప్పక తీరకున్నది. ఈ యథర్వణకారిక కిట్టియర్థమును జేసియు నహోబలపతి "వికృతిపదా దా"విత్యా దికమగు నప్పకవీయపాఠములకు సాధుత్వము నెట్లంగీకరిం చెనో తెలియకున్నది. చింతామణిలోనే యట్లు పదాదియకార ణకార నిషేధము వెలయుచున్నయెడల దానికిఁ బరిశిష్టగ్రంథ మగు వికృతి వివేకమున "వికృత్యాదౌ భవేన్నణః" అనియు

“అద్యవక్త్రాస్తు మాత్రైవ న గృహ్యంతే కదాపిచ” అనియుఁ బునరుక్తముగ మరల సూత్రింపఁబడియుండవు గదా!

“అద్యవక్త్రాస్త్రి” త్యాదిసూత్రమున నహోబలపతి చేసికొన్న యర్థము పై రీతి నప్పకవీయపాఠమునకు విరుద్ధమై యుండుటయేగాక బాలసరస్వతీయ చింతామణిపాఠమునకును విరుద్ధమే యగుచున్నది. బాలసరస్వతీయ చింతామణిపాఠముచొప్పునఁ బదాదియకారము నంగీకరించుచు నాపాఠమును ననరించుచున్న యథర్వణుఁడు తద్విరుద్ధముగను, విక్రుత్యాదిగతోయోత్రే త్యాదిస్వవచనమునకు వ్యాఘాతముగను బదాదిని యకారమే యుండదను నర్థముగల ‘అద్యవక్త్రాస్త్రి’ త్యాదిసూత్రమును రచించియుండఁడుగదా!

అహోబలపతి యిట్టి విరోధమును గ్రహించియే కావలయును. చింతామణిలోని పదాదియకారాంగీకార సూత్రమును ననరించెడి ‘విక్రుత్యాదిగతోయోత్రే’ త్యాదికారిక నథర్వణుండు శ్రీకవియను వేఱొకపండితుని మతముగా నుపదేశించెననియు, ‘అద్యవక్త్రాస్త్రి’ త్యాది సూత్రమును స్వసిద్ధాంతముగా నుపదేశించెననియు సాంగత్యమును గల్పింప యత్నించెనని వెనుక నుదాహరించిన యహోబలపండితీయగ్రంథములోని ‘స్వసిద్ధాంతవచనాచ్చ’ అను (40 పేరా) వాక్యమువల్ల విశదమగుచున్నది. కాని ‘విక్రుత్యాదిగతోయోత్రే’ త్యాది కారికయొక్కయు, ‘అద్యవక్త్రా’ స్త్రీత్యాదికారికయొక్కయుఁ బ్రణాళినిబట్టిమాత్ర మవి యేకవిషయప్రతిపాదకములుగ నున్నట్లగపడలేదు.

ఇంక నవి కేవలము విభిన్నవిషయకములనియే యెవ్వరి కేని తోఁచకమానదు. 'వికృత్యాదిగతోయాత్రే' త్యాద్యథర్వణకారిక 'సర్వత్రాజ్వాదే'త్యాది చింతామణి సంధిసూత్రమునకు సవరణమగుచు నద్దానిని సంబంధించుచున్నది. శ్రీకవియను నాతఁడాంధ్రపండితుఁడుగఁ బ్రసిద్ధియగపడదు. మఱియు నట్టివాఁడథర్వణునివలెనే చింతామణిని సవరించు గ్రంథమును రచించెననుట బొత్తిగ నిరాధారమైయున్నది. కాఁగా నందలి శ్రీకవిశబ్దము మహాకవి పర్యాయముగఁగాని నన్నయభట్ట పర్యాయముగఁగాని యథర్వణునిచేఁ బ్రయోగింపఁబడెనని గ్రహించుట యుక్తమైయున్నది. మఱియు వికృత్యాదీత్యాది సూత్రము పదాదినున్న యకారము సంధిలో నిల్చునా? లోపించునా? యను రెండుపక్షములలోను నొకపక్షమును ననఁగా లోపించు ననుపక్షమును బోధించుచున్నది. ఆద్యవర్ణాస్త్రీత్యాది కారికయన్ననో పదాదిస్వరము యకారవిశిష్టమగునా కాదా? యను రెండుపక్షములలో నొకపక్షము ననఁగా కాదన్న పక్షమును బోధించుచున్నదని గదా యహోబలపండితుని యర్థముయొక్క సారాంశము. ఇట్టిస్థితిలో నీ రెండును బక్షద్వయ బోధకములని యహోబలపతివంటివాఁడెట్లుతలంచెనో తెలియరాకున్నది. ఈ రెండును బైరీతిని విభిన్నవిషయకము లగుటచేతనే వికృత్యాదీత్యాదికారిక చింతామణి సంధి ప్రకరణములోని 'సర్వత్రాజ్వాది'త్యాదిసూత్రమునకు సవరణమైయుండఁగా 'ఆద్యవర్ణాస్త్రీ'త్యాదిసూత్రము చింతామణి సంజ్ఞాప్రకరణములోని 'ఆద్యః క్రియాస్వి'త్యాది సూత్రమునకు సవరణమై యున్నది.

యకారముపై నిల్చునపుడు 'అత్వము'ను 'ఎత్వము'ను సందిగ్ధప్రాయములై పరస్పరము మాఱిపోవుచుండుటచే నట్టి సందేహమును దీర్చుటకై 'అద్యః క్రియాస్వి'త్యాదిసూత్రము చింతామణి కర్తచే నుపదేశింపఁబడినది. కావున నద్దానిని సవరించు నథర్వణకారికలుగూడ నట్టిస్థితిలోనే యుండి తీరవలయునుగదా! 'అద్యః క్రియాస్వి'త్యాది చింతామణిసూత్రమున కీక్రిందిసూత్రములు సవరణములుగా నథర్వణునిచే నుపదేశింపఁబడి యున్నవి.

శ్లో. "భావిక్రియాసు యస్య స్యాదేత్వమేవ ప్రయోగతః
మధ్యాదివర్ణే భూతార్థే చాపి తద్వద్భవేత్సదా,
దోలాభూషాస్త్రరీయాణి వినైత్వం నాస్తి మధ్యమే
ఆద్యవర్ణాస్తు మాత్త్వేన న గృహ్యంతే కదాచిచ."
(అథర్వణకారికావళి. 23, 24 శ్లో.)

"అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః"

అను చింతామణిసూత్రమునఁ బదాదియకారమును, భూతార్థకక్రియల యకారమును దప్పఁ దక్కిన యెల్లయకారములును 'అకార' విశిష్టములై యుండునని చెప్పఁబడియున్నది. చింతామణిలో 'ఎద, ఎడి, ఎడు' అనునవి చెప్పఁబడి యుండనందునఁ గావలయును, బ్రతిషిద్ధములలోఁ జింతామణికర్త వానిని జేర్కొనలేదు. మఱియు వానిని జెప్పవలసివచ్చునపుడు 'యొద,యొడి,యొడు' అనియే చెప్పవచ్చునుగాన వానిని బ్రతిషిద్ధములలోఁ జేర్పనేల యని యాతఁడు తలఁచియుండునని యూహింపనగును. అథర్వణాచార్యుఁడు చింతామణిని సవరించు

సందర్భమున వానిని స్వరాదులుగనే యుపదేశించి యుండుట చేతఁ బ్రతిషిద్ధములలో భూతార్థకములతో పాటు వానిని నైతముచేర్చుట యావశ్యక మగుటచే 'భావిక్రియాసు...సదా' అను కారిక నుపదేశించి యున్నాఁడు. ఇఁకఁ గ్రియాపదములు తప్పఁ దక్కిన శబ్దములలోఁ బదమధ్యమందును, బదాదియందునుమాత్రమే 'అత్త్వైత్త్వ' విశిష్ట యకారములు కనఁబడుచుండుటచేత వానివిషయమునఁగూడ సందేహమును దీర్చుట యావశ్యక మని తలఁచి యథర్వణుఁడు తక్కిన 'డోలాభూషే' త్యాదిసూత్రమును, 'ఆద్యవర్ణాస్త్వి' త్యాదిసూత్రమును నుపదేశించి యుండెను. అందుఁ బదమధ్యమున 'ఉయ్యెల, పయ్యెద, తాయెతు' అను చోటులు దప్ప నెచ్చటను యకారముపై 'ఎత్వము నిలువనేర'దని డోలాభూషేత్యాదిసూత్రము సందేహనివృత్తిని జేయుచున్నది. ఇఁకఁ బదాదియందలి యకార మెన్నఁడును 'అత్వ' విశిష్టము కానేరదని మూలభూత చింతామణిసూత్రములోని 'ఆద్యగం వినే'త్యాదివాక్యముచేతనే విశదమగుచున్నది. అట్లయినను 'తండ్రి యతఁడు' మున్నగుచోట్లఁ బదాదినత్వవిశిష్ట యకార మగపడుచుండుటచేత వట్టియెడల వినంబడు యకారము సంహితలో నుచ్చారణ సౌకర్యార్థము వచ్చి పదచ్ఛేద కాలమున నంతరించునదే గావున దానిని బ్రత్యేకముగా వాడునపుడు ప్రాణిగా ననఁగా హల్లుగాఁ బరిగణింపరాదనియు, 'అకార' స్వరముగనే దానిని బరిగణింపవలెననియు 'ఆద్యవర్ణాస్త్వ' త్యాదిసూత్రముచే నథర్వణుఁ డుపదేశించి యున్నాఁడు. 'ఆద్యవర్ణాస్తు = (ఆది + అవర్ణాస్తు) పదా

డిని పినఁబడు 'అతఁడు' మున్నగువానిలోని 'అ' వర్ణము లన్నవో, 'హల్త్వేన=హల్విశిష్టములుగా, కదాపిచ=ఎన్నఁడును, న గృహ్యాంతే=గ్రహింపఁబడవు' అని యాసూత్రమున కర్థ మును గ్రహింపవలయును. అట్లు వాక్యాది మున్నగుచోట్లఁ బ్రత్యేకముగా వాడఁబడనపుడనఁగా సంహితలో నిల్చునపు డట్టి పదాదినున్న 'అ' కారమునైతను హల్త్వముతోనే యనఁగా యకార విశిష్టముగనే పరిగణింపఁబడుట 'ఆయతి వసుశోభనాకృతి' (ఆయతి+వసుశోభనాకృతి; ఆ+అతివ+ సుశోభనాకృతి)మున్నగుచోట్ల నగపడుచుండుటచేతఁ బై రీతిని జెప్పవలసిన ప్రసక్తి గలిగెనని గ్రహింపవలెను. ఇట్టియభిప్రా యమునే

> "ప్రాణా త్ప్రాణోలఘుర్యస్స్యాత్స్వహల్త్వచ్చ క్వచిద్భవేత్,
> చేద్యత్వం తస్య కల్ప్యం స్యాత్."

అనెడి యనంతరకారికచే నథర్వణాచార్యుఁడు విశదీకరించి యున్నాఁడు. పైరీతి నున్న యాసందర్భములోని కారికాద్వ యమునకును గల సాంగత్యమును బరిశీలించునపు డహోబల పండితుని యర్థ మసంగతమని విమర్శకులకుఁ దోఁచక మాన దుగదా! మఱియు నీరీతి నర్థముచేయునపుడే యాకారిక బాలసరస్వతీయ చింతామణిపాతమునకైన సంగతమగుచుఁ జింతామణితో నదుకుకొనఁగలదని గ్రహింపవలెను.

పై సందర్భమునుబట్టి పదాది యకారాంగీకారమును ద్రోసి పుచ్చెడి 'అద్యాః క్రియాసు భూతాద్యర్థ సముద్ద్యోతినం వినా సర్వాః' అనునట్టియు, 'వికృతిపదాదౌ ప్రథమాంతస్థ

తృతీయానునాసికా న స్తః' అనునట్టియు నప్పకవీయ చింతా మణిపాఠములు ప్రక్షిప్తములనియు, నవి యథర్వణాచా ర్యునినాఁటికిఁ జింతామణి నెక్కియుండ లేదనియు, నర్వాచీన ముగ నవి ప్రక్షిప్తములై యుండెననియు విశదమగుచున్నది.

వెనుక నుదాహరించిన రీతిని 'సర్వత్రాజ్వత్యాకార్య' మిత్యాదికారిక చింతామణిలో నుండుట నారసియు నప్పకవి యద్దానిని దోసివేయక పదాదిని యకారము లేదని చెప్పు చున్న 'వికృతిపదాదా' విత్యాదికారికకు విరోధము కలుగ కుండునట్లు పదాదిని యకారము లేదనుట గ్రాంథికభాషా విషయమనియు, 'సర్వత్రాజ్వది'త్యాదిసూత్రము వ్యవహార మునఁ బదాదినగపడుచున్న యకారము సంధికాలమున గ్రాం థికభాషలో లోపించునని చెప్పుచున్నదనియు, నిట్లు వేఱొక రీతిని వ్యాఖ్యానముచేసియున్న ట్లగపడుచున్నది. ఇంతియ గాక 'యెవరు' మున్నగుచోట్ల వ్యవహారమున యకారము వినఁబడుచున్నట్లె వూరు మొదలగుచోట్ల వకారము నైతము పదాదిని వ్యవహారమున వినఁబడుచున్నను నట్టి యకార వకా రములు గ్రాంథికభాషలో నంగీకరింపఁబడకుండుటచేతనే 'వికృతిపదాదౌ ప్రథమాంతస్థ్య తృతీయానునాసికా న స్తః క్వచిదపి న స్త ఉదోతౌదంతోష్ఠభవస్యవికృతి శబ్దాదౌ' అను సూత్రములు చింతామణిలో వెలయుచున్నవని యిట్లు 'సర్వ త్రాజ్వ'దిత్యాదిసూత్రమునకును, 'వికృతిపదాదా' విత్యాది సూత్రములకును సాంగత్యమును జూపినట్లుగ నాతని యీ క్రింది యాంధ్రీకరణధోరణివలన విశదమగుచున్నది.

ఉ. "ఆకయ వైకృతోక్తులఁ బిహాదులయందు యకార ముండ దా
టీరునఁ బల్కు వ్రాఁత గణింపఁగ నచ్చుగదాని దాపలన్
సిరిజనాథ నాంతములు నిల్చిన నచ్చుటఁ బ్రాణసంధిఁ జే
న్నాదు నితంపు వైష్ణవసుధాధిపు నే పడఁగించె నేఁ దనన్."

(అప్ప. ౫ ఆ. 40 ప.)

క. "శృంగాంశ్య వక్రయోగముల
సాంగత్యము వాకు నాం క్ర సంస్కృతముల నా
దిం గలుగ కట్టి వ్రాఁత ధ
నం గలయం బ్రతాంకములను బ్రాణము లట్టన్."

క. మంగామురుగులు నాలుగు
మంగరములు మూఁడు నేడు నొడ్డాణంబుల్.

(అప్ప. 5 ఆ. 42,43 ప.)

పయిరీతి నున్న యప్పకవీయ వివరణ మెంతమాత్రమును సరియై యుండ లేదు. నన్నయభట్టారకుని కాలమునఁ గూడ నిప్పటివలెనే వ్యవహారమునఁ బదాదిని యకారవకారములు పై రీతిస్థలములం దుండెడివని యంగీకరించినను నవి యపభ్రష్టములనియు, నట్టిపదము లజాదులేయనియు 'వికృతి పదాదా' విత్యాదిసూత్రముతోను (అప్ప. 2 ఆ. 86 ప.) 'క్వచిదపి న స్త' ఇత్యాదిసూత్రముతోను (అప్ప 2 ఆ. 285) చింతామణికర్త చెప్పెననిన ననవచ్చునుగాని యట్టి యపభ్రష్టోచ్చారణములను మూలముగా గ్రహించి వానినుండి గ్రాంథికరూపములను సాధించుచు సంధిప్రక్రియను 'సర్వత్రాజ్వ' దిత్యాదిసూత్రముతోఁ జెప్పెననుట యుక్తముకాదుగదా!

'రాముఁడుచేత' మున్నగు వ్యావహారికరూపములను మూల ముగాఁజేసికొని 'రామునిచేత' మున్నగు గ్రాంథికరూపము లను సాధించురీతిగల ప్రక్రియచింతామణిలోనేగాక యేవ్యా కరణమునందును లేదుగదా! ఇంతియకాక యట్టి యప్పకవీయ వివరణపద్ధతియే చింతామణికర్త్రభిప్రేత మైనయెడల నప్పకవి వలెనే యాతఁడును 'సర్వత్రాజ్వ' యిత్యాదిసూత్రముచే 'యెవ రు' మున్నగు శబ్దములలోని పదాదియకారమునకు సంధికాల మునలోపమును సూత్రించినట్లు 'వ్రూరు' మొదలగు శబ్దముల లోని పదాదివకారమునకు సైతము సంధికాలమున లోప మును సూత్రించియుండఁడా ?

పై సందర్భమునుబట్టి పై యప్పకవీయవివరణము సరిదై యుండ లేదనియు, 'వికృతి పదాదా' విత్యాదికారికయు 'క్వచిదపి వ స్త' ఇత్యాది కారికయు 'భూతాద్యర్థసముద్యోతిన' మ్మను పాఠాంతరమును బ్రక్షిప్తములనియు, సిద్ధాంతీక రించుటకు సందేహ ముండఁబోదుగదా !

మఱియు 'వ్రూరు' మొదలగు స్థలములం దెట్లు పదా దిని వకారము వినఁబడుచున్నను నది పదావయవముగా నంగీ కరింపఁబడలేదో యట్లు 'యెవరు' మున్నగుచోటులందు సైతము పదాదిని వినఁబడుచున్న యకారము పదావయవ ముగా నంగీకరింపఁబడరాదని ప్రక్షిప్తపాఠకర్త లాకయుక్తిని జూపుచున్న ట్లగపడుచున్నది. కాని 'ఒకయూరు' మున్నగు చోటులందు వకారము లేకుండుటయేగాక దానిస్థానమున లఘుయకారము వచ్చుచుండుటచేత 'వ్రూరు' మొదలగు చోటులందలి పదాదివకారము కేవల మపభాషితమని నిర్ణ

యించుట సుకరమైయున్నది. పదాది యకారమున్నచో యట్లు గాక సంహితలోనడచినిల్చిన నిల్చుటయు, లేనియెడల లోపించుటయుమాత్రమే గలదు గాని దానిచోట వేఱొకయక్షరము నిల్చుటలేదు. ఆకారణముచే నది యపభ్రాషితమనుట కవకాశములేదు. మఱియు ద్రావిడభాషాభేదము లగుటచే సహోదరభాష లనఁదగు తమిళాదులలో 'యొవరు' మొదలగు చోట్ల 'యారు' మున్నగురూపములు ప్రసిద్ధములై యుండుటచేత నట్టి యకారము ప్రకృతిసిద్ధమని గ్రహించుట యుక్తమగుచున్నది. 'వ్రాయు' మొదలగుచోట్ల నన్నచో తమిళాదిభాషలలో 'ఊర్' మున్నగు స్వకారాదిరూపములే వెలయుచుండుటచేత నచటివకారము సహజమనుట కవకాశములేదు. పయిసందర్భమునుబట్టి పదాదియకారవకారములు సమానకోటికములని వాదించుటయు యుక్తియుక్తము కానేరదు గదా!

41. "నఞ్చోతః" అనునది బాలసరస్వతీయమాతృకపాఠము.

(సంధి. 27 శ్లో.

"నఞ్చోత్తోహ్యత్రథర్వణాచార్యమతాత్" అనునది యప్పకవీయ మాతృకాపాఠము (౩ ఆ. 115 ప.)

అథర్వణాచార్యకృత వికృతివివేకము చింతామణికి శేషగ్రంథ మనుట నిర్వివాద మగుటచేతఁ బుట్టనున్న యథర్వణునిపేరు చింతామణిలో స్మరింపఁబడుట కేవలము నసంభవమనియు నక్కారణమున నప్పకవి మాతృకాపాఠము ప్రక్షిప్తమనియుఁ జెప్ప నగును. మఱియు నీ నుమాగమము నిత్య

మగుటచేతఁ బాక్షికతను బోధించునట్లుగ "అథర్వణాచార్య మతాత్" అని సూత్రించుట కేవలము నసంగతమై యున్నది.

గీ. సమసనమున నామాంత శృంగములకెల్ల
వాల్లు గదియ స్వార్థంబునఁ బొల్లుద్రుతము
వికృతినాగమమై ద్రుతప్రకృతిపగిదిఁ
గాంచు సంధినథర్వణకవి మతమున.

క. చనుఁగవకుఁ జనుం గవయనఁ
దనరుఁ దలిరుజొంపమునకుఁ దలిరుంజొంపం
బనవచ్చు ననుఁగు వెలఁదికి
ననుఁగు న్వెలఁది యన శిష్టమగు స్థిరపరతన్.

(అప్ప. 2 ఆ. 115-116 ప.)

అని యప్పకవి యాంధ్రీకరించియున్నాఁడు. ఇది పాక్షికమే యైనప్పుడు 'చనుకవ' అనియు నుండవలసివచ్చును? నన్నయ భట్టారకుఁ డెచ్చటను "అనుఁగు న్వెలఁది" అనురీతిగల ప్రయోగములను జేసియుండ లేదు సరేగదా యథర్వణుఁడు నైతము స్థిరపరకత్వమున నుగాగమమును విధించియుండ లేదు.

"పరశేపరుషేచైవ సమాసేనుముతో భవేత్
అద్రుతాత్స్వరసా దందు పట్టికూర్చి విభక్తిషు,
తనేచకుత్ర చిదతో వికారా చ్చాపికేచన
అమిశ్ర స్త్రీసమాత్ కేచిత్ ప్రయోగ శ్శరణంకవేః"

(వికృతివివేకము. 38 పుట.)

అని యి ట్లథర్వణుఁడు పరుషసరళములు పరమగునపుడు

మాత్రమే యీనుమాగమము వచ్చు నని చెప్పియున్నాఁడు. అథర్వణాచార్యవిరచిత మనఁబడుచున్న త్రిలింగశబ్దానుశాసనములో నీవిషయమే లేదు. నన్నయభట్టు హల్మాత్రము పరమగుచుండఁగా నుమాగమవిధానము చేసెననియు నథర్వణుఁ డద్దానిని సంకోచపఱిచి పరుషసరళములుమాత్రమే పరమగుచుండఁగా నుమాగమము వచ్చునని సవరించెననియుఁ జెప్పుటకన్న నసంగతము గలదా? కవిత్రయమువారికిఁ దర్వాతివారు గదా యిట్టి స్థిరపరక నుమాగమప్రయోగములు చేసియున్నారు !

పయిసందర్భమునుబట్టి యప్పకవీయమాతృకాపాఠము ప్రక్షిప్తమని నిశ్చయించుటకు సందియము లేదు.

42. శ్లో. "లుక్సంశ్లేషావాచి ద్రుతస్యసర్వత్ర లుక్ సమాసేషు"

అనునదిమాత్రమే బాలసరస్వతీయచింతామణిలో నున్నది. అప్పకవీయ చింతామణియందన్నచో పైశ్లోకార్థ ముండఁగా మఱొకచోటఁగూడ,

"ప్రథమలుగవిద్విషులోఽద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు"

అని యిట్లు ద్రుతస్యేదిసూత్రము వెలయుచున్నది. అప్పకవీయమున లుక్సంశ్లేషావిత్యాది సందర్భములోని సామాసిక ద్రుతలోపసూత్రమునకు వివరణమే యగపడదు. అచట గ్రంథపాతమయినదనియైన ముద్రణసంస్కర్త లెవ్వరును వ్రాయలేదు.

ఇంక స్థలాంతరములోని ద్రుతస్యేత్యాదిసూత్రము బాలసరస్వతీయము చెప్పిన సామాసికద్రుతలోపమును విధించుచున్నట్లుగ నప్పకవీయమున వివరింపఁబడ లేదు.

"సర్వత్ర = సకల నామములయందును, సమాసేషు = సమాసములందు, ద్రుతస్య=ద్రుతమునకు, లుక్ = లోపము వచ్చును. మోముచందరుఁడు, విరిగల్వ, కవిసేర్పు........" (బాలసరస్వతీయము. 26 శ్లో. సంధి. 29 సూ.)

తే. వనధి తనయేశ యైనటువంటి యనుచుఁ
బరపదవిశేషణము లేటపఱుచుకొనుచుఁ
దొలుతటిపదంబు కొననుండు ద్రుతము గుడియుం
సమసనమునందుఁ జెందు లోపములు కృతుల. 161.

క. కడపలిద్రుతమును గుడియుడు
బొడవడఁగిన పైని పరుషములు సరళములౌఁ
జెడవు పెఱ హల్లులెల్లను
సడలక ప్రాణంబులెల్ల సంధులుగాంచున్. 162.

గీ. "జగతిఁ జప్పనికూరకుఁ జప్పగూర
చనును జక్కనిచాయకుఁ జక్కఁజాయ........" 153

(అప్ప. 5 ఆ.)

ఈ వివరణము మిక్కిలి వింతగా నున్నది. దీనినిబట్టి 'కమ్మందావి' మొదలగు సాధురూపములు సాధ్యములు కానేరవు. మఱియు ద్రుతము లోపించినవెనుక పరుషములకు సరళాదేశమువచ్చుట కేవలము నసంభవము. వ్యాకరణ సంప్రదాయ

విరుద్ధము మఱియు నీవివరణమున ద్రుతలోపమునకుఁ బాక్షి
కత్వము నిరాకరింపఁబడమిం జేసి "చప్పనిసూర" అనినయైన
నిల్చునా యని యాలోచింపవలసి యున్నది. ఇంతియ కాక
"సడలక ప్రాణంబులెల్ల సంధులు గాంచుచున్." అనుచోటియెల్ల
శబ్దమహిమచే, 'తెల్లనియావు, తెల్లయావు' అనురూపము
లు సాధ్యములగునో కావో తెలియకున్నది.

పయిరీతిని ప్రమాదభూయిష్ఠముగ నప్పకవివంటి లక్ష
ణవేత్త వివరించియుండునా యని యాలోచింపవలసియున్నది.
ఏది యెట్లున్నను నిట్టి యసంగతవిధానములు నన్నయాభిప్రే
తములని యెంతమాత్రము నంగీకరింపరాదు. కాఁగాఁ బై
నుదాహరించిన స్థలద్వయములోను నీరెండవచోటి ద్రుత
స్యాదిసూత్రము ప్రత్యక్షమనియుఁ దొలుతటిచోట బాలసర
స్వతిచేసిన వ్యాఖ్యచొప్పున సామాసిక ద్రుతలోపవిధానమే
నన్నయభట్టాభిప్రేతమనియు నిశ్చయింపనగును. అట్టి సామా
సికద్రుతలోపవిధానమే లేనియెడల 'కవినేర్పు' మున్నగు
చోటులందు

"షష్ఠీ భవేద్ద్వితీయాద్యా తత్పురుష సంస్థితానామ్నామ్."

అను చింతామణిసూత్రము చొప్పున, నేర్పడు 'కవిన్ + నేర్పు'
అనుచోట ద్రుతలోపము కలుగక యిష్టరూపాసిద్ధియు ననిష్ట
రూపసిద్ధియు సంభవించి చింతామణిలోని షష్ఠీసమాసప్ర
క్రియ యసంగతము కావలసివచ్చును. కాఁగా నప్పకవీయ
ములోని లుక్సంశ్లేషావిత్యాదిసందర్భములోని సామాసిక
ద్రుతలోపవిధానవివరణము లేఖకాదిప్రమాదమున లోపించె
నాయని యాలోచింపవలసి యున్నది.

43. విచక్షణులారా, బాలసరస్వతి మాతృకాపాఠము లకును నప్పకవిమాతృకాపాఠములకును నింక ననేకవిధము లగు భేదములు గలవు. తద్ధర్మాద్ధకోకార సంధివిషయమున బాల సరస్వతీయమున 'నస్యాత్తద్ధర్మోతః' అను నొక్కసూత్రమే యున్నది. అప్పకవీయమునందన్నను 'నస్యాత్తద్ధర్మోతః' 'ధాతు పదసంభవానాం విశేషణానాముత స్తథానుచుచి' అను రెండు సూత్రములుగలవు. ఇట్లే 'బోరద్భుతశబ్దార్థే' 'వికృతిప దేలాటో రపి' 'తేషామితశ్చతద్వ త్రివిక్రమమతేన' అనునవి మొదలగు నధికపాఠములును నప్పకవీయచింతామణిలో నగపడుచున్నవి. మఱియుఁ జైని వ్రాసిన యధికపాఠాదిసూత్ర భేదములను ఛం దోబద్ధము చేయుటలోను, సూత్రములవరుసను బ్రక్షిప్తపాఠ కర్తలు స్వాభిప్రాయానుసారముగా మార్చుటలోను, జేయక తీరని యలంతిమార్పులును నాయాసూత్రములలో వ్యాపిం చి యున్నవి. మఱియుఁ బ్రక్షిప్తపాఠకర్తలు స్వాభిప్రాయాను సారముగ నట్లు సంధిప్రక్రియను జూపుటలో నజంతాదిపరిచ్ఛే దములలోని 'కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే హ్వ్యేషు' అనునది మొదలగుసూత్రము లిందు సంధిపరి చ్ఛేదములో సందర్భింపఁ జేయఁబడినవి. కాని యిట్టిమార్పుల వలన నంతగా ననిష్టరూపోత్పత్తి యిష్టరూపాసిద్ధి మున్నగు చిక్కులు సంభవింపనేరవని తోఁచుటచేత గ్రంథవిస్తరభీతిచే నిట నాయాభేదములనెల్లఁ జూపి విమర్శింపలేదు. రూపనిష్ప త్త్యాదికమున నంతగాఁ బ్రమాదములు పైభేదములవలనఁ గలుగకున్నను గొన్నికొన్ని నన్నయభట్టారకసిద్ధాంతము లీ యప్పకవీయమున రూపుమాసినవి. పాఠకమహాశయులకు విశ

దపడుటకయి యొక్క స్థలమును మాత్రము చూపి యీవిష యము నింతటితో ముగించుచున్నాను.

44. పయినుదాహరించిన యప్పకవీయమాతృకలోని నన్యాదిత్యాదిసూత్రమున కప్పకవి యీక్రిందిరీతిని వివరణ మును జేసియున్నాఁడు.

గీ. 'ఉర్విఁ దద్ధర్మమునఁ బ్రకృతోక్తమాఖ్య
పురుషముల నేకవచనముల్ పోవవిడిచి
కడమపదములు త్రిష్ఠధ్యకములు గాఁగ
గొమ్ములను బ్రాణసంధులు గూర్చుచొప్ప. 69

క. కాంతు రజప్రభృతులు నిను
సంతతమును బ్రోతు వీవు సనకాదుల మ
ర్దింతు రభవుండు నీవను
బంతంబున ఖలులననుచు భావింతు మెదన్. 70

క. పదలక తద్ధర్మములను
బొదలెడు ప్రకృతోక్త మాఖ్యపురుషైకవచః
పదములు ద్రుతప్రకృతులగుఁ
బదరును నతఁ డోర్తునేను బలుమఱునన్గన్. 71

(అప్పకవీయము. 5 ఆశ్వాసము.)

పయిసందర్భమునుబట్టి ద్రుతప్రకృతికములకు సంధిరా దను నొకసిద్ధాంత మప్పకవిచే నంగీకరింపఁబడుచున్నది. నన్నయభట్టారకుని మతమునందన్న ద్రుతప్రకృతికత్వము సంధిప్రతిబంధకముకానేరదు. 'పదరును నతఁడు' అను నుదా

హృతినిబట్టి 'పదరును' అనునది తద్ధర్మ ప్రథమపురుషైకవచన రూపమనియు, నందలి 'ను' అనునది ద్రుతమనియు నప్పకవి యంగీకరించినట్లగపడుచున్నది. కాని నన్నయభట్టమతమునందుఁ జింతామణిప్రక్రియచొప్పున 'పదరున్' అనియే తద్ధర్మ ప్రథమ పురుషైకవచనము సిద్ధించును. స్వరవిశిష్ట మెప్పుడును ద్రుత ము కాదు. నకారవ్యంజనమాత్రమే నన్నయభట్టారకమతము నందు ద్రుత మనిపించుకొనును. ఇట్టి నన్నయాభిప్రేతములు కాని సిద్ధాంతము లనేకము లప్పకవీయమునను, బాలసరస్వతీ యమునను,నహోబలపండితీయమునను గలవు. అవియెల్ల నంత గాఁ బ్రసక్తములు కామింజేసి గ్రంథవిస్తరభీతి నీవిషయము నింతటితో ముగించుచున్నాను.

## బాలసరస్వతి.

45. బాలసరస్వతీమహోపాధ్యాయుఁడు తనగ్రంథము నం దెచ్చటను దానిని రచించినకాలమును జెప్పికొని యుండ లేదు. అట్లయినను నప్పకవి తనగ్రంథమును రచించినకాల మును జెప్పికొనుటయే గాక బాలసరస్వతీయ కాలమును గూడ వచించియున్నాఁడు. అప్పకవీయమును రచింపుమని యుపదేశించుటకయి భగవంతుఁ డప్పకవికి స్వప్నమున సాక్షా త్కరించిన దినము శాలివాహనశకము 1578 సంవత్సరమునకు సరియగు క్రీస్తుశకము 1656 సంవత్సరమగు మన్మథవత్సరపు శ్రావణ బహుళాష్టమి యనియు, దానికి సన్నిహితమగు వెను కటి కీలకసంవత్సరమునందే సిద్ధుఁడు బాలసరస్వతికిఁ జింతా మణి నిచ్చియుండెననియు నప్పకవి యీక్రిందిరీతిని జెప్పి యున్నాఁడు.

సీ. ధాత రెండవపరార్థమున నాదిదినంబు
పగటి వరాహకల్పంబునందు
మహిత వైవస్వతమనువేళ దేశంబు
లక్షింప నైన (౫౬ ÷ 2=28) మహాయుగమునఁ
గలిసమయంబునఁ దొలిచరణంబున
మానితం బగుచాంద్రమానమునను
శాలివాహన నామశకమున గిరిశైల
శర సుధాకిరణుల సంఖ్యనడవ
తే. సంగజాబ్దంబునను దక్షిణాయనమున
జలధరర్తువు మొదటి మాసంబునందు
బహుళమున దేవకికిఁ జక్రపాణి పుట్టి
నట్టి యష్టమినను దేర......

... ... ... ... ...

తే. ...నిలిచె నొకరుఁడు నాదు ముంగలను గలను.

... ... ... ... ...

తే. రాజరాజనరేంద్ర తనూజుఁ డార్య
సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు.

... ... ... ... ...

కం. ..., తొలి సిద్ధులఁగలసి యొక్క సిద్ధుం డయ్యెన్.

కం. ఆ లోకనుతుఁడు మొన్నటి
కీలకసమ నామతంగగిరికడ నొసఁగెన్
బాలసరస్వతులకు నతఁ
డోలిఁ దెనుఁగుటీక దాని నొప్పగఁ జేసెన్.

(అప్పకవీయము. 1ఆ. 36—52.)

46. బాలసరస్వతికి మిక్కిలి సన్నిహితకాలము లోని వాఁడగు నప్పకవిచెప్పిన పయి బాలసరస్వతీయరచనాకాలము సరియైనదే యై యుండనగును,గాని యాబాలసరస్వతికిఁ జింతామణిమాతృకను సిద్ధుఁ డిచ్చుటమాత్రము పైశ్లోకములో నున్న కీలకసంవత్సరమున జరిగియుండలేదనియు, నంతకుముందుఁ గొంతకాలము క్రిందటనే చింతామణిమాతృక బాలసరస్వతికి లభింపఁగా నాతఁడు దానిని బాగుగఁ గొంతకాలము పరిశ్రమ చేసినతర్వాతనే లోకోపకారార్థముగ బాలసరస్వతీయటీకను రచించియుండెననియు, నాతని యీక్రిందిగ్రంథాది పీఠికావచనమువలన విశదమగుచున్నది.

> వ. "అని యిష్టదేవతాప్రార్థనంబు సేసి మున్నొక్కనాఁడు విద్యానగరిలో నచింత్యకారణోపాగమ స్నేహసాహచర్యుం డగు శివయోగివర్యుచే దైవచోదనం బరిప్రాప్తమైన యాంధ్రశబ్దచింతామణి గ్రంథంబునకు లోకోపకారార్థంబుగాఁ డీకఁ గావింపఁ గోరి......" (బాలసరస్వతీయము. 3.)

మున్నొక్కనాఁడు విద్యానగరిలో శివయోగి వర్యుని మూలమునఁ దనకుఁ జింతామణి లభించెనని చెప్పుటచేతఁ దల్లికోటయుద్ధమున విజయనగరవినాశనము జరుగకముందే యాతనికిఁ జింతామణిలభించియుండెనని తోఁచుచున్నది. కాని యీవిషయమున బాలసరస్వతియు నాతని ప్రపితామహుఁడు నేకకాలమునఁ బండితులై యుండిరని తత్పీఠికలోనే యొక విప్రతిపత్తి యగపడుచున్నది. బాలసరస్వతికిఁ జ్యేష్ఠప్రపితామహుండగు తిరుమలయ్య కళియరామరాజు 'రొండపల్లి'

యనునగ్రహారము నిచ్చి సత్కరించిన ట్లీక్రిందిరీతిని బాలసర స్వతి చెప్పికొనియున్నాఁడు.

తే. అతిరమణేంద్రుఁ డళియ రామావనీశ
దత్త యెకవల్లి ముఖ్య సద్గ్రామహేమ
చామరచ్ఛత్రపల్లంకికామణిఁబ
భూషణుండై వైదుషీస్ఫూర్తిఁ బొలుపుమించె.

(బాలసరస్వతీయము. 7 ప.)

అళియరామరాజు క్రీ. శ. 1565 సంవత్సరము జనవరి నెలలోఁ దల్లికోటయుద్ధమునఁ జనిపోవుటయు,నప్పుడే విజయ నగరముతురకలచే రూపుమాపఁబడుటయు,సుప్రసిద్ధము లగు చరిత్రాంశము లగుటచేత నంతకుముందే బాలసరస్వతి విజయ నగరిలోఁ బండితుఁడై యుండవలెనన్నచో, బాలసరస్వతీయ రచనాకాలమున నాతఁ(బాలసరస్వతి) డిరువదేండ్లకుఁ బయిఁ బడినవయసుగలవాఁడై యుండవలయుననియు, విజయనగర విధ్వంసకాలమునకుముందు బాలసరస్వతియు నాతని ప్రపితా మహానియన్నయును బండితులై యుండెడివారనియు నంగీక రింపక తీరదు. కాఁగా బాలసరస్వతికిఁ జింతామణిమాతృక లభించినకాలమున నాతఁ డిరువదియేండ్లవయసు గలవాఁడని యైన నంగీకరింపక తీరకుండుటం జేసి యప్పటి కాతని ప్రపితా మహాఁ డెనుబదియేండ్లకుఁ బయిఁబడిన వయసుగలవాఁడని యైన నంగీకరింపక తీరదు. కాని యళియరామరాజు తల్లికోట యుద్ధకాలమునకుఁ దొంబదియేండ్లకుఁ బయిఁబడినవయసుగల వాఁడనుట సుప్రసిద్ధమయిన చరిత్రాంశమై యుండుటచేతఁ

బయువిషయమునం దసంభావ్యత యగపడదు. నేటికిని దొంబ దేండ్లు జీవించినవారును నిరువదేండ్లు వయసుగలిగిన యిను మనుమఁడుగలవారును నరుదుగ లేకపోలేదు గదా!

అయినను బయి విప్రతిపత్తికి సమాధానాంతరము గూడఁ జెప్పవచ్చును. విజయనగరము తురకలచే రూపుమాపఁ బడినపిమ్మటఁ గూడ నచటఁ గొంతకాలమువఱకు నొకచిన్న పట్టణ మాపేరితో నున్నదనియుఁ జెప్పుట చరిత్రాంశమునకు విరుద్ధము కామింజేసి, యట్టియవస్థలో బాలసరస్వతికిఁ జింతా మణిమాత్రకే నాకీలకసంవత్సరమందే సిద్ధిఁ డిచ్చియుండ వచ్చునని చెప్పినను జెప్పవచ్చును.

47. బాలసరస్వతి వ్యాకరణమహాభాష్యాదిశాస్త్ర గ్రంథములయందు గొప్పపాండిత్యమును సంపాదించి మహో పాధ్యాయబిరుదమును గాంచి, చంద్రికాపరిణయాది బహు గ్రంథకర్తయై సకలభాషా కవితాస్వతంత్రభట్టారకుఁ డైన పిమ్మటనే యాంధ్రశబ్దచింతామణికి బాలసరస్వతీయ మను వ్యాఖ్యానమును రచించినట్లు బాలసరస్వతీయగ్రంథాది నా తఁడు చెప్పికొన్న యీ క్రిందిపద్యములవలనను, బాలసరస్వ తీయమునందలి పరిచ్ఛేదాంత గద్యములవల్లను విశదమగు చున్నది.

సీ. భాష్యాది బహుశాస్త్ర పరిచయోదాత్తుండఁ
గౌముదీ నాటకకావ్యకవిని
భాషావివరణాఖ్య భవ్యశాస్త్రకరుండ
బాహటస్థాన నిబంధనుండఁ

బాంధ్రావళిదయాది సత్కృతిప్రస్తవ
విప్రవామన పురాణప్రబంధ,
భావ్యమకుటిత ప్రబంధాము కర్తను
దక్షిణాకాశీ తంత్ర వణుండ
తే. బ్రకట మానవరాఘవ పాండవీయ
నామకశ్లేష కవితా ప్రణాయకుండ
ననఘ కౌండిన్యగోత్రుండ నఖిలసుకవి
శాస్త్రతంత్రుండ బహుకళాపదుండ నేను.

(బాలసరస్వతీయము. 10 ప.)

పై పద్యమున 'ప్రబంధ'మనఁగా (ప్రబంధ్ర్యశబ్దము) రచయిత యని యర్థము. 'ఇది సకల కవితాస్వతంత్ర భట్టారక యెల కూచి బాలసరస్వతీ మహోపాధ్యాయప్రణీతంబైన శబ్దాను శాసన టీకాగ్రంథంబునందు ...' అని యిట్లియుదుపరిచ్ఛేద ములతుదిని వ్రాయఁబడియున్నది. ఈ గద్యధోరణినిబట్టి యాంధ్రశబ్దచింతామణికి శబ్దానుశాసన మనెడినామాంతర మును గలదని విశదమగుచున్నది.

గ్రంథకర్తకుఁ గల 'బాలసరస్వతి' యనుపేరు పౌరుష నామమని తోఁచుచున్నది. అతఁడు పిన్ననాఁటనే గొప్పపాండి త్యము గలవాఁడై యుండుటచేత నాతనికట్టి 'బాలసరస్వతి' అను బిరుదనామము లభించియుండునని యా నామధేయ మునుబట్టి యూహింపవచ్చును.

48. బాలసరస్వతి పండితవంశజాతుఁ డగుటచేతను, నాతనితండ్రి తాతలు ప్రసిద్ధులయిన పండితులై యుండుట

చేతను, వారాతనికిఁ బిన్నటనాఁటనుండి విద్యలఁగఱపి బాల్య మునందే గొప్పవైదుష్యము కలిగించిరని యూహింపవలసి యున్నది.

తే-గీ. అతిరుమలేంద్రుఁ డళియరామావనీశ
దత్తయొడవల్లి ముఖ్యసద్గ్రామహేమ
చామరచ్ఛత్ర పల్యంకికా మణీవి
భూషుఁడై వైదుషీస్ఫూర్తిఁ బొలుపుమించె.

(బాలసరస్వతీయము. 7 ప.)

అని యిట్లు గ్రంథకర్త ప్రపితామహుని యన్న గొప్పవైదుష్యము గలవాఁడై కర్ణాటసామ్రాజ్యధురంధరుండగునళియ రామరాయలవలన గొప్పసమ్మానములను గాంచియుండెనని బాలసరస్వతి చెప్పికొనియున్నాఁడు.

ఆ-వె. పాకనాఁటి సకలపండిత కవిజనా
చార్యుఁడైన కృష్ణయార్యవర్యు
నకును లక్ష్మమాంబికకు నేను నాదిత్య
కవియుఁ గల్గితిమి జగన్నుతులము.

(బాలసరస్వతీయము. 9 ప).

(పయిపద్యములలో మొదటిపద్యమున 'దత్తయొడవల్లి' అనుచోట 'సకలభాషా కవితాస్వతంత్రభట్టారక యెలకూచి' అనుచోటియందువలెనే పదాదియకారము దుష్టముకాదు. నన్నయభట్టమతమునఁ బదాదియకారము సమ్మతమే యగుటం జేసియు, సర్వత్రాజ్వదిత్యాదిసూత్రము సంస్కృత సమాస

మధ్యమునందలి పదాదియకారము లోపమును విధించునది కామింజేసియు నచటి యకారము నిర్బాధము. లేదా యవి సంజ్ఞావాచిశబ్దము లగుటచేతను వానిని యథాస్థితముగ సంస్కృతసమాసమధ్యమున ననుకరించుట విరుద్ధము కాకుం డుటచేతను దోషశంక లేదనందగును.)

49. బాలసరస్వతి తన శబ్దానుశాసనటీకను దనయాత్మదేవత యగు నంబాదేవికిఁ గృతిచేసియున్నాఁడు.

వ. 'ఆంధ్రశబ్దచింతామణిం దెలిఁగించెద. ఇది తొల్లి సకలకవితాప్రవర్తకం బగుశబ్దశాసనుండు సకల కవిహితంబుగా యథోచితసూత్రగ్రంథంబులు నార్యావృత్తంబులఁ బంచపరిచ్ఛేదకంబుగా సమకట్టె. దాని నా చెప్పఁబోలెడి తత్సూత్రవిభాగంబును దత్ప్రమేయవివరణంబును దదుదాహరణస్వరూపంబులును నాంధ్రమయగద్యపద్యంబుల నేర్పఱిచి నాయాత్మదేవత యగు నంబాదేవి కర్పించు వాఁడ.' (బాలసరస్వతీయము. 11).

50. పయివచనములోఁ దనయాత్మదేవత యంబాదేవి యని బాలసరస్వతి చెప్పియు నీక్రిందిపద్యమున విరూపాక్షుండు తన యిష్టదేవత యని చెప్పియున్నాఁడు.

మ. ఇలఁ బ్రజ్ఞానిధులౌ కవుల్ మునుపు లేరే! వారు వ్యాఖ్యాతృక
ర్తలు కానోపరె! పెక్కువత్సరములం దర్వాతకమైయున్న యీ
తెలుఁగున్ వ్యాకరణంబు నాకొసఁగెఁ బ్రీతిం టీకఁగావింపు మం
చలబద్ధుండు మదిష్టదేవత విరూపాక్షుండు నిక్కంబుగన్.

(బాలసరస్వతీయము. 5 ప.)

గ్రంథాదియం దిష్టదేవతాస్తుతి యీక్రిందిరీతిని గ్రంథకర్తచే నొనర్పఁబడెను.

ఉ. "శ్రీకరశాఖమై ద్విజనిషేవితమై సుమనఃప్రజీవనం
బై కలధౌతసుందరమహాచ్ఛదమై సుమసారవద్ద్యుతి
ప్రాకటమై ప్రశస్తపదపల్లవమై యలరారు నాశ్రితా
నీకఫలప్రదంబు హరినిర్జరశాఖి సమాశ్రయించెదన్. 1

సీ. చిన్నిచెందొవవిందు గన్నె నేదఁగి రేకు
దోఁచినయందంపుఁ దుఱుముతోడ
సరసదూర్వానవాంకురగుచ్ఛకచ్ఛాయ
లీను నిద్దంపు నెమ్మేనితోడఁ
గరుణారసమరంద భరసంభృతంబులై
తనరు నేత్రారవిందములతోడఁ
గాలాహిక్రియ నభక్తజనంబులకు భయో
త్పాదియౌ నభయహస్తంబుతోడ
తే. హృదయమునఁ గానిపించి యభీప్సితప్ర
బంధ శబ్దార్థవిజ్ఞాన భవ్యశక్తి
యొసఁగుఁ గావుతఁ దల్లిభక్తౌఘ దురిత
లావిదక్షిణ కాళికాదేవి నాకు. 2

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు చేసి........" 3

(బాలసరస్వతీయము.)

స్థూలదృష్టిని బరిశీలించినచోఁ బై మొదటిపద్యమును బట్టి విష్ణువును నిష్టదైవతమే యని తెలుచున్నది. కాఁగ

బరిశీలింపఁగాఁ గృత్యాదినున్న 'పై శ్రీకరేత్యాదిపద్యము నందు శివకేశవపరప్రకృతశ్లేషార్థములు రెండును నప్రకృత కల్పశాఖపరాప్రకృతశ్లేషార్థ మొకటియు నిబంధింపఁబడినవని తోఁచుచున్నది.

శ్రీకరశాఖమై = శోభాయుక్తములయిన యంగుళులు గలవాఁడు (ప్రకృతశ్లేషార్థములు రెండిటనుసమానమే) శోభాకరములయిన శాఖలుగలది. (కల్పవృక్షపక్షమునందలి యర్థము.)

ద్విజనిషేవితమై=బ్రాహ్మణశ్రేష్ఠులచేత సేవింపఁబడువాఁడు (ఇదియును బ్రకృత శివకేశవపరార్థద్వయమునను దుల్యమే.) పక్షులచేత సేవింపఁబడునది (కల్పశాఖపక్షము).

సుమనః ప్రజీవనంబు = దేవతలకు జీవనాధారమైన వాఁడు. (ఇదియుఁ బ్రాకరణికోభయపక్షములందును దుల్యమే) పుష్పములుగలది. (కల్పశాఖ పరము.)

కలధౌతసుందరమహాచ్ఛదమై=సువర్ణవికారమైన సుందరమగు వస్త్రముగలవాఁడు. (విష్ణుపరము.) రజతవికారమైన సుందరమైన ఆవరణమనఁగా నుదవసితమనఁగా వాసస్థానము గలవాఁడు. (కైలాసవాసిశివపక్షము) (కలధౌతంరౌప్యహేమ్నోః అమరము.) రజతమయములైన, లేదా స్వర్ణవికారములైన సుందరములగు పెద్ద ఆకులుగలది (కల్పవృక్షము.)

సుమసారవద్ద్యుతిప్రాకటమై = లెస్సైన మసారము వంటి యనఁగా నింద్రనీలమణివంటి శరీరకాంతిగలవాఁడు (విష్ణువు) సుమమువంటి యనఁగాఁ గర్పూరమువంటి లేదా

చంద్రునివంటి తెల్లని (సుమ...న...పుష్పే చంద్రే కర్పూరే. నభసిచ, శబ్దస్తోమమహానిధి.) సారవంతమగు కాంతిగలవాఁడు (శివుఁడు.) పుష్పములయొక్క సారవంతమగు కాంతిగలది (కల్పవృక్షము.)

ప్రశస్తపదపల్లవమై=ప్రశస్తములైన పల్లవములవంటి పాదములుగలవాఁడు (శివుఁడును కేశవుఁడును) ప్రశస్తము లయిన కాంతులుగల చివుళ్లుగలది (కల్పశాఖ.)

ఆశ్రితానీకఫలప్రదంబు=ఆశ్రయించినవారికి వాంఛిత ముల నిచ్చునది (అర్థత్రయమునందును దుల్యమే.)

హరినిర్జరశాఖ = విష్ణువనెడి కల్పవృక్షము. శివుఁడనెడి కల్పవృక్షము. (హరి. పుం. హృ ఇన్. విష్ణౌ...హరే (శబ్ద స్తోమమహానిధి.)

'హరనిర్జరశాఖ' అనుపాఠము పక్షమునందును పైరీతినే శివకేశవపరముగ నర్థద్వయమును గ్రహింపనగును.

(హరః, అ, పు, శివః, ఈశానః, అగ్నిః, గర్దభః, విష్ణుః, బ్రహ్మా, యమః, సర్వశబ్దసంబోధిని.) హరిహరశబ్దములకు రెండింటికిని 'భక్తులపాపములను హరించువాఁడు' అనునర్థమున 'హరతీతి హరిః' అనియు, 'హరతీతి హరః' అనియు నేకరీతినే గురుబాలప్రబోధికలో వ్యుత్పత్త్యర్థములు వ్రాయఁబడుటం జేసి హరిహరశబ్దములు రెండిటికిని బ్రత్యేకముగా శివకేశవపరములగు నర్థములు రెండును గలవనుట సహజమనియే గ్రహింపనగును.

"త్వమింద్రస్త్వం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః."

అనుశ్రుతివాక్యమున నామరూపధారియగు నీశ్వరచైతన్యరూప చిదాభాసుఁ డొక్కఁడే యగుటచేత శివకేశవుల కద్వైతము నిర్వివాదమే గదా! 'మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరమ్' అనుపంచదశీసూక్తివాక్యమున నీశ్వరశక్తిభూత మాయారూపయగు కాళికాదేవికిని శక్తిమంతుఁడగు నీశ్వరునకును 'నలోకే చైత్ర తచ్ఛక్త్యోర్జీవితం లిఖ్యతేపృథక్' అను విద్యారణ్యసూక్తివాక్యమున నద్వైతము సిద్ధమే యగుచున్నది. పై రీతి నద్వైతసిద్ధాంతానుసారముగా నిష్టదైవతాద్వైతమును జూపుచు బాలసరస్వతీమహోపాధ్యాయుఁడు తన యద్వైతమతాభిరుచిని గృత్యాది సందర్భమున వెల్లడించియున్నాఁడని విద్వాంసులు పరిశీలింతురు గాక!

30-4-1930.
విజయనగరము.

ఇట్లు సుజనవిధేయుండు,
వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి,
శ్రీ విజయనగర మహారాజావారి
సంస్కృతకళాశాలాపండితుఁడు.

శ్రీరస్తు.

# బాలసరస్వతీయము

## గ్రంథారంభము.

ఉ. శ్రీకరశాఖమై ద్విజవిశేషవితమై సుమనఃప్రజీవనం
బై కలధౌతసుందర మహోచ్ఛదమై సుమసారవద్ద్యుతి
ప్రాకటమై ప్రశస్త పదపల్లవమై యలరారు నాశ్రితా
నీక ఫలప్రదంబు హరినిర్జరశాఖి సమాశ్రయించెదన్.

సీ. చిన్నిచెందొవవిందు గన్నెగేదఁగిరేకు
దోఁచినయందంపుఁ దుఱుముతోడ
సరసదూర్వానవాంకుర గుచ్ఛకచ్ఛాయ
లీనునిద్దంపు నెమ్మేనితోడఁ
గరుణారసమరంద భరసంభృతమ్ములై
తనరు నేత్రారవిందములతోడఁ
గాలాహిక్రియ నభక్తజనంబులకు భయో
త్పాదియౌ నభయహస్తంబుతోడ

తే.గీ. హృదయమునఁ గానిపించి యభీప్సితప్ర
బంధశబ్దార్థ విజ్ఞాన భవ్యశక్తి
యొసఁగుఁ గావుతఁ దల్లి భక్తాఘదురిత
హానిదక్షిణ కాళికాదేవి నాకు.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబుఁ జేసి మ న్నొక్కనాఁడు విద్యానగ
రిలో నవంత్యకారణోపాగమస్నేహసాహచర్యుం డగు శివయోగి
వర్యుచే నైవచోదనం బరిప్రాప్తమైన యాంధ్రశబ్దచింతామణిగ్రం
థంబునకు లోకోపకారార్థంబుగాఁ టీకఁ గావింపఁగోరి నెమ్మనం
బున. 3

ఉ. ఏమి మహాద్భుతం బిదె హరీ! హరి! యెక్కడి యాంధ్రశబ్ద చిం
తామణిశక్తి యెక్కడి మతంగనగంబు యుగాదిసంభవుం
డై మనిచన్న నన్నయమహాకవి యెవ్వఁడు సిద్ధుఁ డెవ్వఁ డా
హా! మదగణ్యపుణ్య సముదగ్రతఁ జేకుఱెఁగాదె యిన్నియున్. ౪

మ. ఇలఁ బ్రజ్ఞాధికులౌ కవుల్ మునుపు లేరే! వారు వ్యాఖ్యాన క
ర్తలు గానోపరె! పెక్కువత్సరము లంతర్భూతమై యున్న యీ
తెలుఁగు వ్యాకరణంబు నాకొపఁగాఁ బ్రతిన్ టీకఁగావింపు మం
చలసిద్ధుండు మదిష్టదేవత వియూహాత్ముండు నిక్కంబుగన్. ౫

వ. అని గణించి లోకోపకారసుకృతకీర్తిలాభ వితర్కంబునఁ బ్రహ
ర్షించి యాంధ్రవ్యాకరణభాష్యనిబంధనోత్సుకుండ నై యాందాది
వస్మచ్చరిత్రమ్ము వర్ణించెద. ౬

సీ. స్థిరకీర్తి యొలకూచి తిప్పనార్యుఁడు గాంచె
శుచిశీలు వల్లభ సోమయాజి
యతనికిఁ దిప్పన్న యజ్ఞన్నయును ననంగ
సుచరిత్రు లిద్దఱు సుతులుపుట్టి
రాతిప్పనకు భైరవన్న నన్నయనాఁగ
నలఘులిద్దఱు తనూజులు జనించి
రా భైరవునకు నొజ్జన తిర్మలయ్యరా
మనయుఁ బెద్దనయును సూరనయుఁ గల్గి

తే-గీ. రాతిరుమలేంద్రుఁ డశియరామావనీశ
దత్త యెడవల్లి ముఖ్యసద్గ్రామహేమ
చామరచ్ఛత్ర పల్యంకికామణీ వి
భూషుఁడై వైదుషీస్ఫూర్తిఁ బొలుపుమించె. ౭

ఉ. అత్యనఘుండు రామఘనుఁ డాత్మజులం గనియెన్ శుచిత్వ సాం
తత్య గభీరుభైరవుని నాగన నప్పన రామధీమణిన్
భృత్యమరాద్రి భైరవమనీషికిఁ గల్గిరి సత్కుమారు లా
దిత్యుఁడు కృష్ణసత్కవి సుధీజనవందితుఁ డబ్బయార్యుఁడున్. ౮

ఆ-వె. పాకనాఁటి సకల పండితకవిజనా
చార్యుఁ డైన కృష్ణయార్యవర్యు
నకును లక్ష్మమాంబికకు నేనునాదిత్య
కవియుఁ గల్గితిమి జగన్నుతులము.

సీ. భాష్యాదిబహుశాస్త్ర పరిచయోదాత్తుండఁ
కౌముదీనాటక కావ్యకవిని
భాషావివరణాఖ్య భవ్యశాస్త్రకరుండ
బాహటస్థాన నిబంధనుండఁ
జంద్రాపరిణయాది సత్కృతిస్రష్టను
విప్రవామన పురాణప్రబంధ,
భ్రామరీగీత ప్రబంధౌఘకర్తను
దక్షిణకాళికా తంత్రచణుఁడఁ

తే-గీ. ప్రకట యాదవ రాఘవ పాండవీయ
నామకశ్లేష కవితా ప్రణాయకుండ
నవఘ కౌండిన్యగోత్రుండ నఖిలసుకవి
తా స్వతంత్రుండ బహుకళాధరుఁడ నేను. ౧౦

వ. ఆంధ్రశబ్దచింతామణిః ముగించెను. ఇది తొల్లి సకలకవితాప్రవర్తకుం డగుశబ్దశాసనుండు సకలకవిహితంబుగా యథోచితసూత్రగర్భంబు లగు నార్యావృత్తంబులఁ బంచపరిచ్ఛేదకంబుగా సమకట్టి చేసి వానియందు ‘సత్సూత్రవిభాగంబును దత్ప్రమేయవివరణంబును సముదాహరణస్వరూపంబులును’ నాంధ్రమయ గద్యపద్యంబుల నేర్పఱచి నాయాత్మదేవత యగు నంబాదేవి కర్పించువాఁడఁ దదుపక్రమం బెట్టిదనిన. ౧౧

---

# సంజ్ఞాపరిచ్ఛేదము

శ్లో. వాచా మాంధ్రమయీనాం యః ప్రవక్తా ప్రథమోఽభవత్,
ఆచార్యం తం కవీంద్రాణాం వందే వాగనుశాసనమ్.

(4. సూ.)

1. శ్లో. విశ్వశ్రేయః కావ్యం,
తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ.
సా వాగార్యా రసవృత్తి,
స్సార్థో హి రసో యథాయథంకవిభిః ౧.

సూ. విశ్వశ్రేయః కావ్యమ్. ౧.

టీక. కావ్యమ్ = కావ్యము, విశ్వశ్రేయః = సర్వధర్మములలో శ్రేష్ఠము. కావ్యమనఁగాఁ గవి కర్మము. ఏకర్మముచేతఁ గర్తకుఁ గవియను వ్యవహారముగల్గునో యది కావ్యము. “నానృషిః కురుతే కావ్యమ్” అనియు, “యతేర్ధర్మ్యసృష్టిః కవేర్వచః” అనియు, నుండుటచేతఁ గావ్యము పవిత్రమైనది.

"మహార్షి వీర్యః ప్రవిభావనాత్మసా
తత్కృతామరోఽ కృత్రిమశక్తియుక్తిమాన్,
సమర్హణార్హోఽఖిలదేహినాం భవే
త్కావిః పునీతేచ విపాప్మనాగిరా."

అని యుండుటచేత విద్వత్కృతమయిన కావ్యము సర్వో త్కృష్టము నగును. ఎట్లన:— ఇష్టపూర్తములలోఁ బూర్త విశేషమయినది కావ్యము. అది సర్వపాపహారమును నిత్య కీర్తికరమును నగును.

"కీర్తిం స్వర్గఫలాంప్రాహు రాసంసారం విపశ్చితః."

అని కీర్తి ప్రతిపాదింపఁబడినది.

"ఏకశ్శబ్ద స్సుప్రయుక్తస్సమ్యగ్జ్ఞాతస్స్వర్గేలోకే కామధుగ్భవతి."
"ఉపదిశతిహితార్థాన్ ప్రేయసీ సమ్మితాయా
శమయతిదురితౌఘం మంగళం చాతనోతి,
అభిముఖయతిదేవాన్ సత్కృతిశ్చార్థహేతు
ర్నయతిధనమశేషా నంకితాంశ్చ ప్రబంధ్వాన్."
"తటాకో ధన నిక్షేపో బ్రహ్మస్థాపనమేవ చ,
వనం శివాలయః కావ్యం సుపుత్రః స్వర్గదా నృణామ్.
ముక్తిదా స్సప్తసంతానామహాపాతకినామపి,
తారయంతి చ దుర్గేభ్యః పితౄ నుభయవంశజాన్."
"మహానదీ ప్రవిష్టాని రథ్యాంబూ నీవపావనాః,
కావ్యే. ష్వంకితనామాన స్వేష్వంతే మానవైర్నరాః."

అని శ్రుతిస్మృతిపురాణేతిహాసవచనాదులచే వర్ణింపఁబడినదియు,

వ్యాసాదులు ప్రవర్తించిన శిష్టాచారమైనదియుఁగానఁ గావ్యము సర్వోత్కృష్టము.

సూ. తదదోషౌపరిష్కృతౌ చ వాగర్థౌ. ౨.

టీక. అదోషౌ=అపార్థాదిదోషరహితములు, పరిష్కృతౌ చ=గుణాలంకారయుక్తములు నగు, వాగర్థౌ = శబ్దార్థములే, తత్=ఆకావ్యము, 'అదోషౌపరిష్కృతౌ' అను రెండువిశేషణము లెందుల కన

క. "క్షీరాబ్ధి సురాసురేంద్రులు
కాకోలాకములకడఁ గడుకుద్ధతులై
క్షీరధరంబు సల్పిరి..."

అను వాక్యము గుణాలంకారయుక్తమైనను నుపమాదోష సహితము కావునఁ గావ్యము కాదు.

క. "ప్రాతస్స్నానము సేయుచు
రాతతమతి సంధ్యవార్చి యౌపాసనముల్
సీతాపతి పూజయు సం
ప్రీతిగ నొనరుతురు పుణ్యచరిత్రద్విజుల్."

అను వాక్యము దోషరహితమైనను గుణాలంకారయుక్తము కాదు కానఁ గావ్యముకాదు.

సూ. సావాగ్యారసవృత్తిః. ౩.

టీక. యా=యేది, రసవృత్తిః=విభావాదిరూపములచే రసముల కాశ్రయమైయుండునో, సా=అది, వాక్ = శబ్దము.

సూ. సాధ్యోహిరసోయథాయథం కవిభిః. ౪.

టీక. శబ్దమనఁగా రసాశ్రయమైనవి. కనుక, యథాయథం=యేయేరూపములనైనను, కవిభిః=కవులచేత, రసః=రసము, సాధ్యోహి=సాధింపఁదగినదిగదా! యేయేరూపము లనఁగా సంస్కృతకావ్యములే కాక సకలజనవేద్యరసములైన భాషాకావ్యములును బాపహరములే యని ప్రథమసూత్రముతో నైకమత్యముఁ గల్పించుకొనునది. 'కవిభిఃసాధ్యః' అని విధిరూపప్రత్యయప్రయోగ మున్నది. కనుక యథోచితలక్షణకవికల్పితకావ్యమే పవిత్రమనుట.

"సత్కులీన శ్శుచిర్దక్ష శ్ఛందో వ్యాకరణాదివిత్,
ప్రశాంత స్సుభగాకారో దైవజ్ఞశ్చ కవిర్భవేత్."

అని యున్నది. కనుక నీలక్షణములు గల కవి పవిత్రుఁడు. తత్కావ్యమే పవిత్రమనుట. ఓయీ! కల్పనాసమర్థుఁడైనఁ జాలదా? అనరాదు.

"విభావకోభావితవస్తు వర్ణనః
ప్రభుః పురాణాగమశాస్త్రలోకదృక్
కవిః ప్రశస్తోజ్జ్వలవాక్ప్రయోగవి
త్ప్రమోదమాప్నోతి పరత్ర చేహ చ."

అని యున్నది. కనుక వాక్ప్రయోగదక్షుఁడునుగా నుండవలయు; అతఁ డుభయలోకపూజ్యుఁడుగాఁ జెప్పఁబడును. కులీనత్వాదిగుణము లేల యనరాదు.

"పశ్వాద్రస్య పచోగ్రాహ్యం శునోచ్ఛిష్టంహవిర్యథా,

అనునది మొదలగునిషేధము లున్నవిగాను గులీనత్వాదిలక్షణ వంతుఁడే కవి యని తెలియునది. రసస్థితిగలిగిన భాషాకావ్యము లును బవిత్రములనుట యెట్లు? దేశభాషలు శ్రుతినిషిద్ధములు. మ్లేచ్ఛనములు గదా! అయినను వానిని విడిచినయెడల వ్యవ హారహాని యగును గాన నవి యపరిహార్యము లని స్వస్థా నేత్యాదిసూత్రముతోఁ జెప్పుచున్నాఁడు.

(1. సూ.)

2. శ్లో. స్వస్థానవేషభాషాభి
మతాః స్సంతో రసప్రలుబ్ధధియః,
లోకే బహుమన్యంతే
వైకృతకావ్యాని చాన్యదపహాయ. ౫.

టీక. స్వ...తాః-స్వస్థాన=తమ దేశమండలి, వేషభాష= వేషభాషలయందు, అభిమతాః = ఇష్టముకలవారగు, సంతః= పెద్దలు, రసప్రలుబ్ధధియః - రస=రసమందు, ప్రలుబ్ధ=మిక్కిలి లోభపెట్టఁబడిన, ధియః=బుద్ధికలవారై, లోకే= లోకమందు, వైకృతకావ్యాని చ=దేశభాషాకావ్యములను సయితము, బహుమన్యంతే=బహుమానింతురు. మ్లేచ్ఛనము శ్రుతిగర్హిత మైనను నది విడిచిన లోకవ్యవహార హానియగుఁ గాన నపరి హార్యము. అందును భగవత్పరములు జ్ఞానపరములు సత్పురుష పరములును ధర్మప్రవృత్తిపరములు నైన రసవత్కావ్యములు రసబలముచేత బలవదిష్టానుబంధము లగుచున్నవి. బలవది ష్టానుబంధములైన నిషిద్ధములును గ్రాహ్యము లగును. ఎట్లన,

గ్రత్వార్థము గవాది ప్రతిగ్రహము, ధర్మార్థము కౌటసాక్ష్యాది కము, యాత్రార్థము కీకటదేశప్రవేశము మొదలగునవి గ్రాహ్యము లవుచున్నవి. భాషాస్వీకారము కౌటసాక్ష్యాదికము వలెఁ గేవల గర్హితమైనయెడఁ బ్రాకృతాది దేశభాషామిశ్రిత మైన రూపకకావ్యములను యుగయుగముల పెద్దలేల స్వీక రింతురు.

"దేశభాషాపురాణాని రచితాని చ మానుషైః,
శ్రుత్వా కావ్యేతిహాసాంశ్చ భయమాప్నోతి మానవః."

అను నిషేధవచనమునకుఁ దాత్పర్యము వేఱేయున్నది. స్వదేశవ్యతిరిక్తదేశభాషానిబద్ధములైన రామాయణభారత భాగవతాదులు జప్యబుద్ధిచేత నాచరింపరా దనుట. అనంతర సూత్రముచే నీయర్థము చెప్పుచున్నాఁడు. ("అన్యదపహాయ= ఇతర భాషాకావ్యాదికమును విడిచి") అపరిస్ఫుటార్థములైన యితరభాషలవలన ఫలము లేదు. పరిస్ఫుటార్థములైన స్వదేశ భాషాకావ్యములవలననే పురుషార్థము కలదు. కాన నాంధ్రు లకు నాంధ్రభాషాకావ్యములు గ్రాహ్యములు. 'కావ్యానిచ' అని చకారప్రయోగమువలనఁ బదపదార్థవిచారనిపుణులు సంస్కృతకావ్యములను నాచరింతురనుట. ఇటనుటచే సంస్కృ తమం దధికారానుభవము లేని స్త్రీశూద్రద్విజబంధువులకైన నిదే యావశ్యక మనుట.

(4. సూ.)

3. శ్లో. సిద్ధిర్లోకాద్ద్రష్టవ్యా,
లోకో ఽనన్యాదృశశ్చ నిత్యశ్చ.

సంస్కారార్హో నియమో,
ఽనియమాద్గ్రామ్యం హియ త్త్వపభ్రంశః.
——.

టీక. సిద్ధిః=ఆంధ్ర భాషాసిద్ధి, లోకాత్ = లోకవ్యవహారమువలన, దృశ్యా=చూడఁదగినదై ,వ్యవహారమూల మనుట. లోకః=లోకవ్యవహారము, అనన్యాదృశశ్చ=భిన్నప్రకారము కానిదియు, నిత్యశ్చ=నిత్యమైనదియు, ఎప్పటికిని భాషాకవిత్వములు కలవెయనుట. సంస్కారార్హో నియమః-నియమః = లక్షణము, సంస్కారార్హః = సంస్కారముకొఱకు, సలక్షణమైనది సంస్కారవంత మనుట. అనియమాత్ = లక్షణము లేనందున, గ్రామ్యమ్=గ్రామ్యమగును. యత్తు = ఏది గ్రామ్యమో యది యపభ్రంశ మనిపించుకొనును. అపభ్రంశము ప్రయోగయోగ్యము కాదు. కనుకఁ దద్వివేకముకొఱకు కీశాస్త్రమునఁ బ్రవర్తింపవలె ననుట. లక్షణము కలది గ్రామ్యము కాదు. లక్షణము లేనిది గ్రామ్యము.

ఇందుల కుదాహరణము:—

క. "హరిముఖ సురపాలులకుఁ
బరికింపఁగ రాని వెలుఁగు, పరమేశ మనో
వరహంసవరము, సంతత
కరుణాశుభాలోనఁగ శైలకన్యామాతన్."

ఇందు 'సురపాలులకును, వరము, శుభాలు, శైలకన్యా' అను నివి యుక్తలక్షణములు కావు. కనుక గ్రామ్యములు. ఇవి సలక్షణములైన సౌమ్యములు.

క. "హరిముఖ సురపాలురకుం
బరికింపఁగ రాని. వెలుఁగు పరమేశ మనో
వర హంససరసిసంతత
కరుణశుభము లొసఁగు శైలకన్యక మాకున్."

ఇట్లే గ్రామ్యసౌమ్య భేదములు తెలియునది.

(1. సూ.)

4. శ్లో. ఆద్యప్రకృతిః ప్రకృతి
శ్చాద్యే ఏషా తయోర్భవే ద్వికృతిః,
కేవలతయానుసర్ప
త్యుభేచ యేయం యథాయథం భాషా. ౧౨.

టీక. ఆద్యే=సంస్కృతప్రాకృతభాషలు, ఆద్యప్రకృతిః= ఆద్యప్రకృతియనియు, ప్రకృతిశ్చ = ప్రకృతియనియుఁ జెప్పఁబడును. ఏషాతు=ఈ యాంధ్రభాషయన్ననో, తయోః=ఆ రెంటికి, వికృతిః=వికృతి, భవేత్=అగును. యేయంభాషా=ఏయీయాంధ్రభాష, యథాయథం=యథేచ్ఛముగా, ఉభేచ=ఆ రెంటిని, కేవలతయా=ప్రత్యేకరూపము చేతను, అనుసర్పతి=అనుసరించుచున్నది. కొన్ని తెనుఁగుమాటలు సంస్కృతమునకే ప్రత్యేకముగాఁ దద్భవతత్సమములగును కొన్ని ప్రాకృతమునకుఁ దద్భవతత్సమములగును. ఉదాహరణము.సముద్రశబ్దమునకు సంద్రము. చంద్రశబ్దమునకుఁ జందురుఁడు. ఇవి మొదలైనవి. ఇవి ప్రాకృతమును మించి సంస్కృతమునకే తద్భవములైనవి. ప్రాకృతమునకన్ననో 'సముద్దము ఛందుడు' అని తద్భవములు కావలయును. కృష్ణుఁడు మొదలగునవి సంస్కృతమునకే తత్సమ

ములు—'లక్ష్మికి లచ్చి, ఖడ్గమునకు కగ్గము' మొదలగునవి ప్రాకృతమునకే తద్భవములు. సిరి, మట్టి మొదలగునవి ప్రాకృతమునకుఁ దత్సమములు. ఇటులనే ప్రాకృతభేదములైన శౌరసేన్యాదిభాషలకుఁ బ్రత్యేకముగాఁ దద్భవతత్సమము లగును. జూదము శౌరసేనీతద్భవము. జక్కులు మాగధీతద్భవము. గోనము పైశాచీతద్భవము. రాచకొలము చూళికాతద్భవము. మూఁగ యపభ్రంశతద్భవము. ఇట్లు తత్సమతద్భవములు తెలియునది. ('యథాతథమ్' అని కొన్ని మాతృకలలో నున్నది. ఎట్లయినను నర్థభేదము లేదు.)

(2. సూ.)

5. శ్లో. ఆద్యాయాః పంచాశ
ద్వర్ణాః ప్రకృతేస్తు తే దశోనాస్స్యుః. ౧౧
షట్త్రింశదత్ర తేఽన్యే
చానుప్రవిశంతి శబ్దయోగవశాత్. ౧౨

టీక. ఆద్యాయాః = సంస్కృతభాషకు, పంచాశద్వర్ణాః = ఏఁబదియక్షరములు, ప్రకృతేస్తు = ప్రాకృతమునకైన, తే = ఆయేఁబదివర్ణములును, దశోనాః = పదితక్కువ యైనవి, స్యుః = అగును. 'ఋ ౠ ఌ ౡ ఐ ఔ ఙ ఞ శ ష' అను నీపదివర్ణములు ప్రాకృతమున లేవనుట. అత్ర = ఈ తెనుఁగునందు, షట్త్రింశత్ = ముప్పదియాఱు (అక్షరములు). అన్యే = తక్కినవగు, తే చ = ఆపందొమ్మిదివర్ణములును, శబ్దయోగవశాత్ = తత్సమశబ్దయోగమువలన, అనుప్రవిశంతి = ప్రవేశించుచున్నవి. షణ్ముఖుఁడు, శరీరము, ఇత్యాదిస్థలములఁ దెలియునది.

(1. సూ.)

6. శ్లో. ద్వివిధాదిదుదేదోత్తోఽ
చో వక్రతమావనుస్వారౌ,
కగచజయుగటడణతదన
పబమయరలవసహాళం తు హాల్వర్గః. ౧౩.

టీక. అచః=అచ్చులు, ద్వివిధ=హ్రస్వదీర్ఘరూపములైన, అత్=అకారము, ఇత్ = ఇకారమును, ఉత్=ఉకారమును, ఏత్=ఎకారమును, ఓత్=ఒకారమును, (తెలుఁగున ఏఓ లకు హ్రస్వములు కలవు గాన నవియును రెండేసివిధములు) వక్రతమౌ=ఐఔలు,అనుస్వారౌ=పూర్ణఖండబిందువులును. (అనఁగా అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఒ ఓ ఐ ఔ అం అః ఈపదునాలుగు వర్ణములు నచ్చులు) కగ = కకారగకారములు, చజయుగ= చకార చే కార జకార జే కారములును, టడ......=టకార డకార ణకార తకార దకార నకార పకార బకార మకార యకార రేఫ లకార వకార సకార హాకార ళకారములును, హాల్వర్గః = హాల్లు లనిపించుకొనును. ఈ చెప్పిన యిరువది రెండువర్ణములకును హాల్ సంజ్ఞయనుట. చజయను వర్ణములు తెలుఁగునఁ దాలవ్యములు దంత్యములునని రెండువిధములు.

(2. సూ.)

7. శ్లో. సిద్ధస్సాధ్యశ్చైను
స్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః. ౧౪.
హ్రస్వాత్పూర్ణోఽపి భవే
ద్దీర్ఘాచ్ఛేత్ఖండ ఏవ స జ్ఞేయః. ౧౫.

టీక. సిద్ధః=సిద్ధము, సాధ్యశ్చ=సాధ్యముననియు, అను
స్వారః=సున్న, పూర్ణార్ధభేదతః=పూర్ణముఖండమునను భేదము
లచేత, ద్వివిధః=రెండువిధములు, శబ్దముతోఁబుట్టిన సున్న సిద్ధ
ము. అందలకు, చొందళము, ననునివి సిద్ధానుస్వారములు. నకా
రము చెడి సున్నయైనది. సాధ్యానుస్వారము. అలరుందావి, తలి
రుంబోఁడి, యనునివిసాధ్యానుస్వారములు. హ్రస్వాత్=లఘ్వ
క్షరమునకంటెఁ బరమైన, సః=అర్ధబిందువు, పూర్ణోపి = నెఱ
సున్నయు, భవేత్=అగును. పదంతి, ముద్దుఁగన్నియ యను
చోటులందలి యర్ధానుస్వారములు, లఘ్వక్షరపరములు కానఁ
బడంతి ముద్దుంగన్నియ యని పూర్ణములు నగును. సర్వత్రి
యిటువలెఁ దెలియునది. దీర్ఘాచ్చేత్=దీర్ఘపరమయ్యెనేని, ఖండ
ఏవ=అర్ధబిందువనియే, జ్ఞేయః=తెలియఁదగినది. 'వీఁక, దాఁక'
అనుచోటుల నర్ధబిందువే కాని పూర్ణబిందువు కాదు.

(1. సూ.)

౯. శ్లో. లఘవోలఘవశ్చేతి
ద్వేధాంతస్థాన్వదంతి శాస్త్రారః,
అన్యేన్యవ్యాకరణ
స్పష్టారస్తత్ర గృహ్యాతే ద్వివిధః. ౧౬.

టీక. శాస్త్రారః=శాస్త్రకర్తలు, లఘవః = లఘూచ్చారణ
ములు, అలఘవః=అలఘూచ్చారణములునని, ద్వేధా=రెండు
విధములుగా, అంతస్థాన్=యరలవలను, వదంతి=చెప్పుదురు.
అన్యే=యలవలుమూఁడును, అన్యవ్యాకరణస్పష్టాః=ఇతరవ్యా
కరణములయందు స్పష్టములు. (స్ఫుటములు) రస్తు=రవర్ణమైన,

అత్ర=ఈతెనుఁగువ్యాకరణమందు, ద్వివిధః = రెండువిధము లుగా, గృహ్యతే = గ్రహింపఁబడును. యరలవలు ద్వివిధములు. అందు యవలకు 'సూ. హలిసర్వేషామ్' అను పాణినీయసూత్రమున రెండువిధములును సూచితములయ్యె. లకారము 'లోళః' అను ప్రాకృతవ్యాకరణసూత్రమందు రెండువిధములయ్యెనని సూచితమయ్యెను. పరిశేషించిన రవర్ణ మాంధ్రవ్యాకరణమందు ద్వివిధమయ్యె ననుట.

(2. సూ.)

9. శ్లో. అద్యః క్రియాసు భూతార్థ
ద్యోతిత మాద్యగం వినాసర్వః, ౧౭.
యశ్రుతి మార్యా లఘుయం
ప్రవదంతి ప్రాణతః పరం ప్రాణమ్. ౧౮.

టీక. క్రియాసు = క్రియాపదములయందు, భూతార్థద్యోతితమ్=భూతార్థములఁ గనుపించునదియు, ఆద్యగమ్=నామాదినుండునదియు, వినా=వినాగా, సర్వః = సమస్తమైన, యః=యకారము, అత్=అకారము తలకట్టనుట. చనియె, వినియె నను నివి మొదలగు క్రియాభూతార్థస్థిత యకారములును, యెలమి యేమి యేలాగు యెచటికి యెంత యనునివి మొదలైన నామాది యకారములును వినాగా మిగిలిన యకారములన్నియుఁ దలకట్లుగాఁ దెలియునది. ప్రాణతః=అచ్చుకంటె, పరమ్=పరమైన, ప్రాణమ్=అచ్చును, యశ్రుతిమ్=యకారము వినఁబడు దానిఁగాను, లఘుయమ్ = లఘుయకారముగాను, ఆర్యాః= పెద్దలు, ప్రవదంతి=పలుకుదురు. హరియధికుఁడు, మాయేలిక, యనునివి మొదలైనవి లఘుయకారములు.

(3. సూ.)

10 శ్లో. నాన్యేషాం వైధర్మ్యం
లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్,
అస్త్యంత్యాస్తాలవ్యా శ్చ
స్వక్రస్యా న్మిథస్సవర్ణాశ్చ. ౧౯—౨౧.

టీక. లఘ్వలఘూనాం=లఘువులు,నలఘువులునగు, అన్యే షాంతు=ఇతరములైన యవలలకు, వైధర్మ్యం=విరోధము, న= లేదు. రయోస్తు = లఘ్వలఘువులైన రవర్ణములకు, నిత్యం స్యాత్ = నిత్యముగాఁ బరస్పరవిరోధము కలదు. విరోధ మనఁగాఁ బరస్పరము యతిప్రాసములు చెల్లకుండుట. ఎట్లన- యవలు ద్వివిధములు. అచ్చుమీఁది యచ్చునకు వచ్చినయకా రము లఘుయకారము. ప్రథమాంతముమీఁది పకారమున కాదేశముగా వచ్చిన వకారము లఘువకారము. లళలు ప్రసిద్ధములే. వీనికన్నింటికిని యథోచితముగా నుదాహ రణము.

సీ. "నీళ్లపాలును గలసిన ట్లెల్లప్రొద్దు
నా యహిభూషణుఁడు శివుఁ డాయకుంటుఁ
దనుచుఁ జెలికత్తె పలుక హిమాచలాత్మ
భవ ముఖాబ్జమువంచి సిగ్గుపడియుండె."

కొందఱు ద్వివిధవకారములకు వడిపట్టున మైత్రి లేదందురు.

ఇఁక రవర్ణోదాహరణము:—

గీ. "ఱెక్కలుగలట్టి పెనుపాపజేంద్రవంటి
కఱకుములుకుల శంభు నుక్కఱఁగఁ జేసి
పరమకల్యాణి గిరి కులేశ్వరతనూజ
రణ వినోదంబు సలిపె నిర్జరులువొగడ."

అద్దంత్యస్తాలవ్యశ్చుర్వక్రస్స్యా న్మిథస్సవర్ణశ్చ.

టీక. దంత్యః=దంత్యమైన, చుః=చవర్గువు, అత్=అకారము, తాలవ్యః=తాలవ్యమైనచవర్గువు, వక్రః = ఎకారము, స్యాత్=అగును. మిథస్సవర్ణశ్చ = దంత్యతాలవ్యములు రెండును బరస్పరము సవర్ణములు. చెందురుఁడు, చేక్కెర, జాణ, చెన్ను మొదలైనచోటులలోని దంత్యములు, తలకట్లుగలవి. జెంటచెలువ, జెట్టి జెట్టి మొదలైనశబ్దములలోని తాలవ్యము లెత్వములు గలవనుట.

ఇందుల కుదాహరణము:—

ఆ-వె. "చేక్కఁదనము లోక జయవైభవము వల,
రాచేవారు వడసి రాచరించి;
చెలువ నద్రికన్య సేవించువారికే
జొడనైనఁ గన నసాధ్యమెద్ది."

(6. సూ.)

11. శ్లో. ప్రాతిపదికం హి నామ
ప్రత్యయ ఇహ వర్ణకః క్రియా ధాతుః,

ప్రాణా స్సమాసతో౽చో
బిందు రనుస్వార ఏజథో వక్రః. ౨౭-౩౨.

టీక. ప్రాతిపదికం=శబ్దశాస్త్రప్రసిద్ధమైన ప్రాతిపదికము, నామ=నామమను సంజ్ఞకలదియగును. ఇహ=ఈయాంధ్రవ్యాకరణమందు, ప్రత్యయః=ప్రత్యయము, వర్ణకః = వర్ణకమనఁబడును. ధాతుః=ధాతువు, క్రియా=క్రియయనఁబడును. అచః=అచ్చులు, సమాసతః=సంగ్రహముచేత, ప్రాణాః=ప్రాణములనఁబడును. అనుస్వారః=సున్న, బిందుః=బిందువనఁబడును. ఏజ్=ఏకారౌకారములు, వక్రః=వక్రము లనఁబడును.

(సూ. 6.)

12, శ్లో. వక్రతమ ఐజ్ఝలస్స్యు
స్సమాసతః ప్రాణినో ద్రుతాఖ్యో నః,
కచటతపాః పరుషాఖ్యా
గజడదబాస్తు సరళాః స్థిరా ఇతరే. ౨౮-౩౩.

టీక. ఐచ్=ఐకారౌకారములు,వక్రతమః=వక్రతమము లనఁబడును. హలః=హల్లులు, సమాసతః = సంగ్రహముచేత, ప్రాణినః=ప్రాణి లనుపేరు కలవి, స్యుః=అగును. నః=నకారము, ద్రుతాఖ్యః=ద్రుతమనుపేరు కలదియగును. కచటతపాః= కచటతపలను వర్ణములు, పరుషాఖ్యాః = పరుషములను పేరుకలవియగును. గజడదబాః=గజడదబలనువర్ణములు, సరళాః=సరళములనఁబడును. ఇతరే=పరుషసరళవర్ణములు పదియువినాగాగొఁబడిన హల్లులన్నియు, స్థిరాః=స్థిరము లనఁబడును.

(4. సూ.)

13. శ్లో. ఇంద్రాద్యా అపి చ గణా
వలి రాద్య మనంత రాక్షరం ప్రాసః,
న పదా న్యవ్యయసు ప్తిజ్
క్త్వాతుమునామనుకృతేఽస్తి వాక్యం తు.
38—39.

టీక. గణాః= గణములు, ఇంద్రాద్యా అపిచ=ఇంద్ర చంద్ర సూర్యగణము లనునవియుఁ గలవు. ఆద్యమ్=మొదటియక్షరము,వళిః=వళియనఁబడును. అనంత రాక్షరమ్=రెండవ యక్షరము, ప్రాసః=ప్రాసమనఁబడును. అవ్యయసు ప్తిజ్ క్త్వాతుమునాం = అవ్యయమునకు, సుబంతమునకుఁ, దిజ న్తమునకును, క్త్వాప్రత్యయాంతమునకును, దుమున్ప్రత్యయాంతమునకును, పదాని = తత్సమపదములు, న= లేవు అనుకృతేతు=అనుకరించుచోటులయందైన, వాక్యమ్=వాక్యము, అస్తి=కలదు. వాక్యశబ్దము పదమునకు నుపలక్షణము. "ప్రాతః, హరిణా, రామేణ, భవతి, అస్తి, కృత్వా, గంతుమ్, రంతుమ్" అను ప్రయోగములు తెనుఁగున లేవు. వీనినే యనుకరించి ప్రయోగించినఁగలవు. అనుకరించుట యనఁగాఁ బదము లుచ్చరించిన తుద 'అని' అనుశబ్దముఁ బ్రయోగించుట. 'సాయమ్మని, హరిణా' యని, అనుశబ్దము లనుకారములని తాత్పర్యము. ఈ యవ్యయాదులైన యైదింటికి ననుకారముచేతఁ బ్రయోగమున కుదాహరణము.

శా. "మాతస్తే సతతం నమోయనుచు నంబ త్వాం భజేయంచు పందే తే పాదసరోజమంచుఁ బురత స్తిష్ఠత్వా మమ త్రాహి యం

చాతంతాన్ పకటాసిహస్త పసుచున్ హార్షంబుతోఁ బల్కుచున్
ఖ్యాతిన్ శ్రీప్రసపార్థముల్ పదసెదం గా నేపుగాత్యాయని."

(1. సూ.)

14. శ్లో. తిఙ్మధ్య శేషషష్ఠీ
సుప్కర్మ ప్రవచనీయజవిభక్తిః,
కించి త్ప్రశంప నాద్భుత
సంతాప యదా తదా కి మేవాంశ్చ. ౩౭.

15. శ్లో. క్త్వా కిల తూష్ణీ మాద్యా
నభిదధతి కళాద్రుతో న యేషాం స్యాత్,
ఆస్యే ద్రుత ప్రకృతయో
యే స్యు ర్హ్యనుజీవితద్రుతానిత్యమ్. ౩౮.

టీక. తిఙ్మధ్య=తిఙ్మధ్య క్రియలను, తిఙ్మధ్య క్రియలనఁగా హరించితివి, హరించితిరి, హరించిరి, హరించితిమి మొదలగునవి, శేషషష్ఠీ=హరియొక్క, రామునియొక్క యను శేషషష్ఠిని, సుప్=రాముఁడు రాములు నను ప్రథమైకవచన బహువచనములను, కర్మ ప్రవచనీయజవిభక్తిః= రాముఁగూర్చి, కృష్ణుఁ గూర్చియనుద్వితీయావిభక్తిని,కించిత్=ఇంచుక కాసంతయను కించిదర్థములను,ప్రశంసన=భళీ మజ్ఝా మొదలైన ప్రశంసార్థములను,అద్భుత=ఔరా యహో మొదలైనయద్భుతార్థకములను, సంతాప=అక్కటాయయ్యో మొదలైన సంతాపార్థకములను, యదాతదా=ఎప్పుడప్పు డనువానిని, కిమ్=ఏమి యనుదానిని, ఏవాంశ్చ = నిన్నే నన్నే యను నేవార్థములను, క్త్వా=హరించి భుజించి పఠించి యను క్త్వాప్రత్యయాంతములను, కిల=చేసె

నఁట యనుకీలార్థమును, తూష్ణీమ్=ఊరక మిన్నక మొద లైన తూష్ణీమర్థకములను, ఆదిశబ్దము చేతఁ బట్టి, కయి, యను విభక్తులను మఱి సుమ్ము కదా మొదలగు వానిని, కళాః= కళలనుగా, అభిదధతి=చెప్పుదురు. యేషాం=యేశబ్దములకుఁ బయిని, ద్రుతః=నకారము, నస్యాత్ = లేదో, పైనకారము లేనందున నవి గళా సంజ్ఞికములనుట. కూర్చిరి, కీర్తి, హారియొ క్క, చరణములు, శివుఁడు, కర్త యిత్యాదిశబ్దములు కళలు. వించున్నాఁడు, ఘటింపఁగలఁడు, చేనఁడు ననునవి తిఙ్మధ్యము లు గాకున్ననుఁ బ్రథమాసమాసములు గనుక సుప్పులో నివిగానే తెలియునది. సుప్ అనఁగా శాస్త్రవ్యవహారమునఁ బ్ర థమావిభక్తిపేరు. ఉఱక, సేయక యనునవి క్త్వాప్రత్యయార్థము లనియే తెలియునది. మఱియును బ్రాఁదెనుఁగున నేవేనియున్న చో నవి యాదిశబ్దమున్న దికనుకఁ గళా ప్రదేశములుగాఁ దెలి యునది. అన్యే=ఈ చెప్పినవానికన్న నితరము లెవ్వియో యవ న్నియు, ద్రుతప్రకృతయః= ద్రుతప్రకృతులనఁబడును. అనఁగాఁ దక్కినవన్నియు నకారాంతములుగాఁ దెలియునది. యే=యే శబ్దములు, నిత్యమ్=నిత్యమును, అనుజీవిత=అనువర్తించియు న్న, ద్రుతాః=నకారములుగలవి, స్యుః=అగునో, సూత్రప్రాప్త లచేత లోపములువచ్చినవచ్చునే కాని యవి పొల్లునకారము లతోఁగూడియుండునవే యనుట. వానిన్, నిన్నున్, హరికిన్ మొ.

(1. సూ.)

16. శ్లో. తజ్జా సమాచ దేశ్యా
గ్రామ్యా చేయం చతుర్విధా భవతి,

ప్రకృతిద్వయజా తజ్జా
తుల్యాతు సమా ప్రవాహినీ దేశ్యా. ౧౬.

టీక. ఇయం= ఈయాంధ్రభాష, తజ్జా=తద్భవమును, సమా=తత్సమమును, దేశ్యా=దేశీయమును, గ్రామ్యా=గ్రామ్యమునునని, చతుర్విధా=నాల్గువిధములు, భవతి=అగును. ప్రకృతిద్వయజా=సంస్కృత ప్రాకృతములఁబుట్టినది, తజ్జా=తద్భవాంధ్రము, తుల్యాతు=సంస్కృతప్రాకృతతుల్యమైనచో, సమా=తత్సమాంధ్రము. ప్రవాహినీ=లోకవ్యవహారసిద్ధమైనది, దేశ్యా=దేశీయము. 'అనియమా గ్రామ్యమ్' అని మొదటఁ జెప్పినాఁడుకనుక లక్ష్మవ్యాకరణాధికరణాన్య దృశతాదుష్టమైనది గ్రామ్యమని వాగనుశాసనులు తల్లక్షణమును జెప్పరైరి.

(1. సూ.)

17. శ్లో. విరళాన్ వేచోషాదికశబ్దాన్
ప్రవ్యాహరంతు శబ్దజ్ఞాః,
ఇహ తు ప్రవ్యాహార్యం
సంకేతితసుప్రసిద్ధమేవ పదమ్. ౧౭

టీక. శబ్దజ్ఞాః=శాబ్దికులు, విరళాన్=అప్రసిద్ధములైన, వేచోషాదికశబ్దాన్=వేచ, ఊష మొదలైనశబ్దములను, ప్రవ్యాహరంతు = ప్రయోగింతురు గాక. ఇహతు=ఈయాంధ్రమందన్ననో, సంకేతితసుప్రసిద్ధమ్=కవిసమయసిద్ధమును,సుప్రసిద్ధమునునైన, పదమేవ=శబ్దమే, ప్రవ్యాహార్యమ్=ప్రయోగింపఁదగినది. వేచ యనునది దుఃచవ్యాకే యనుధాతువునకు లోణ్మధ్యమపురుషబహువచనము. ఊషయనునది వసనివాసే యను

ధాతువునకు లోణ్మధ్యమపురుష బహువచనము. ఇవి మొదలైన శబ్దము లప్రయుక్తములని నిషేధించినను వేదమునఁ బ్రయోగింపఁబడినవి కాన నప్రయుక్తములు గావని మహాభాష్యములో 'అస్త్యప్రయుక్తః' అను వార్తికమువద్ద భాష్యకారులనియుండుటచే, నప్రసిద్ధములైనను సంస్కృతమునన్నైన యెడలఁ బ్రయోగింపవచ్చుఁగాని, యీ యాంధ్రమం దప్రసిద్ధములను బ్రయోగింపరాదు. ఇట్లనుటచేఁ బ్రయోగసిద్ధము గ్రామ్యమైనను యోగ్యమే యని వాగనుశాసనులవివక్ష.

ఇతి శ్రీసకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాంధ్ర
శబ్దచింతామణౌ సంజ్ఞాపరిచ్ఛేదస్సమాప్తః.

శా. బ్రహ్మారణ్యకముండకాద్యుపనిషత్ప్రద్మాటవీహంస యా
బ్రహ్మస్తంబచరాచరప్రకరయంత్రన్యాసవిక్షేపణా
జిహ్మక్రీడనసూత్రధార పిశితాశివ్రాతభీతామరా
బ్రహ్మణ్యాసహమానమానస పరబ్రహ్మస్వరూపాకృతీ.

గద్య. ఇది సకలకవితాస్వతంత్రభట్టారక యెలకూచి బాలసరస్వతీమహోపాధ్యాయప్రణీతం బైనశబ్దానుశాసన టీకాగ్రంథంబునందు
సంజ్ఞాపరిచ్ఛేదము సమాప్తము.



# సంధిపరిచ్ఛేదము.

—•—

(౯. సూ.)

18. శ్లో. సంధిర్నాచోఽచ్యనుతో
వాతోఽనాదిషు విభక్తిషూతో వా,
నిత్యమనుత్తమపురుషక్రియా
స్వితః పరిమితౌ సమస్తానామ్.

సూ. సంధిర్నాచోఽచ్యనుతః ౧.

టీక. అనుతః=ఉకారాంతముకాని, అచః = అచ్చునకు, అచిపరే=అచ్చుపరమౌచుండఁగా, సంధిః=సంధి, న=లేదు.

'యశ్రుతిమార్యా లఘుయం ప్రవదంతి ప్రాణతః పరం ప్రాణమ్' అను సూత్రముచేత నచ్చునకు యకారమువచ్చును. ఉ. హరియతఁడు, మేనయత్త, చిన్నియన్న, వన్నెయొల్లె. రోయీవి, మైయొరపు.

'అనుతః' అని పర్యుదాసచేయుటచేత నుకారమునకు సంధి కలదు. రాముఁ డతఁడు, గురుఁ డీశ్వరుఁడు, ఇంపగు, సొంపగు.

సూ. వాతః. ౨.

టీక. అతః = అకారమునకు, వా = వికల్పముగా సంధి గలదు. అకారమునకుఁ బూర్వసూత్రమున సంధి రాకపోఁగా

వికల్పించినాఁడు. ఉ. లెస్సయగు, లెస్సగు. మేనల్లుఁడు, మేన యల్లుఁడు.

సూ. అనాదిషు విభక్తిషూతో వా. 3

టీక. అనాదిషు=ప్రథమావ్యతిరిక్తములైన, విభక్తిషు= విభక్తులయందలి, ఉతః = ఉకారమునకు, వా=వికల్పముగా సంధి కలదు. ఉ. మాకొఱకిచ్చు, మాకొఱకునిచ్చు. మమ్మేలు, మమ్మునేలు. నీ కారోగ్యము, నీకు నారోగ్యము. కీర్తియం దనురక్తి, కీర్తియందు ననురక్తి. ద్రుతప్రకృతికములు గాన నకారము నిలిచినది. ప్రథమయందైన 'హరుఁడధికుఁడు, హరి హరులాద్యులు' అని సంధివచ్చుచున్నది. ఇవి ద్రుతప్రకృతులు కావు గనుక నకారములేదు.

సూ. నిత్య మనుత్తమపురుషక్రియా స్వితః. ४

టీక. అనుత్తమపురుషక్రియాసు=ఉత్తమపురుష వ్యతి రిక్తములైన క్రియలందలి, ఇతః=ఇకారమునకు, నిత్యమ్=నిత్య ముగా సంధి కలదు.

ఉ. చెల్లి రసురులు, వ్రోచి రమరులు, పెట్టితి వన్నము, హరించితి వఘము. ఉత్తమపురుషమునకైనఁ గొలిచితినంబను. విడిచితి మన్యులను, గెలిచితి మరులను, ఇవి కిమాదుల లోనివి కనుకఁ బ్రాయోగ్రహణమున నంతటను సంధిలేదు.

సూ. పరిమితౌ సమస్తానామ్. ౫

టీక. సమస్తానామ్(అచామ్)= సమస్తమైన యచ్చులకు,

పరిమితౌ=పరిమాణార్థకముపరమైన, నిత్యముగా సంధికలదు. ఉ. వారెఁడు, ప్రస్థెఁడు, మానెఁడు, తూమెఁడు, గంపెఁడేసి, కాసంత, ఇసుమంత, గ్రద్దంత, గంపంత.

(4. సూ.)

19. శ్లో. న స్యా త్తద్ధర్మోత

శ్చో ర్వాస్యా ద్వర్తమానవిహితస్య,

తద్వ త్తదాద్యిజస్య

ప్రాయస్తు స్యా త్క్వామాదికస్యేతః.

సూ. నస్యా త్తద్ధర్మోతః. ౬

టీక. తద్ధర్మోతః = తద్ధర్మక్రియలయందుండు నుకారము నకు, నస్యాత్ = సంధిలేదు ఉ. రక్షించు నంబ, పోషించు నీశ్వరి.

సూ. చోర్వా స్యా ద్వర్తమానవిహితస్య ౭

టీక. వర్తమానవిహితస్య = వర్తమానార్థమందుండు, చోః=చువర్ణముయొక్క, ఉతః=ఉకారమునకు, వా = వికల్పముగా సంధికలుఁగును. ఉ. అను చిట్లనియె, అనుచు నిట్లనియె. నగు చిట్లనియె, నగుచు నిట్లనియె.

సూ. తద్వ త్తదాదిజస్య. ౮

టీక. తదాదిజస్య=తదాదిగణమందుఁబుట్టిన, ఇతః=ఇకారమునకు, తద్వత్ = చువర్ణమునకువలెనే, వికల్పమున సంధి

కలసం. అదెపుడు, అది యెపుడు. అదెవ్వరు, అవి యెవ్వరు. ఇదేమి, ఇది యేమి.

సూ. ప్రాయస్తు స్యా త్కిమాదికస్యేతః. ౯

టీక. కిమాదికస్య=కిమాదిగణముయొక్క, ఇతస్తు=ఇకారమునకైన, ప్రాయః=తఱచుగా, స్యాత్ = సంధియగును.

ఏమేమి, ఏమందు, ఏమయ్య 'ప్రాయః' అనినాఁడు కాన, 'ఏమియందు, ఏమియయ్య' అనియు నుండును.

(తె. సూ.)

20. శ్లో. అపిశబ్దార్థ స్యేత శ్చౌ రే
రుపధాత్మనశ్చ లుగ్వా స్యాత్,
శత్రర్థే తూతశ్చౌ నో
స్తస్య స్యాచ్చ పూర్ణబిందురపి.

సూ. అపిశబ్దార్థస్యేతః. ౧౦

టీక. అపిశబ్దార్థస్య = అపిశబ్దార్థమును జెప్పునట్టి పదముయొక్క, ఇతః=ఇకారమునకు వికల్పముగా లోపమువచ్చును. ఉ. హరినే నబ్జజనేని, హరినేని యబ్జజనేని, హరునే నంబనేని, హరునేని యంబనేని.

సూ. చౌ రే రుపధాత్మనశ్చ లుగ్వా స్యాత్. ౧౧

టీక. ఉపధాత్మనః=ఉపధారూపమైన, రేః = రేఫముయొక్క ఇకారమునకు, చౌ=చివర్ణము పరమగుచుండఁగా,

లుగ్వాస్యాత్=లోపము వికల్పమువవచ్చును. కొనయత్వరా నకు ముందుండునక్షర ముపధ. ఉ. కూర్చి, కూరిచి. చేర్చి, చేరిచి. అమర్చి, అమరిచి. తనర్చి, తనరిచి.

సూ. శత్రర్థే తూతశ్చో నోస్తస్య స్యాచ్చ పూర్ణబిందు రపి. ౧౨.

టీక. శత్రర్థే=వర్తమానార్థమందు వచ్చినట్టి, చౌ=చువర్ణము పరమౌచుండఁగా, నోః=నువర్ణముయొక్క, ఉతః=ఉకారమునకు వికల్పముగా లోపమువచ్చును. తస్య చ=ఆనకారమునకును, పూర్ణబిందురపి = పూర్ణానుస్వారమును, స్యాత్= వికల్పముగా నగును. ఉ. అంచు, అన్చు, అనుచు. వించు, విన్చు, వినుచు. అపిశబ్దగ్రహణముచేతఁ గొన్నిచోటుల రాదు. చనుచు, ఎన్నుచు, పూనుచు, మొ.

(౩. సూ.)

21. శ్లో. శబ్దా త్తచ్ఛబ్దాతః
ప్రోశ్చతదాద్యర్థవాచకేషూతః,
ప్రథమాపై భక్తికమో
ర్బిందుశ్చ మహాః పతిక్రియార్థేషు.

సూ. శబ్దా త్తచ్ఛబ్దాతః. ౧౩

టీక. శబ్దాత్ = శబ్దముమీఁదనుండునట్టి, తచ్ఛబ్దాతః= తచ్ఛబ్దసంబంధమైన 'అ'కారమునకు వికల్పమున లోపము వచ్చును. ఉ. బాపనది, బాపన యది. కోమటిది, కోమటియది.

సూ. ప్రోశ్చ తదాద్యర్థవాచకే షూతః. ౧౪.

టీక. తదాద్యర్థవాచకేషు=తదాద్యర్థములను జెప్పెడు శబ్దములయందలి, పోః = పువర్ణముయొక్క, ఉతః=ఉకారమునకు వికల్పముగ లోపమువచ్చును. ఉ. అపుడు,అప్డు. ఇపుడు, ఇప్డు.

సూ. ప్రథమావైభక్తికమోర్బిందుశ్చ
మహాఙ్ పతిక్రియార్థేషు. ౧౫

టీక. పత్తగతౌ యనుధాతువు నర్థముఁ జెప్పు శబ్దము పరమౌచుండఁగా, ప్ర... మోః=ప్రథమావిభక్తిసంబంధమైన మువర్ణమునకు వికల్పముగ లోపము వచ్చును. లోపము రాని పక్షమందు,మహాఙ్బిందుశ్చ=పూర్ణబిందువునువచ్చును.చకార గ్రహణమువలన బిందువు వికల్పమని తెలియునది. భయము పడి, భయపడి, భయంపడి.

(4. సూ.)

22. శ్లో. షష్ఠ్యా ఉతోఽచి నుమ్సే
చాద్యస్యామే ్రేడితేఽంత్యలోపశ్చ,
అహమాదీనాం ద్విత్వం
లోపో నమఆదికే విసర్గస్య.

సూ. షష్ఠ్యా ఉతోఽచి నుమ్సే చ ౧౬

టీక. సే = సమాసమందు (ప్రాకృతవ్యవహారము) షష్ఠ్యాః=షష్ఠ్యంతముయొక్క, ఉతః = ఉకారమునకు, అచి = అచ్చుపరమగుచుండఁగా,నుమ్=నుమాగమము వచ్చును. ఆగ

మాదేశాదిలక్షణములు శబ్దశాస్త్రవ్యవహారమున నే తెలియు నది. 'అను_క్రమన్యవత్' అనెడి ప్రాకృతన్యాయమునను, 'అను_క్రమన్యతో గ్రాహ్యామ్' అనెడి శాస్త్రముచేతను, నుమ్ములోని యుకారమకారములకు శబ్దసూత్రములచేత లోపము చేయు నది. ఉ. మోముకంనను, రాజునెదుట, పాము నెమ్ములు, శివు నాజ్ఞ.

సూ. ఆద్య స్యామ్రేడితేఽన్త్యలోపశ్చ. ౧౭

టీక. ఆమ్రేడితమనఁగా రెండుమారు లుచ్చరించు శబ్దము. దానియందు, ఆద్యస్య=మొదటిశబ్దమునకు, అంత్య లోపశ్చ=అంత్యలోపమునుగలుగును. ఉ. అన్నన్న, ఏమేమి, ఓహోహో.

సూ. అహమాదీనాం ద్విత్వమ్. ౧౮

టీక. 'అహమ్' అనునది మొదలైనశబ్దము లనుకరించు నపుడు వానియంత్యమునకు ద్విత్వము వచ్చును. సున్నకు ద్విత్వము రానేరదు కాన మకారము చేసికొనునది. ఉ. అహ మ్మని, కిమ్మని, రఘుమ్మని.

సూ. లోపో నమఆదికే విసర్గస్య. ౧౯

టీక. నమఆదికే=నమశ్శబ్దము మొదలైనశబ్దములయం దలి, విసర్గస్య=విసర్గమునకు, లోపః = లోపమువచ్చును. ఉ. నమోనమ యని, ధర్మస్సహాయ యని.

"నమశ్శబ్ద విసర్గస్య లోప ఓత్వం విధీయతే" అను సధర్వణాచార్యసూత్రముచే నమశ్శబ్దవిసర్గమునకు లోపము నోత్వమును విధించుకొనిన, నమోనమ యనుచు మ్రొక్కి, వేదవేద్యాయ నమో యనుచు నిత్యాది ప్రయోగములు సిద్ధించును.

(2. సూ.)

23. శ్లో. పరుషా ద్రుతప్రకృతికా
త్సరళా స్స్యుస్తద్ద్రుతం చ బిందుస్స్యాత్,
అవికారగతే తస్మిన్నపి
సరళా ఏవ సంతి తే పరతః.

సూ. పరుషా ద్రుతప్రకృతికా త్సరళా స్స్యుస్త
ద్ద్రుతం చ బిందుస్స్యాత్. ౨౦

టీక. ద్రుతప్రకృతికాత్ = ద్రుతప్రకృతికము మీఁద నుండునట్టి, పరుషాః = కచటతపలు, సరళాః = గజడదబలు, స్యుః=అగును, తద్ద్రుతం చ=ఆద్రుతప్రకృతికము యొక్క నకారము, బిందుస్స్యాత్ =బిందువగును. ఉ. వారుఁగొలిచి, వారుంగొలిచి. దీర్ఘపరమైనచో నర్ధబిందువు మాత్రమగును. నేఁగొలిచితి, తాఁగొలిచె.

సూ. అవికారగతే తస్మిన్నపి సరళా ఏవ సంతి తే పరతః. ౨౧

టీక. తస్మిన్నపి = ఆద్రుతమును, అవికారగతేసతి=బింద్వాదివికారమును పొందకపోవుచుండఁగా, తే=ఆపరుషవర్ణములు, పరతః = పరమందున్నపుడు, సరళా ఏవ=గజడదబలే

యగును. ఉ. అంబన్ గొలిచెద. శుభమున్ బడసెద. నిన్ గని యెద, తన్ గొలుతును.

(2. సూ.)

24. శ్లో. గసడదవా స్స్యుః ప్రథమా
మాత్రా దాత్మాస్మదో ర్వినై వైతే,
న వికృతి శబ్దాత్పరత
స్సాంస్కృతికానాం భవంతి గసడదవాః.

సూ. గసడదవాస్స్యుః ప్రథమామాత్రాదాత్మాస్మదోర్వినై వైతే. ౨౨

టీక. ప్రథమామాత్రాత్=ప్రథమావిభక్తిమీఁదనుండునట్టి, ఏతేఏవ=ఈపరుషములే, ఆత్మాస్మదోర్వినా = ఆత్మ(న్) శబ్దాస్మచ్ఛబ్దములకువినాఁగ,గసడదవాః స్యుః=గసడదవలగును. ఉ.సిరిగలవాఁడు దానముసేయును. సత్యవాది నిజమువల్కును. అతఁడు గనెను, వాఁడు సనెను, నీవు డక్కరివి, మనము దనరెను. పోలఁతి వలికెను. 'ప్రథమామాత్రాత్'అన్నందున ప్రథమాసమాసముల మీఁదను వచ్చును. అపుడు గనుపించె, ఇపుడు దా వచ్చె. ఇత్యాది. ఆత్మాస్మచ్ఛబ్దములకు లేదు. తాఁ జేసినపని, నేఁజేసినచోటు. ఇట గసడదవలు రావు.

సూ న వికృతిశబ్దాత్పరతః సాంస్కృతికానాం భవంతి గసడదవాః. ౨3

టీక. వికృతిశబ్దాత్పరతః= వికృతిశబ్దముమీఁద నుండునట్టి, సాంస్కృతికానాం=సంస్కృతసంబంధములైన కచటతప

లకు, గసడదవాః=గసడదవలు, న భవంతి=కావు. ఉ. దొర కరుణించె. సిరి చంచలము. మాయయ్యకుంకాయుధుఁడు. మీవేల్పు త్రోయాధిపతి. ఆవేల్పు పరబ్రహ్మము.

(౩. సూ.)

25. శ్లో. లుగ్వా ద్రుతప్రకృతికా
త్వరత స్సరళే స్థిరే చ నస్య స్యాత్,
అలుకి చ సంశ్లేష స్స్యా
ద్బిందుం ప్రవదంతి తం క్వచిత్కేచిత్.

సూ. లుగ్వా ద్రుతప్రకృతికాత్పరతః సరళే
స్థిరే చ నస్య స్యాత్. ౨౮

టీక. ద్రుతప్రకృతికాత్=ద్రుతప్రకృతికముకంటె, పరతః=పరముగా, సరళేచ=గజడదబలైనను, స్థిరేచ=యకారాద్యక్షరమైనను నున్నయెడల, నస్య=నకారమునకు, లుక్=లోపము, వా = వికల్పముగా వచ్చును. ఉ. కాంచె బావ. రక్షించె మాధవుఁడు. కొల్తు గదాధరు. పల్కెదు సత్యము.

సూ. అలుకి చ సంశ్లేషస్స్యాత్. ౨౯

టీక. అలుకిచ = లోపము లేనిపక్షమందు, సంశ్లేషః= పూర్వవర్ణముతో సంయోగము, స్యాత్ = అగును. ఉ. కాంచెన్బావ. రక్షించెన్మాధవుఁడు.

సూ. బిందుం ప్రవదంతి తం క్వచిత్కేచిత్. ౩౦

టీక. తమ్=ఆ ఆకారమును, కేచిత్=కొందఱు, క్వచిత్=ఒకానొకచోట, బిందుం ప్రవదంతి=బిందువును గా బల్కు దురు. ఉ. కాంచెంబావ. మెచ్చెం మాధవుఁడు. ఈమతము కేచిత్పక్షము కనుకఁ బ్రయోగము లేదు.

(ఆ. సూ)

26. శ్లో. సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం
యస్య ద్రుతప్రకృతికేభ్యః,
లుక్సంశ్లేషౌ నాపి
ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు.

సూ. సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య
ద్రుతప్రకృతికేభ్యః ౨౭

టీక. ద్రుతప్రకృతికేభ్యః = ద్రుతప్రకృతికములమీఁద నుండునట్టి, యస్య=యకారమునకు,సర్వత్ర=అంతటను,అజ్వత్=అచ్చునకు బలె,కార్యమ్=కార్యము,జ్ఞేయమ్=తెలియఁదగినది. అనఁగా లుక్సంశ్లేషములు లేవనుట. ఉ. కలిగెనెమ్మె, సిరినెద. ఈలాగుననే కాని'కలిగెన్యెమ్మె,కలిగెయెమ్మె.'అని సంశ్లేషము కాని, లోపము కాని లేదాయెను. ఇచ్చట నాద్యగము కనుక యెత్వమువచ్చినది.యెత్వము రాఁజెప్పనేల? అజ్వత్కార్యము వచ్చుననేల!అదియందచ్చే కాని యకారము లేదనినఁ జాలదా యనరాదు. ప్రయోజనాంతరము లేకున్నను, నుచ్చారణ విరోధ మాచున్నది కాన యెకారమె కాని 'ఎ'కారము కానేరదు.

సూ. లుక్సంశ్లేషౌ నాచి. ౨౮

టీక. అచి = అచ్చుపరమగుచుండఁగా, లుక్సంశ్లేషౌ= లోపపూర్వవర్ణసంయోగములు, న= లేవు. ఉ. పలికె నెవ్వఁడు, వచ్చె నతఁడు, భజింతు నంబను.

సూ. ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు. ౨౯

టీక. సర్వత్ర = సకలనామములయందు, సమాసేషు= సమాసములందు, ద్రుతస్య = ద్రుతమునకు, లుక్ = లోపము వచ్చును. ఉ. మోముచందురుఁడు. విరిగల్వ. కవినేర్పు. చిల్కపల్కులు. రాముని యాకృతి. తెల్లదమ్మి.

(త్రి. సూ.)

27. శ్లో॥ నుమ్మోరుతః పరుణాం
గసడదవాస్స్యుః పదాద్వయోర్ద్వే,
సామానాధికరణ్యే
ష్వాదంతానాం టుగాగమోఽచి స్యాత్.

సూ. నుమ్మోరుతః. ౩౦

టీక. ఉతః = ఉకారమునకు, నుమ్ము = సమాసమందు నుమాగమము వచ్చును. సంస్కృతవ్యాకరణసూత్రప్రాప్తి చేత మకారమును, నకారోపరియుకారమును లోపించును. ఉ. చిగురుఁగైదువు, చిగురుంగైదువు, చిగురున్గైదువు. పువ్వుఁబోణి. పువ్వుంబోణి, పువ్వున్బోణి.

సూ. పరుషాణాం గసడదవాః స్యుః పదాద్ద్వంద్వే. ౩౧

టీక. ద్వంద్వే=ద్వంద్వసమాసమందు, పదాత్=పూర్వపదమువలనుండునట్టి, పరుషాణాం=పరుషములకు, గసడదవాః=గసడదవలు, స్యుః=అగును. ఉ. కూడుగుడ్డలు అక్కసెల్లెండ్రు. తల్లిదండ్రులు. ఊరువల్లెలు.

సూ. సామానాధికరణ్యే షూదంతానాం
టుగాగమోఽచి స్యాత్. ౩౨

టీక. సామానాధికరణ్యేషు=కర్మధారయములయందు, ఉదంతానాం=ఉదంతశబ్దములకు, అచి=అచ్చుపర మౌచుండఁగా, టుగాగమస్స్యాత్ = టుగాగమము వచ్చును. 'టుక్' అనెడునాగమము వచ్చుననుట. 'శత్రువదాదేశః, మిత్రవదాగమః' అనువవియాదేశాగమముల లక్షణములు. టుక్కున నుకార కకారములు శబ్దసూత్రప్రాప్తిచే లోపించినయెడ నంత్యమునందుఁ బొల్లుటకారము నిల్చును. చిగురుటాకులు, కఱకుటమ్ములు. బహుళవచనజ్ఞాపకమువలన సమాసాంతరము లందును గలదు. వేల్పుటావు, కప్పురపు టనంటులు.

(లే. సూ.)

28. శ్లో. దారార్థేత ఉదపి రో
మోస్తు విభక్త్యేకవచనకే పుంపూ,
ప్రథమలుగపి ద్విసులో
రిచ్ఛ విభక్త్యంతిమస్య జేరలి చ.

సూ. దారార్థేత ఉదపి రః. ౩౩

టీక. దారార్థే=పత్నీవాచకపదము (ఆలుశబ్దము)పరమై యుండఁగా, అతః=అకారాంతపదముయొక్క అకారమునకు, ఉదపి=ఉకారమును వచ్చును, రః = దానిమీఁద రవర్ణము వచ్చును. 'సామానాధికరణ్యేషు' అనునది యనువర్తించును. ఉ. ధీరురాలు, శూరురాలు. అపిశబ్దగ్రహణమువలన నుకారము కొన్నిచోటులరాదు. పేదరాలు.

సూ. మోస్తు విభక్త్యేకవచనకే పుంపూ. ౩౪.

టీక. విభక్త్యేకవచనకే=ప్రథమావిభక్త్యేకవచన మందలి, మోస్తు = మువర్ణకమునకు సామానాధికరణ్యమున; 'పు' అనునదియుఁ, బూర్ణబిందుయుక్తమైన 'పు' అనునదియునాగమములుగ వచ్చును. ఉ. కనకపుబొమ్మ. కపురంపుఘుటిక. సరసపుపలుకు, సరసంపుపలుకు.

సూ. ప్రథమలుగపి ద్విసులోర్వోః. ౩౫.

టీక. ద్విసులోర్వోః=ద్విత్వమునుఁ బొందినట్టి నువర్ణముయొక్కయు లువర్ణముయొక్కయు, ప్రథమలుగపి=ద్విత్వమునందలి మొదలిదానికి వికల్పముగ లోపమువచ్చును. ఈలోపము సమాసమందని తెలియునది. ఉ. కన్నుఁదమ్మి, కనుఁదమ్మి. చన్నుదోయి. చనుదోయి, కల్లుకుండ, కలుకుండ. ముల్లుకంప, ములుకంప.

సూ. ఇచ్ఛ విభక్త్యంతిమస్య. ౩౬.

టీక. విభక్త్యంతిమస్య = విభక్తియొక్క తుది ఆకార మునకు, ఇచ్చ=సమాసమం దికారము నిత్యముగ వచ్చును. ఉ. నీచేతి ప్రోపు, నాతోడివారు, తనవలనిబింకము.

సూ. జేరలి చ. ౩౭.

టీక. జేః=సప్తమికి, అలిచ=అలియను నాగమమువచ్చును. ఉ. నీయందలికరుణ మాయందలివిద్య. ఇది సమాసమునందే నిత్యముగా వచ్చునని తెలియునది.

(1. సూ.)

2. శ్లో ఔపవిభక్తికసంజ్ఞా
వర్ణాష్టిం ట్యాదయో భవంతీహ,
రుల్వాదేర్నామ్నాం స్యు
స్తే హి విభక్తౌ సమాసే చ. ౩౮.

టీక. ఇహ=ఈయాంధ్రమందు, ఔపవిభక్తికసంజ్ఞాః= ఔపవిభక్తికము లనుపేరుగల, వర్ణాః=వర్ణములు, టింట్యా దయః=టి ంటి మొదలైనవి, భవంతి=అగును. ఆదిశబ్దముచేత తి ్తి మొదలైనవానికి గ్రహణము. సమాసే చ=సమాస మందును, విభక్తౌ=విభక్తి పరమౌచుండఁగాను, తేహి = ఆ టి ంట్యాదులును, రుల్వాదేః = రులుమున్నగునవి తుదినిగల, నామ్నాం=శబ్దములకు, స్యుః=వచ్చును. కొన్నిచోట్ల సమాస విభక్తులు రెంటియందును వచ్చును. ఉ. గోటిమొన, గోరు మొన,ఏటికాల్వ, వింటినారి, వింటిచేత, నేతిముంత, మిత్తిచేను. ఆదిశబ్దముచేత మఱియుఁ గొన్నిచోటుల వచ్చును. తాడు,

కూడు, నెయ్యి, అంబలి మొ. తాటిమట్ట. దీనికి విభక్తియందు లేదు. సమాసమందుఁగలదు. కూటికుండ, నేతిముంత, అంబటి కడవ. 'వేమునకు వేపచెట్టు. పాముసకు పాపతేఁడు' ఇత్యాద్యా కృతిగణమును జూచుకొనునది. రులాద్యుదులకుఁ గొన్నిచోట్ల రావు. 'పైరుజొంపము, కల్లుకుండ, ఎన్నుగంట' ఇత్యాదులు చూఁచుకొనునది. ఔపవిభక్తికవర్ణములు గలవన్నియు నౌప విభక్తికశబ్దములు.

(4. సూ.)

30. శ్లో. వాత్మాస్మదో ర్ద్రుతస్య
స్యాల్లు గ్వాక్యాంతగతపదానాం చ,
నలడాదే రంతరుత
శ్చాన్యేషాం చ ప్రయోగమహితానామ్.

సూ॥ వాత్మాస్మదో ర్ద్రుతస్య స్యాల్లుక్. ౩౯.

టీక. ఆత్మాస్మదోః= ఆత్మ(న్) శబ్దాస్మచ్ఛబ్దములయొక్క, ద్రుతస్య=నకారమునకు, లుక్=లోపము, వా స్యాత్=వికల్పముగా వచ్చును. ఉ. తా ఘనుఁడు, తాను ఘనుఁడు. నే వింటి, నేను వింటి.

సూ. వాక్యాంతగతపదానాం చ. ౪౦.

టీక. సీసాదిపద్యములచరణములు వాక్యములు. వాని యందు శబ్దములయొక్క ద్రుతమునకు లోపము కలదు. 'కానసయ్యెన్' అనుతావున 'కానసయ్యె' అని నిల్చును. ఈవిధి చరణాంతములయందని తెలియునది.

ఉ. 'ఘుమఘుమితమ్మైన కోనఁ గనియె' 'లీనఫణియగు నశ్కాన కాననయ్యె' 'అలరె నెత్తావికేళీవనాగ్రసీమ' అని యిట్లు నిల్చును.

సూ. నలడాదే రంతరుతశ్చ. ౭౧.

టీక. అంతః = శబ్దమధ్యమందలి, నలడాదేః = న ల డ మొదలైన వర్ణములయొక్క, ఉతః=ఉకారమునకు లోపము వికల్పముగవచ్చును. ఉ. వెనుక, వెన్క. చిలుక, చిల్క. గాడుపు, గాడ్పు. ఈడుపు, ఈడ్పు. ఆదిశబ్దముచేత రేఫాదులకు నుల్లోపమని తెలియునది. ఎట్లన, కారుపోతు, కార్పోతు. గోరుపులి, గోర్పులి.

సూ. అన్యేషాం చ ప్రయోగమహితానామ్. ౭౨.

టీక. ప్రయోగమహితానాం = ప్రయోగసిద్ధములైన, అన్యేషాం చ = మఱికొన్ని శబ్దములయొక్క యుకారాదులకును వికల్పముగ లోపము వచ్చును.

ఉ. కప్రము, అబ్రము, ఉంగ్రము. ప్రయోగమహితములకన్నందున నుత్వములకును బ్రయోగసిద్ధమైన గాని లేదనుట. ఉ. యేనుఁగు. అడుసు.

ఇతి శ్రీసకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాంధ్ర శబ్దచింతామణౌ సంధిపరిచ్ఛేద స్సమాప్తః.

శా. క్లీంకారాక్షరరూపిణీ పతజన క్లేశౌఘసంకావళీ
పంకేజాతసుహృద్ఘనాతపసదృశ్యాపదాక్ష శర్వాన్నిరా

తంకాతుర్యార్జితభోగమోక్షజనకోదంచన్మహామాయికా
హ్రీంకారాక్షరహేమసౌధచరి బ్రహ్మేంద్రాదిదేవార్చితా.

ఇది శ్రీసకలకవితాస్వతంత్రభట్టారక యెలకూచి బాలసరస్వతికవి
మహోపాధ్యాయప్రణీతం బైన శబ్దానుశాసనటీకా
గ్రంథమునందు సంధిపరిచ్ఛేదము.

---

# అజంత పరిచ్ఛేదము.

(4. సూ.)

31. శ్లో. డుముపులవః ప్రథమా స్యా
త్కూర్చిలనునయో భవేద్ద్వితీయా తు,
తో చేత తోడ చే చ తృ
తీయాయాః కొఱకుకయి చతుర్థ్యాః స్తః.

సూ. డుముపులవః ప్రథమా స్యాత్. ౧.

టీక. 'డు ము వు లు' ఇవి ప్రథమావిభక్తి యగును.
ఉ. రాముఁడు, సముద్రము, ధేనువు, రాములు.

సూ. కూర్చిలనునయో భవేద్ద్వితీయా తు. ౨.

టీక. 'కూర్చి.ల.ను.ని.' ఇవి ద్వితీయావిభక్తులు. ఉ. రా
మునిఁగూర్చి, రామకృష్ణులఁగాంచి, ఖామను, రామను,హరిని.

సూ. తో చేత తోడ చే చ తృతీయాయాః. 3.

టీక. 'తో. చేత. తోడ చే.' ఇవి తృతీయావిభక్తి కగును. ఉ. రామునితోఁబల్కె, కృష్ణుచేతఁ బిలిపించి, రాముని తోడఁ గూడి, కృష్ణునిచేఁ బడసి.

సూ. కొఱకు కయి చతుర్థ్యాః స్తః. ౪.

టీక. 'కొఱకు. కయి' అనునవి చతుర్థికగును. ఉ. రాముని కొఱకు, రామునికయి.

(4. సూ.)

32. శ్లో. పట్టి వలన కంటె ఇతి
పంచమ్యర్థ లోపల కి కు యొక్కానాం,
అందిందునాస్తు సప్త
మ్యాయీఽఽత్యామంత్రణం చ వికృతో స్యాత్.

సూ. పట్టివలనకంటె ఇతి పంచమీ. ౫.

టీక. 'పట్టి. వలన. కంటె' ఇవి పంచమీవిభక్తి కగును. ఉ. జ్ఞానముఁ బట్టి, రామువలన, అతనికంటె.

సూ. అథ లోపల కికుయొక్కానాం. ౬.

టీక. 'లోపల. కి.కు. యొక్క' ఇవి షష్ఠీవిభక్తి కగును.

సూ. అందిందునాస్తు సప్తమీ. ౭.

టీక. 'అందు. ఇందు. న' ఇవి సప్తమీవిభక్తి కగును.

ఉ. రామునందు భక్తి, వనిత యిందు నిలిచె, వనమున నిల్చి.

సూ. ఓయీత్యామంత్రణం చ వికృతౌ స్యాత్. ౮.

టీక. వికృతౌ=తెనుఁగునందు, ఓయీతి=ఓయియనునది, ఆమంత్రణమ్=సంబోధనము, స్యాత్=అగును. చకారగ్రహణమువలన స్త్రీలకు రోయనునదియు సంబోధనమని తెలియునది. ప్రయోగములవలనఁ బురుషసంబోధనశబ్దములకుఁ బూర్వమందు, 'ఓయి' అనియు, స్త్రీసంబోధనశబ్దములకుఁ బరమందు'రో'అనియు నిలుచునని తెలియునది. ఒకవేళఁ బురుషసంబోధనమును స్త్రీలకుఁ జెప్పవచ్చును. స్త్రీసంబోధనముమాత్రము పురుషులకుఁ జెప్పఁగూడదు ఈనియమములకును మహాకవిప్రయోగమే శరణమని తెలియునది.
ఉ. ఓయి రాముఁడ, చెలువరో.

క. డులుమువులు ప్రథమ నిరుకా
ర్చిలలు ద్వితీయ మఱి తోడ చే చేత పదం
బులు తో తృతీయ కయి కొఱ
కులు దలఁపఁ జతుర్థియును నగుఁ దెనుంగునకున్.

తే. గీ. పట్టి వలన కంటెయు నగుఁ బంచమీ వి
భక్తియగుఁ గిరుయొక్క లోపలలు షష్ఠి
జగతిలో నింద నందు న సప్తమి యగు
నోయి యనఁగ సంబుద్ధి యాంధ్రోక్తులందు.

(బె. సూ.)

33. శ్లో. స్త్రీపశుజడాన్విహాన్యే
మహదాఖ్యాస్తద్విశేషణానీహ,

మహాత్తోఽత ఉస్త్వీభక్తా
మహతస్స్వర్ణజనితో భవే త్స్వంసి.

సూ. స్త్రీపశుజడాన్వినాన్యే మహదాఖ్యా
స్తద్విశేషణానీహ. ౯.

టీక. స్త్రీపశుజడాన్వినా = స్త్రీవాచక పశువాచక జడ వాచకములైన శబ్దములువినాగా, అన్యే = ఇతరములైనశబ్దములు, మహదాఖ్యాః = మహత్తులను పేరుగలవి. ఇహ=ఈయాంధ్రమందు, తద్విశేషణాని=ఆమహత్తులయొక్క విశేషణములును మహత్తులనఁబడును. స్త్రీపశుజడవాచకశబ్దము లమహత్తు లని యెంచుకొనును.

ఉ. కాంత, భామ, చామ, చాన, లేమ. ఇవి స్త్రీవాచకము లైన యమహత్తులు. సింహము, వ్యాఘ్రము, గృధ్రము. ఇవి పశువాచకము లైన యమహత్తులు. వనము, ధనము, రథము. ఇవి జడవాచకములైన యమహత్తులు. 'సరససద్గుణ నికురుంబ శారదాంబ' 'ఈవనాంతము సకలతరులతాక్రాంతము' 'సంహతమృగజాలము శార్దూలము' ఈరీతి నమహత్తులవిశేషణములు నమహత్తులగును. రాముఁడు, కృష్ణుఁడు. ఇట్టిపురుషవాచకశబ్దములు మహత్తులని తెలియునది. రాముఁడు నీలమేఘశ్యాముఁడు. రఘునాయకుఁ డానందసంధాయకుఁడు. ఈరీతి మహత్తుల విశేషణములును మహత్తులై యుండును. ఇదిగాక కొన్నిచోట్లుఁ గవి వివక్షచేత నమహత్తులును మహత్తులుగాఁ బ్రయోగింపఁబడును. ఉరగులాశీ

విషులు. విహాగు లతివేగులు. ఘనుఁ డతివర్ష ఘనుఁడు. గజేంద్రుఁడు, మృగేంద్రుఁడు, విహాగేంద్రుఁడు. ఉరగము, విహాగము, ఘనము, గజేంద్రము. ఈరీతినమహత్తులు రెండువిధములుగాను బ్రయోగింపఁబడును.ఇందులకు మహాకవిప్రయోగము శరణమని తెలియునది.

సూ. మహతోఽత ఉద్విభక్తౌ. ౧౨.

టీక. విభక్తౌ=విభక్తిపరమగుచుండఁగా, మహతః=మహత్సంజ్ఞకలిగిన శబ్దముయొక్క, అతః = అకారమునకు, ఉత్ = ఉకారమువచ్చును.

సూ. మహతస్సోర్డుజనితో భవే త్పుంసి. ౧౩

టీక. పుంసి=పుంలింగమందు, అనితః = ఇకారాంతముకానట్టి, మహతః=మహత్తుయొక్క, సోః=సుప్రత్యయమునకు, డుజ్=డుజాదేశము వచ్చును.

ఉ. "అనుక్తమన్యతో గ్రాహ్యమ్"ను న్యాయమున సంస్కృతశబ్దశాస్త్రప్రసిద్ధమైనట్టి స్వాదిసూత్రముచేత నీవికృతిశాస్త్రమందును స్వాదిసప్తవిభక్తులు కలుగఁజేసికొనునది. ఆంధ్రశబ్దనిష్పత్తి చేయవలయుఁ గనుక నారీతినే యజంతశబ్దములు నిర్ణయించుటకై స్వాదిసంజ్ఞ లిందుఁ జెప్పలేదు. అవెట్లన. 'అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్—ధాతుం ప్రత్యయం ప్రత్యయాంతం చ వర్జయిత్వా అర్థవచ్ఛబ్దరూపం ప్రాతిపదికసంజ్ఞం స్యాత్' అనుచొప్పున 'భూసత్తాయామ్,' డుకృఞ్ కరణే' ఇవి మొదలైనధాతువులును, తిప్, సు

మొదలైన ప్రత్యయములునుగాక యర్థవత్తులైన శబ్దములు ప్రాతిపదికములనఁబడును.

'జ్యాప్ప్రాతిపదికాత్—జీబంతా దాబంతా త్ప్రాతి పదికాచ్చ పరతః స్వాదయః ప్రత్యయాస్స్యుః' అనుచొప్పున 'పార్వతీ, గౌరీ' మొదలైనజీప్ప్రత్యయాంతముల మీఁదను, 'చండికా, అంబికా' మొదలైన టాప్ప్రత్యయాంతముల మీఁదను, 'రామ,కృష్ణ' మొదలైన ప్రాతిపదికముల మీఁదను 'సు' మొదలైన యేడువిభక్తులప్రత్యయములు వచ్చును. అది యెట్లనః—

ప్రథమావిభక్తిః— సు, ఔ, జస్; ద్వితీయః— అమ్, ఔట్, శస్; తృతీయః— టా, భ్యామ్, భిస్; చతుర్థిః— జే, భ్యామ్, భ్యస్; పంచమిః— ఙసి, భ్యామ్, భ్యస్; షష్ఠి.— ఙస్, ఓస్, ఆమ్; సప్తమిః— ఙి, ఓస్, సుప్. ఈరీతిని సంస్కృతమునఁ బ్రథమాదులగు నేడువిభక్తులకును, నేకవచన ద్వివచన బహువచనములందుఁ మూఁడేసి ప్రత్యయము లగును. తెనుఁగున ద్వివచనము లేదుగనుక వానిలో మొదలిది యేకవచనముగను, మూఁడవది బహువచనముగను నేర్పఱుచుకొనునది. వాని కాదేశములగు తెనుఁగువిభక్తులు లీవఱకుఁ జెప్పఁబడిన కందగీతములనుండి గ్రహింపవలయును. అకారాంతపుంలింగమైన రామశబ్దము మహత్తుకాన 'రామ+సు'అని నిల్పికొని 'మహతోఽత ఉద్విభక్తౌ' అనుసూత్రముచేత నేకవచనమైన సుప్రత్యయము పరమౌచుండఁగా రామశబ్దముయొక్క 'అకారము'నకు 'ఉకారము' చేసికొనఁగ 'రాము+సు' అని నిలుచును. 'మహా

తస్సోర్డుజ్’ అనుసూత్రముచేత సుప్రత్యయమునకు డుజాదే శమువచ్చిన ‘రాముడుజ్’ అని నిలుచును.

‘అనుక్త మన్యతో గ్రాహ్య’ మ్మనున్యాయముచేత ‘హలంత్యమ్ — ఉపదేశేఽత్యం హలిత్స్యాత్’ అను సూత్రము చొప్పున డుజ్జులోని జకారము పోవును. దాఁపల నర్ధబిందువు వచ్చును. ఇట్లుకారమును నర్ధబిందువును రాఁగా ‘రాముఁడు’ అనియగును. అంతటను మహచ్ఛబ్దనిష్పత్తియందు నిటువలెనే దెలియునది. డుజ్జు పూర్వమం దనుస్వారముతోఁ గూడియుండును. ఆయనుస్వారము హ్రస్వాక్షరము మీఁదనుండునది కనుక ‘హ్రస్వాత్పూర్ణోఽపిభవేత్’ అనుచొప్పునఁ బూర్ణమును ఖండమునుగా రెండువిధములఁ గనుపించును. అనుస్వారమునకు డుజ్పూర్వస్థానప్రయోగము మహాకవిప్రయోగశరణమని తెలియునది. సర్వత్ర మహాకవి ప్రయోగశరణమనిన నేతద్వ్యాకరణము వ్యర్థ మని చెప్పరాదు. అదెట్లన, మహాభాష్యమందు భాష్యకారులైన శ్రీ పతంజలిపాదాచార్యులవారు సిద్ధశబ్దములకా? అసిద్ధశబ్దములకా? యనుశాసనమని విచారించి, లోకసిద్ధములైనశబ్దములకే యనుశాసనమని నిశ్చయించినారు. ప్రాకృతశాస్త్రమందుఁ దచ్ఛాస్త్రకర్తలైన వాల్మీకులును ‘సిద్ధిర్లోకాద్ధ్రశ్యా’ అని సూత్రించి లోకసిద్ధములైన శబ్దములకే సుశబ్దాపశబ్ద వివేకముకొఱకై సంస్కారముచేసిరి. కాన నీశాస్త్ర మపశ్య

మంగీకరించఁదగినది. కావున నక్కడక్కడ మహాకవిప్రయోగము శరణమని చెప్పుచే నీశాస్త్రమునకు హైన్యము లేదు. 'ప్రయోగశరణా వైయాకరణాః' అను న్యాయముచొప్పునఁ గవిప్రయోగశాస్త్రముల కవినాభావసంబంధమని శాస్త్రత్రయ వ్యవహారములయందు నవశ్యముగాఁ దెలియునది.

'దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్' అనుచొప్పున హ్రస్వము రాఁగా 'రంభ' అని స్త్రీలింగరూపములు సిద్ధించును. స్యాదిమహతాంవిభక్తౌ సౌర్ము' అనుసూత్రముచేత 'ము' రాఁగా, 'వ్యాఘ్రము,వృకము'అనునవి మొదలగు రూపములు సిద్ధించును పశుశబ్దము తిర్యగ్జాతులకెల్ల నుపలక్షణము. అందువలన 'గృధ్రము, కాకము'అనునవియు సిద్ధించును. కొన్నిపదములు మహత్తులైనను జడములుగా వివక్షించునెడ 'సముద్రము, మేఘము'అనురూపములే గల్గును. అజడముగా నెంచినచో 'సముద్రుఁడు, మేఘుఁడు'అని యగును. విశేషణములు విశేష్యములెట్టులో యట్టులనే యుండును. ఘనుఁడైన రాముఁడు. ఘనమైనవ్యాఘ్రము. 'అనితః' అనుపర్యుదాసముచేత నికారాంతములకు డుజాదులు లేవు. రఘుపతి, యదుపతి. ఇకారాంతములకు 'సోర్లుగితః' అను నుత్తరసూత్రముచేత సులోపము వచ్చి 'రఘుపతి, యదుపతి, హరి, గిరి'యను రూపము లేర్పడును. పుంసి యనుటచేఁ బుంలింగములకే కాని నపుంసకముల కీరూపము లేదు. 'దశరథాపత్యము, బ్రహ్మము' ఇత్యాది నపుంసకోదాహరణములు తెలియునది.

(౩. సూ.)

34. శ్లో. ఆమన్త్రణ సుజసో స్తః
క్రమేణ చాదారదాగమావంతే,
లు జసో లశసో ఉలాంతా
ల్లాంతాత్తు రురౌ తయోః క్రమేణ స్తః.

సూ. ఆమన్త్రణసుజసో స్తః క్రమేణ
చాదారదాగమావంతే. ౧౨.

టీక. ఆమన్త్రణసుజసోః = సంబోధనముయొక్క యేక వచనబహువచనములకు, క్రమేణ=క్రమముచేత, అదారదాగమౌ='అత్, ఆరత్' అనునాగమములు, (ఏకవచనబహువచన ములకు) స్తః = అగును. సంబుద్ధిప్రత్యయమునకు డు వచ్చి 'రాముఁడు' అని యుండఁగా, నుకారము వచ్చి మకారము మీఁద నిలిచిన రాముఁ డని యగును. డుకారమున కదాగమము వచ్చిన రాముఁడ యని సంబుద్ధ్యేకవచన మగును. బహువచనమునకు 'లుజసః' అను నుత్తరసూత్రముచేత జస్సును గొట్టి 'లు' వచ్చిన 'రాములు' అని యగును. ఆ లుకారము మీఁద 'ఆరత్' వచ్చిన రాములార' అని నిలుచును.

'ద్వివచనస్య బహువచనమ్' అను ప్రాకృతసూత్రన్యాయముచే నాంధ్రమందు ద్వివచనముచోటఁ గూడ బహువచనమే నిలుచును.

సూ. లుజసో లశసోఉలాంతాత్. ౧౩.

టీక. అలాంతాత్ = తుదల కారములేని శబ్దముమీఁద,
లు జసః = ప్రథమాపుంలింగ బహువచనమునకు 'లు' అనునదియు,
ల శసః = ద్వితీయాబహువచనమునకు 'ల' అనునదియునగును.
ఉ. రాములు. రాముల.

సూ. లాంతాత్తు రుకౌ తయోః క్రమేణ స్తః. ౧౪.

టీక. లాంతాత్తు = తుదలకారముగల శబ్దముమీఁద
వచ్చినచో, తయోః = ఆ ప్రథమాద్వితీయా బహువచనములకు,
క్రమేణ=వరుసచే, రుకౌ='రు, క' అను ప్రత్యయములు, స్తః=
అగును. 'ప్రత్యయః పరశ్చ' అను చెప్పున పరమందునిల్చును.
ఉ. బాలురు, బాలుక. 'లాంతాత్' అన్నందున 'అకార' విశిష్ట
లకారము తుదనుండిననే వచ్చును. 'ఌ,లు' మొదలైనవున్నచో
'రుకలు' లేవు. బుద్ధిశాలులు. దీర్ఘతాలులు. 'లాంతాత్తు' అను
తుశబ్దప్రయోగమువలన హ్రస్వముమీఁద నున్న లాంతము
నకు రుకలు లేవు. మహాబలులు.

(4. సూ.)

35. శ్లో. నిరమో మహత్తాం లుక్చ
స్యాత్కర్మప్రవచనీయకే కూర్చిః,
మహతో నిరా విభక్తా
టాదౌ వచనద్వయే క్రమేణ స్తః.

సూ. నిరమో మహత్తామ్. ౧౫.

టీక. మహాత్మాం = మహాత్ములయొక్క, అమః=ద్వితీయై కవచనమునకు, నిః = నివర్ణకమాదేశముగా వచ్చును. ఉ. రాముని, కృష్ణుని. మహాత్ములకు నివర్ణకము వచ్చునని చెప్పెనుగాన నమహాత్ముల కైనయెడ ద్వితీయైకవచనమునకుఁ బరిశిష్టమైనను వర్ణకము వచ్చును. ఉ. కాంతను, భామను, సింహమును, వనమును, ధనమును.

సూ. లుక్చ స్యాత్. ౧౬.

టీక. లుక్చ = ఈనివర్ణక 'నువర్ణకములకు లోపమును, స్యాత్ =అగును. ఉ. రాముఁగొల్చి, రామునిగొల్చి. కాంతఁజేరి, కాంతనుజేరి. సింహముఁగాంచి, సింహమునుగాంచి.

సూ. కర్మప్రవచనీయకే క్షూర్చిః. ౧౭.

టీక. కర్మప్రవచనీయకే=శబ్దశాస్త్రమందుఁ జెప్పఁబడిన కర్మప్రవచనీయసంజ్ఞకల ద్వితీయాస్థలమందు మహదమహాత్ముల మీఁదను, కూర్చిః=ద్వితీయైకవచనమునకుఁ గూర్చియనువర్ణకము వచ్చును. ఉ. భక్తింగూర్చి జ్ఞానము కలుగును. రాముఁ గూర్చి, సీతఁగూర్చి వచ్చెను.

సూ. మహాత్మో నిలా విభక్త్యౌ టాదౌ
వచనద్వయే క్రమేణ స్తః. ౧౮.

టీక. టాదౌవిభక్త్యౌ=తృతీయాదివిభక్తులు పరమైయుండఁగా, మహతః=మహాత్మ

వచనములయందు, క్రమేణ=క్రమముగా, నిలౌ = 'ని,ల' అను వర్ణకములు, స్తః=వచ్చును.

ఉ. రామునిచేత, రాములచేత, రామునికొఱకు, రాములకొఱకు. ఈవిధమున సప్తవిభక్తులకుఁ దెలియునది. కాంతలచేత, భామలచేత నని వీనియందును లవర్ణకము వినఁబడుచున్నది. కాని సూత్రమందు మహత్తుల మీఁదనేగాని రాదనీచెప్పఁబడియున్నది కాన నీప్రయోగములకు గతికల్పించుటకయి సూత్రమందు 'మహతః,' అనియు, 'టాదౌ' అనియు నేకవచననిర్దేశముఁజేసినాఁడు. సూత్రమందు మహచ్ఛబ్దమే లేక పోయినయెడల నమహత్తులమీఁద నైతము'ని'యనునది రావలసియుండును. అట్లు వచ్చినచో విరుద్ధరూపములు పుట్టును. కాన 'టాదౌ మహతః' అను నేకవచననిర్దేశము చేత మహత్తులమీఁదనే. యేకవచనమునకు నివర్ణకము టాదివిభక్తి పరమగునపుడు వచ్చును. అమహత్తులమీఁద నేకవచనమునకు నివర్ణకముగాని, నువర్ణకముగాని రాదు. బహువచనమున నంతటను లవర్ణకము వచ్చును.

• (౬. సూ.)

36. శ్లో. టాదివిభక్తౌ నిర్నే
త్యేకే నామంత్రణే డుజిత్యన్యే,
టాసక్త్సౌతో జేసః
కయికొఱకూ జసిస ఉచ్యతే వలనః.

సూ. టాదివిభక్తౌ నిర్నే త్యేకే. ౧౯.

టీక. టాదివిభక్తౌ=తృతీయాదివిభక్తులు పరమగాచుండఁగా, నిః=ని యనునాగమము, న=లేదు, ఇత్యేకే=ఇట్లు కొందఱు చెప్పుదురు. ఉ. రాముచేత, రాముకొఱకు, రామువలన, రాముకంటె.

సూ నామంత్రణే డుజిత్యన్యే. ౨౦.

టీక. ఆమంత్రణే = సంబుద్ధియందు, డుజ్=డుజాదేశము,న=లేదు, ఇత్యన్యే=ఇట్లు కొందఱుచెప్పుదురు. ఉ. ఓరామ, ఓకృష్ణ. అదాగమము సంబుద్ధిని గూడినది.

సూ. టాస శ్చేతః. ౨౧.

టీక. టాసః=తృతీయావిభక్తికి, చేతః='చేత,' అనునది వచ్చును. ఉ. రామునిచేత, రాములచేత.

సూ. ఙేసః కయి కొఱకూ. ౨౨.

టీక. ఙేసః = చతుర్థీవిభక్తికి, కయికొఱకూ = 'కయి, కొఱకు' అను రెండును, నాదేశములై వచ్చును. ఉ. రాముని కొఱకు, రాములకొఱకు.

సూ. ఙసిస ఉచ్యతే వలనః. ౨౩.

టీక. ఙసినః=పంచమీవిభక్తికి, వలనః='వలన' అను నాదేశమువచ్చును. ఉ. రామునివలన, రాములవలన.

(6. సూ.)

37. శ్లో. నః కౌ జసః కురనితా

మందుః జీపస్సవిధవక్తినామిందు,

తోడ సహార్థే టాసః

కర్తరి తు పంచమ్యాం గుణే హేతౌ.

సూ. నః కౌ జసః కురనితామ్ ౨౮-౨౯.

టీక. అనితామ్= ఇకారాంతవ్యతిరిక్తములైనశబ్దముల యొక్క, జసః=షష్ఠీవిభక్తికి, కుః='కు' అనువర్ణకమువచ్చును. కౌ=ఆకువర్ణకము పరమగుచుండఁగా, నః=(పూర్వమున నాగము మైనవర్ణము వచ్చును. ఉ. రామునకు, కృష్ణునకు. 'అనితామ్' అని పర్యుదాసము చేయుటచే నికారాంతములకుఁ గువర్ణకము రాదు. 'జసః కిశ్చ' అనువక్ష్యమాణసూత్రముచేత కివర్ణకము వచ్చును. 'హరికి, గిరికి' ఇందుచేత 'రామునికి, కృష్ణునికి' అనురూపములును గలుగును. 'జసః కిశ్చ' అనుచోటవలెఁ గాక 'జసః కుః' అనుచోట బ్రత్యాహారముగాన 'రాములకు' అని షష్ఠీబహువచనము సిద్ధించును.

సూ. అందుజీపః. ౩౦.

టీక. జీపః=సప్తమీవిభక్తికి, అందు='అందు' అనునాదేశమువచ్చును. ఉ. రామునియందు, రాములయందు. న్యాగమము నంగీకరింపనివారిపక్షమందు 'నుమ్వ్యాతః' అనుసూత్రముచేత నుమాగమము వచ్చి 'రామునందు' అనియగును.

సూ. సవిధవర్తినామిందు. ౨౭.

టీక. సవిధవర్తినామ్=సమీపవాచకశబ్దములకు,ఇందు='ఇందు' అనునాదేశమువచ్చును. ఉ. ఇందువచ్చె. ఇందునిలిచె. ఇదేకాక యందు నెందు ననునవియును బృథక్ఛబ్దములై లోకమునఁ బ్రసిద్ధములుగా నుండును. ఎందుఁ జనె. అందుఁ జనె. ఇందులకువచ్చె. ఎందులకు వచ్చె. అందులకై వేఁడె. ఇత్యాదులు చూచునది.

సూ. తోడ సహార్థే టాసః. ౨౮.

టీక. టాసః=తృతీయకు, సహార్థే=సహార్థమందు, తోడ='తోడ.'అనునాదేశము వచ్చును. ఉ. రాముతోడ, రామునితోడ. శిష్యునితోడ గురువువచ్చెను.

సూ. పట్టీతి తు పంచమీ గుణే హేతౌ. ౨౯.

టీక. 'విభాషా గుణేఽస్త్రియామ్' అను సూత్రమున వచ్చునట్టి, గుణే=గుణము, హేతౌసతి=హేతువగుచుండఁగా వచ్చుపంచమీవిభక్తికి, పట్టీతితు=పట్టియనునది వచ్చును. ఉ. జ్ఞానముంబట్టి ముక్తుఁడగును.

(4. సూ.)

38. శ్లో. కంటేఽన్యారాదాదే
ర్లోపలనిర్ధారణోద్భవా షష్ఠీ,
యొక్క చ శేషే షష్ఠీ
విషయనిమిత్తాదిజా తథైవాన్యా.

సూ. కంటేఽన్యారాదాదేః ౩౦.

టీక. అన్యారాదాదేః='అన్యారాదితరర్తే', అనుసూత్రమునవచ్చుపంచమికి, కంటే='కంటె'అనునదివచ్చును. ఉ. హరికంటె హరుఁ డధికుఁడు. రామునికంటె శివుఁ డన్యుఁడు. న్యాగమము వికల్పము కనుక 'రాముఁకంటె' అనియు వచ్చును. ఈ కంటె శబ్దమువలెనే 'కన్న' అనుశబ్దమును నన్యారాద్యర్థబోధకము కాన 'రామునికన్న రాముకన్న' అనియు నుండును.

సూ. లోపలనిర్ధారణోద్భవా షష్ఠీ. ౩౧.

టీక. నిర్ధారణోద్భవా='యతశ్చనిర్ధారణమ్' అనుశబ్దసూత్రముచేత నిర్ధారణార్థమందుఁ బుట్టిన,షష్ఠీ=షష్ఠికి,లోపల='లోపల'అనునది యగును. ఉ. ధనికులలోపల దాత ఘనుఁడు. విప్రులలోపల వేదవిదుఁ డధికుఁడు. దేవతలలోపల గౌరి యధికురాలు.

సూ. యొక్క చ శేషే షష్ఠీ. ౩౨.

టీక. శేషేషష్ఠీ = 'స్వస్వామిభావసంబంధాచ్ఛేషే షష్ఠీ' అనుచోప్పుఁ శేషార్థములందు వచ్చు షష్ఠికి, యొక్కచ = 'యొక్క' అనునాదేశము వచ్చును. ఉ. రాజుయొక్క భృత్యుఁడు, విష్ణునియొక్క భక్తుఁడు. అంబయొక్కదాసుఁడు.

సూ. విషయనిమిత్తాదిజా తత్రైవాన్యా. ౩౩.

టీక. విషయనిమిత్తాదిజా = విషయనిమిత్తాద్యర్థములఁ బుట్టిన, అన్యా=సప్తమి, తత్రైవ = ఆవిషయనిమిత్తాదిశబ్దముల

తోడన యుండును. ఉ. హరివిషయము. హరినిమిత్తము. ఆది శబ్దముచేత సతిసప్తమియు వర్తమానార్థమైయుండును. హరి రక్షించుచుండఁగా.

(రి. సూ.).

39. శ్లో. స్యాదమహతాం విభక్తౌ
సోశ్చ ము తదుపరి పునర్ముబూ ప్రాచామ్,
సో ర్లుగిత ఉద్బహుత్వే
సంబుద్ధౌ నాదితాం జసః కిశ్చ.

సూ. స్యాదమహతాం విభక్తౌ సోశ్చ ము. 38.

టీక. అమహతామ్=అమహత్తులకు, విభక్తౌ=సకలవిభక్తులు పరమగుచుండఁగా, 'ము' అనునాగమము వచ్చును. సోశ్చ=ప్రథమైకవచనమునకును, ము= 'ము' అనునాదేశము, స్యాత్=అగును. ఉ. వనము, ధనము. బహువచనమున సర్వవిభక్తిసాధారణముగా ముకారముండఁగా 'లుజసః' అను సూత్రముచేత లు, వచ్చునుగాన 'వనములు' అని యగును. ద్వితీయాదివిభక్తులలో వనమును,వనముచేత, వనముకొఱకు, వనమువలన, వనముయొక్క, వనమందు వని యుండును.

సూ. తదుపరి పునర్ముబూ ప్రాచామ్. 39.

టీక. తదుపరి = ఆముపర్ణముపయి, పునః = మరల, ప్రాచామ్=ప్రాచీనుల (పూర్వుల) యొక్కమతమున, ముబూ= 'ము, బు' అనునవివచ్చును. ఉ. 'వనము' అని యుండి తిరుగ

'ము' పోఁగా 'వనముము' అని యేర్పడును. పునర్మకారవిధాన సామర్థ్యముచే

"ఉపదేశేఽజనునాసిక ఇత్"—ఉపదేశేఽనునాసికోఽజిత్సంజ్ఞః స్యాత్"

అనుసూత్రమున మొదలిముకారములోని'ఉ'కార మిత్సంజ్ఞ పోఁగా 'వనమ్.' అని యేర్పడును. మొదలిమకారము సున్నయు వికల్పముగ నగును. వనమ్ము, వనంము ఇటులనే 'వనము బు' అని యుండి మునుపటివలెనే యిత్సంజ్ఞకము పోఁగా 'వనమ్ బు' అని యేర్పడును.

"మోఽనుస్వారః—మాంతస్య పదస్యానుస్వారః స్యాద్ధలి"

అను శబ్దసూత్రముచే మకారమునకు సున్న రాఁగా 'వనంబు' అనురూపము సిద్ధించును.

సూ. సోర్లుగితః. ౩౬.

టీక. ఇతః=ఇకారాంతముమీఁద నుండునట్టి,సోః=ప్రథమైకవచనమునకు, లుక్=లోపమగును. ఉ. హరి, గిరి. మొ.

సూ. ఉద్బహుత్వే. ౩౭

టీక. బహుత్వే = బహువచనమునందు నికారమునకు, ఉత్=ఉకారము వచ్చును. ఉ. హరులు, గిరులు మొ.

సూ. సంబుద్ధా నాదితామ్. ౩౮.

టీక. ఇతామ్=ఇకారాంతములకు, సంబుద్ధౌ=సంబుద్ధియందు, అత్=అదాగమము, న=లేదు. ఉ. ఓహరి, ఓగిరి.

సూ. జసః కిఙ్ఙే. ౩౯.

టీక. జసః=ఇకారాంతముయొక్క షష్ఠికి, కిఙ్ఙే=ఏకవచనమున 'కి' అనునది వచ్చును. ఉ. హరికి, గిరికి.

(4 సూ.)

40. శ్లో. టాదావితో న నిస్స్యా
దీదంతా ఇద్వదేవ కృతహ్రస్వాః,
వికృతౌ క్వచిచ్చ లోపో
మోర్ద్ధిర్ఘశ్చాత ఆదిమస్య భవేత్.

సూ. టాదావితో న నిస్స్యాత్. ౪౦.

టీక. ఇతః=ఇకారాంతమునకు, టాదౌ=తృతీయాదివిభక్తి పరమై యుండఁగా, నిః='ని' అనునాగమము, న స్యాత్=లేదు. ఉ. హరిచేత, హరివలన; హరులకొఱకు ఇత్యాది బహువచన రూపములందు లవర్ణకము వచ్చును.

సూ. ఈదంతా ఇద్వదేవ కృతహ్రస్వాః. ౪౧.

టీక. ఈదంతాః = ఈకారాంతములు, కృతహ్రస్వాః = చేయఁబడిన హ్రస్వములు కలవై, ఇద్వదేవ=ఇకారాంతములవలె నగును. ఉ. సేనాని, గ్రామణి, అగ్రణి, గ్రామణులు, అగ్రణులు, సంబుద్ధి:—ఓగ్రామణి, ఓయగ్రణి, ఓయగ్రణులార! ఇత్యాదులు చూచుకొనునది.

సూ. వికృతౌ క్వచిచ్చ లోపో మోర్ద్దీర్ఘశ్చాత
ఆదిమస్య భవేత్. ౪౨-౪౩.

టీక. వికృతౌ=తెలుఁగునందు, క్వచిత్=కొన్నిచోటుల, మోః=ముపర్ణకమునకు, లోపశ్చ = లోపము (వికల్పముగా) వచ్చును. అనిమస్య=మొదటిదైన, అతః=అకారమునకు, దీర్ఘశ్చ=దీర్ఘమును. భవేత్=అగును. చకారమువలన నవి వికల్పమనుట. ఉ. జీతములు, జీతాలు. ప్రాణములు, ప్రాణాలు. గుఱ్ఱములు, గుఱ్ఱాలు. ఇత్యాదిశబ్దములు మహాకవిప్రయోగానుగుణముగాఁ బ్రయోగించునది.

(త్రి. సూ.)

41. శ్లో. సర్వత్రోదోతోర్వు
 ర్భవతి మువద్దుఙ్మహత్పదానాం వా,
 దుజతౌ తు న ప్లుతస్యా
 స్సంబుద్ధావిత్యుశాం విదుః కేచిత్.

సూ. సర్వత్రోదోతోర్వుర్భవతి మువత్. ౪౪.

టీక. ఉదోతోః=ఉకారాంత-ఓకారాంతములకు, సర్వత్ర=సమాదులింకములందును, వుః = వుపర్ణకము వచ్చును, మువత్ = (అది) 'ము' వలెనే, భవతి=అగుచున్నది. అనఁగాఁ బ్రథమైకవచనమున కాదేశమయ్యుఁ, గడమచోటుల విభక్తులకు ముందాగమమయ్యు వచ్చునని యర్థము. ఉ. గురువు, ధేనువు,గురువులచేత. ఓకారాంతమునకు గోవు, గోవులచేత.

సూ. దుఙ్మహత్పదానాం వా. ౪౫.

టీక. మహత్పదానామ్=ఉకారాంతమహత్పదములకు, దుఙ్=దుఙాదేశము, వా=వికల్పముగా వచ్చును. ఉ.విష్ణుఁడు,

విష్ణువు. శంభుఁడు, శంభువు. గురువు, గురుఁడు. ఇట్లు వికల్పముగఁ జూచుకొనునది 'గోవు ధేనువు పశువు తరువు' ఇత్యాద్యమహత్తులయందు వువర్ణకము నిత్యమని తెలియునది.

సూ. డుజతో తు నప్లుతస్స్యాత్సంబుద్ధా
విత్యుతాం విదుః కేచిత్. ౪౬.

టీక. కేచిత్ = కొందఱు, సంబుద్ధౌ = సంబుద్ధియందు, ఉతామ్=ఉకారాంతమహత్తులకు, డుజతో=డుజ్ఞునునదాగమమును, న= లేదు. ప్లుతస్స్యాత్ = అంత్యవర్ణమునకు ప్లుతము వచ్చును. ఇతివిదుః=అని తలంతురు. ఇది వువర్ణకము రానిపక్షమందని తెలియునది.

ఉ. శంభు ౩. భాను ౩. గురు ౩. ఈయర్థమందే నన్నయభట్టాచార్యులవారును 'జరత్కారు ౩ మునిశ్రేష్ఠ'అని భారతమందుఁ బ్రయోగించినారు కాన నీప్లుతము కేచిత్పక్షమైనను నాచార్యులవారికి సమ్మత మౌటచేతనే ప్రయోగించినారని తెలియునది. ఆచార్యులవారిపక్షమందు సంబుద్ధియందు డుజాదేశము వచ్చునని తెలియునది. డువువర్ణకములం దదాగమము నిత్యముగా వచ్చును. విష్ణుఁడ, విష్ణువ. శంభుఁడ, శంభువ. భానుఁడ, భానువ. అమహత్తులకు:—ధేనువ, పశువ, మేరువ. ఇత్యాదిప్రయోగములు తెలియునది. బహువచనమం దార దాగమము సిద్ధమే. గురువులార. పశువులార. తరువులార!

(౬. సూ.)

42. శ్లో. దీర్ఘాణాం హ్రస్వస్స్యా
న్న చ దేశ్యపదే న చైకవర్ణేఽపి,

డాబవిధాత్రాదేరు
త్తస్య చ వా త్రావుభౌ రమేశసమౌ.

సూ. దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్. ౪౭.

టీక. దీర్ఘాణామ్=దీర్ఘాంతములైనశబ్దములకు, హ్రస్వస్స్యాత్ = హ్రస్వమువచ్చును. ఉ. (సోమప్రభుడు, సోమపులు) అంబ, కాంత, వాణి, గౌరి, జాయ, మాయ, లక్ష్మి, కరభోరు.

సూ. న చ దేశ్యపదే. ౪౮.

టీక దేశ్యపదే=దేశ్యపుఁ దెలుఁగుపదమందు, నచ = (దీర్ఘమునకు) హ్రస్వము రాదు. ఉ. నవలా, నవలాలు. జేజే, జేజేలు. తేజీ, తేజీలు. నేజా, నేజాలు. లకోరీ, లకోరీలు.

సూ. న చైకవర్ణేఽపి. ౪౯.

టీక. ఏకవర్ణేఽపి=ఏకాక్షరతత్సమపదమందును. న చ= దీర్ఘమునకు హ్రస్వము రాదు. ఉ. హ్రీ, హ్రీలు. భీ, భీలు. మా, మాలు. శ్రీ, శ్రీలు. ధీ, ధీలు. స్త్రీ, స్త్రీలు. ఇట్టి యేకవర్ణములకు సమాసమందైనను హ్రస్వము లేదని యాచార్యుల వారి యభిప్రాయము. ఉ. సుఖశ్రీ, సుఖశ్రీలు. శ్రీతోఁబుట్టు. ఇత్యాదులు ప్రయోగానుసారముగాఁ దెలియునది.

సూ. డాబవిధాత్రాదేరుః. ౫౦.

టీక. అవిధాత్రాదేః = విధాత్రాదిగణములోనిదికానట్టి ఋరాంతశబ్దముయొక్క, ఋః=ఋకారమునకు, డాప్=డాప్పను

నాదేశమువచ్చును. ఉ.మాంధాతృశబ్దము:—'మాంధాతృ +స్' అనియుండునప్పుడు మాంధాతృశబ్దముయొక్క ఋకారమునకు డాప్పు రాఁగా, డాప్పులోని పకారడకారములు శబ్దసూత్రన్యాయముచే నిర్వర్ణములై పోఁగా 'ఆ'అని నిలుచును. ఆ 'ఆ' కారము డిత్తుగాన మాంధాతృశబ్దములోని ఋకారమును ద్రోసి వచ్చుటచే 'మాంధాతా' అని నిలుచును. ఈశబ్దము మహత్తైనను డాబంతము కనుక స్త్రీలింగ సమమాయెను. దానికి 'దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్'అను దానిచే హ్రస్వము వచ్చిన 'మాంధాత' అని నిలుచును. ఇటులనే సూత్రకారుఁ డీడాబంతము స్త్రీసమమని 'తావుభౌ రమేశసమౌ'అనుసూత్రముచేఁ జెప్పుచున్నాఁడు పిదప 'అనుతాం స్త్రియాః' మిత్యాదిసూత్రముచేత సులోపము రాఁగా 'మాంధాత' అనురూపము నిష్పన్నమయ్యెను. మాంధాత, మాంధాతలు. నేత, నేతలు. హోత, హోతలు.

సూ. తస్య చ వా. ౫౦.

టీక. తస్య చ=అవిధాత్రాదిగణమునకు, వా=వికల్పమున డాప్పు వచ్చును. ఉ. విధాత. విధాతృఁడు. ధాత, ధాతృఁడు. సవిత, సవితృఁడు. 'దీర్ఘాణాం హ్రస్వ స్స్యాత్' అనుసూత్రముచే హ్రస్వమును 'మహతస్సోర్డునితో భవేత్పుంసి' అను సూత్రముచే డుజాదులును ద్వివిధరూపములందును వరుసగ నగును. ఇవ్విధంబునఁ బ్రయోగానుసారముగా విధాత్రాదిగణము తెలియునది. ఈవిధాత్రాదిగణమునకు డాప్పు వికల్పమనియు, నవిధాత్రాదులకు నిత్యమనియుఁ దెలియునది

సూ॰ తాచ్ప్రభౌ రమేశసమౌ. ౫౨

టీక. తాచ్ప్రభౌ=ఆడాబంతాడాబంతములు రెండును, రమేశసమౌ = రమాశబ్దమువంటివియు నీశశబ్దమువంటివియు నగును. విధాత యనునది రమాశబ్దమువంటిది. 'విధాతృఁడు' అనునది యీశశబ్దమువంటిది.

(4. సూ.)

43. శ్లో. క్వచిదమహాత్తోఽపి డుజ్స్యా
దేకాదేరమహాతాం చ డావున్న,
స్త్రీత్వబహుత్వేసురాదే
రసమాసే లుగ్బహుత్వేత్వకాదేర్నో॥

సూ. క్వచిదమహాత్తోఽపి డుజ్స్యా
దేకాదేరమహాతాం చ డావున్న. ౫3. ౫౪.

టీక. క్వచిత్=కొన్నిచోటుల, అమహాత్తో ఽపి=అమహాత్తునకును, డుజ్స్యాత్=సుప్రత్యయమునకు డుజాదేశము వచ్చును. ఏకాదేః=ఏకాదిగణమునకును, అమహాతాంచ=అమహాత్తులకును, డౌ=డుజ్జుపరమౌచుండఁగా, ఉత్=ఉకారము, న=లేదు. ఉ. కైరఁడు, జన్నుఁడు, కత్తెఱఁడు. ఇవి యశ్వవాచకములు. ఏకాదిగణమునకు — ఉ. ఒక్కఁడు పులి, ఒక్కడు వనము, ఒక్కఁడు తేఁడు; రాయఁడు, పాపఁడు, బాపఁడు.

సూ. స్త్రీత్వబహుత్వే సురాదేరసమాసే. ౫౫.

టీక. అసమాసే=సమాసము లేనిపక్షమందు, సురాదేః=

సురాదిగణమునకు, స్త్రీత్వబహుత్వే = స్త్రీలింగమును, బహు వచనమును వచ్చును. ఉ.సురలు. అసమాస మనుట యేల యనః— భూసురుఁడు. సురాదిగణము ప్రయోగములచేఁ దెలిసికొనునది.

సూ. లుగ్వా వేత్కుశాదేర్మోః. ౫౬.

టీక. కుశాదేః=కుశాదిగణముయొక్క, మోః=మువర్ణకమునకు, లుగ్వా వేత్=లోపము వచ్చును. ఉ. కుశ, కుశలు. దర్భ, దర్భలు. హంస, హంసలు. హంసశబ్దమునకు ము కలదని కొంద అందురు. హంసము.

(తె. సూ.)

44. శ్లో. షష్ఠీవిశేషణానాం

ప్రథమా స్యాద్వ్యవహితాశ్చ పర్వే స్యుః,

వికృతౌ చ స్త్రీలింగాః

స్త్రీలింగకసర్వనామధేయాస్స్యుః

సూ. షష్ఠీవిశేషణానాం ప్రథమా స్యాత్. ౫౭.

టీక. షష్ఠీవిశేషణానామ్=షష్ఠ్యంతవిశేష్యముయొక్క విశేషణములకు, ప్రథమా=ప్రథమావిభక్తి, స్యాత్=అగును. ఉ. నీలమేఘశ్యాముఁడు రామునకు, భక్తజనరక్షకుఁ డధోక్షజునకు, గీ. శిష్టవత్సలగౌరి కాశ్రితుఁడ నేను, శిష్టపాలుఁడు శౌరి కాశ్రితుఁడ నేను. ఇట్లు ప్రయోగములు చూచుకొనునది.

సూ. వ్యవహితాశ్చ సర్వే స్యుః. ౫౮.

టీక. సర్వే=సకలవిభక్తివిశేషణములును, వ్యవహితాశ్చ=విశేష్యముతో వ్యవధానము కలవియు, స్యుః=అగును. అనఁగా మధ్యను బదాంతరవ్యవధానము కలిగినను బ్రయోక్తవ్యములై యుండుననుట. ఉదాహరణము.

"సీ. ఆశ్రితావన సకల మన్నింప బ్రోవె
శంకరునిరాణి నెమ్మిఁ దివె శైలసుతను,
వినుమవసరకు: బ్రహతి సర్వేశ్వరికిని
నాస్యయుగము పాకధీరతి యాస్యయుగము."

సూ. వికృతౌ చ స్త్రీలింగాః స్త్రీలింగక
సర్వనామధేయాః స్యుః. ౫౯.

టీక. వికృతౌ చ=తెలుఁగునందును, స్త్రీలింగాః=స్త్రీలింగపదములు, స్త్రీలింగక సర్వనామధేయాః=స్త్రీలింగములైనట్టి సకలవిశేషణశబ్దములు కలవి, స్యుః=అగును. అనఁగా విశేష్యవిశేషణములు దెల్గునందును స్త్రీలింగములై యుండవలయుననుట. చకారమువలన సంస్కృత స్త్రీలింగవిశేష్య విశేషణములు స్త్రీలింగములే కావలయుననుట. ఉదాహరణము.

"గీ. గట్టురాపట్టి ముక్కంటికలికిఁ గొలుతు,
భక్తవత్సల గౌరియాపన్నవరద,
గట్టురాపట్టి సకలలోకైకమాత."

(4. సూ.)

45. శ్లో. ఉభయవిధమ మహతీనాం
నియతః స్త్రీప్రత్యయస్తు సర్వాసామ్,
ఇతరత్ర చ ద్వితీయా
తస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్.

సూ. ఉభయవిధమమహతీనామ్, ౬౦.

టీక. అమహతీనామ్ = అమహత్తులైన స్త్రీలింగములకు, ఉభయవిధమ్=రెండువిధములైన స్త్రీలింగ నపుంసకలింగ విశేషణములును వచ్చును. ఉ. పుష్పలతమనోహర, పుష్పలత మనోహరము. శరచ్చంద్రిక మనోహర, శరచ్చంద్రికమనోహరము.

సూ. నియతః స్త్రీప్రత్యయస్తు సర్వాసామ్. ౬౧.

టీక. సర్వాసామ్=సమస్తములైన తత్సమశబ్దములకు, స్త్రీప్రత్యయస్తు= 'జీప్,జీష్' అనునవి మొదలైన స్త్రీప్రత్యయములు, నియతః=నియమముగా వచ్చును. ఉ. మిన్నేఱు శివజటాజూటవాసిని, శరచ్చంద్రిక తాపహారిణి, అంబసకలజగత్కర్త్రి.

సూ. ఇతరత్ర చ ద్వితీయా. ౬౨.

టీక. ఇతరత్ర చ=మఱియొకచోటను, (తృతీయాసప్తమీవిభక్తులయందు) ద్వితీయా = ద్వితీయావిభక్తి వచ్చును. ను. తృతీయ కుదాహరణము. హేతినినఱికె, కత్తిమొనఱ

నతికై. ప్రస్తుతమికుదాహరణము ద్వారక నున్నాఁడు, అత్తతోఁ బలికినమాటలు. ఇత్యాది ప్రయోగములు చూచుకొనునది.

సూ. తస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్. ౬౩.

టీక. జడపదానామ్ = జడవాచకములైనశబ్దముల యొక్క, తస్యాః=ఆద్వితీయకు, ప్రథమా చ=ప్రథమావిభక్తియు వచ్చును. ఉ. రథమెక్కిదిగెను, చెట్టెక్కి దిగెను, కొండయెక్కిదిగెను, ఊరు చొచ్చివచ్చెను. చకారమువలన ద్వితీయయు నుండును. వనమును జేరి, రథమునెక్కి.

(6. సూ.)

46. శ్లో. స్తోవావౌ రైనావోః
స్త్రీవద్గ్లార్యాశివోస్తు జా యత్తత్,
వాయురపూర్వక్రతమా
వృద్ధ్వ్యం ద్వేరః క్వచిద్గకారో వః.

సూ. స్తోవావౌ రైనావోః. ౬౪.

టీక. రైనావోః=రైశబ్ద-నౌశబ్దములయొక్క తుదను, అవావౌ = ఓకారమును - ఆవయనునదియును, స్తః=క్రమముగా వచ్చును. రైశబ్దమునకు 'ఓ' కారమును, నౌశబ్దమునకావయును నగునని తెలియునది. ఉ. రోయీవి, రోవెలఁది. నావనడపి.

సూ. స్త్రీవద్గ్లాః. ౬౫.

టీక. గ్లాః=గ్లాశబ్దము, స్త్రీవత్=స్త్రీశబ్దమువలె నేకా తురమైయుండును. స్త్రీశబ్దసామ్యము కలుగుటచేతఁ బుంలింగ

మైనను, 'అనుతాన్' అనుసూత్రముచే సులోపము వచ్చి గ్లౌ యని నిలుచును. ఉ. గ్లౌ యుదయించె.

సూ. భూదివోస్తు ఙౌ యత్తత్. ౬౬.

టీక. భూదివోస్తు = భూశబ్దదివ్‌శబ్దములకైన, ఙౌ= సంస్కృతసప్తమ్యేకవచనమందు, యత్ = ఏరూపము కలదో, తత్=ఆరూపము చెప్పఁదగినది. ఉ. భువినుండి. దివికేఁగి. భువి, దివి, ఇత్యాదులు (మణిఘృణ్యాదులైనయికారాంతములవలెఁ జూచుకొనునది.)

సూ. వాయిరవుర్వక్రతమౌ. ౬౭.

టీక. వక్రతమౌ = ఐకారౌకారములు, వా=వికల్పముగ, అయిరవుః = అయి అవులౌను. ఉ. కై, కయి. కైలు, కయిలు. ఔర,అవుర.

సూ. ఉర్ద్వంద్వే రః క్వచిత్. ౬౮.

టీక. ద్వంద్వే = ద్వంద్వసమాసమందలి, ఉః = ఋకారాంతశబ్దముల ఋకారమునకు, క్వచిత్ =కొన్నిచోటుల, రః= రేఫమువచ్చును. కొందఱు క్వచిచ్ఛబ్దము నుత్తరసూత్రముతో నన్వయింతురు. "మాత్రపితృభావమున శైలపుత్త్రిఁ గొలుతు."

సూ. గకారో వః. ౬౯.

టీక. గకారః=కేవలాంధ్రపదములయందలి గకారము, వః=వకారమగును. పూర్వసూత్రమందైన క్వచిచ్ఛబ్దము నీ సూత్రమందన్వయించునది. అందుచే రెండునుంగలవు.

ఉ. పగలు, పవలు. ప్రోగులు, ప్రోవులు. పగడము, పవడము. తొగ, తొవ.

(3. సూ.)

47. శ్లో. నువర్ణాన్తాన్నామ్నః కుజో
    ర్బహువచనే కుత్రచిన్ను లోపశ్చ,
 సలలోర్బిందుయుతో డు
    ర్వా లులయోః ల్లుగపి తయోః పరతః.

సూ. నువర్ణాన్తాన్నామ్నః కుజోర్బహువచనే. ౨౦.

టీక.నువర్ణాత్=నుకారము తుదియందుఁగల, నామ్నః=నామమునకు మీఁదనున్న, నోః=నుకారమునకు,బహువచనే=బహువచనమందు, కుజ్=కుజాదేశము వచ్చును. జకార మిత్తై పోవును. జిత్తుగాన నర్ధబిందుయుక్తమగును. ఉ. కొలను, కొలఁకులు. హ్రస్వపూర్వకము కనుకఁ బూర్ణబిందువునగును. కొలంకులు. కెలను-కెలఁకులు, కెలంకులు. మ్రాను-మ్రాఁకులు. దీర్ఘపూర్వకముగాన నిక్కడ నర్ధబిందువే.

సూ. కుత్రచిన్నులోపశ్చ. ౨౧.

టీక. కుత్రచిత్ = ఒకానొకచో బహువచనమందు, నులోపశ్చ=నులోపమగును. ఉ. చేను చేలు, మీను మీలు. చకారప్రయోగమునఁ గొన్నిటికి లోపము లేదు. మేనులు, కానులు, మ్రానులు.

సూ. సలలోర్బిందుయుతో డు ర్వా లులయో
రుల్లుగపి తయోః పరతః. ౭౨.

టీక. లులయోః = ప్రథమాద్వితీయాబహువచనములు పరమగుచుండఁగా, సలలోః = లకారద్విత్వయుక్తలుకారము నకు, వా=వికల్పముగ, బిందుయుతో డుః=బిందుయుక్తమై నడువర్ణము వచ్చును.

తయోః పరతః = అలులలు పరమగుచుండఁగా, ఉల్లుగపి=ఉకారలోపము సైతము వచ్చును. ఉ. విల్లు, విండు లు, విండ్లు. ముల్లు, ముండులు, ముండ్లు. డుకారాదేశము వికల్పముకనుక 'విల్లులు, ముల్లులు'—విండ్లప్రోవులు, ముండ్ల మ్రాఁకులు. ఇత్యాదులు.

(౹. సూ.)

48. శ్లో. నిత్యం దారాదేశ్చస్యా
ల్లోర్ణలయో రురౌ చ తత్ర స్తః,
రో ళో డలటాముదితాం
తస్య చ వా లుక్సలోలోశ్చ.

సూ. నిత్యం దారాదేశ్చ స్యాల్లోర్ణలయో
రురౌ చ తత్ర స్తః. ౭3.

టీక. దారాదేః=దారాదిగణముయొక్క, లోః=లువర్ణ మునకు, నిత్యం=నిత్యముగా, స్యాత్ = అగును. 'సూత్రే

ష్వదృష్టం పదం సూత్రాంతరాదనువర్తనీయంసర్వత్ర 'అనుశబ్ది శాస్త్రన్యాయముచే బిందుయుతదుకారమును, 'ఉకారలోపమును' ప్రక్షమాబహువచనద్వితీయా బహువచనములైన లులలు పరమౌచుండఁగా వచ్చునని గ్రహింపవలెను. తత్ర= ఆదారాదుల, లులయోః=లులలకు, రురౌచ=రురలును, స్తః= వచ్చును. దారాదులనఁగా నాలుమొదలైనవి. ఉ. ఆలు,ఆండ్రు, ఆండ్ర. జవరాలు, జవరాండ్రు, జవరాండ్ర. చెల్లెలు, చెల్లెండ్రు, చెల్లెండ్ర. కోడలు, కోడండ్రు, కోడండ్ర ఇత్యాదులుచూచునది. 'అల్లుండ్రు, వాండ్రు, వీండ్రు, కాండ్రు - అల్లుండ్ర, వాండ్ర, వీండ్ర, కాండ్ర' అను నీస్థలములయందు మునుపే డువర్ణమున్నది. దారాదులలోనివికనుక రురలువచ్చినవి. కోమటివాండ్రు, కాఁపువాండ్రు. విటకాండ్రు. మొ.

సూ. రోశః. ౭౮.

టీక. రః=రవర్ణమునకు, శః=శవర్ణమువచ్చును, పిదప లులలు పరమైయుండఁగా నుల్లోపమగును. ఉ. గోరు, గోళ్లు, గోళ్ల. వేరు, వేళ్లు, వేళ్ల. ఉత్తరసూత్రముచేతనే యాయుకారలోపము వికల్పముగాన 'గోరులు, వేరులు' అనియు నుండును.

సూ. డలటాముదితాం తస్య చ వా లుక్. ౭౯.

టీక. డలటాం=డాంతలాంతటాంతములయొక్క, ఉదితాం=ఉకారేకారములకును, తస్య చ వా = అపూర్వసూత్ర

స్థమైన గోరు మొదలైనశబ్దములయొక్క రేఫమువీఁది యుకారమునకును లులలు పరమైయుండఁగా, లుక్ = వికల్పమునలోపము వచ్చును. 'రః' అని ఉకారములోపించిన పొల్లు రకారమును గ్రహించి షష్ఠ్యంత నిర్దేశము చేయుటచే నుకారలోప మైనప్పుడే రేఫమునకు ళకారము వచ్చును గాని, యుకారలోపము కానప్పుడు రేఫమునకు ళకారము లేదని తెలియునది. ఉ. గోరులు, వేరులు—గుడి, గుళ్లు. త్రాడు, త్రాళ్లు—కాలు, కాళ్లు. వ్రేలు వ్రేళ్లు. అంబలి, అంబళ్లు—చెట్టు, చెట్లు. జెట్టి, జెట్లు.

సూ. సలోలోశ్చ. ౭౮.

టీక. సలః=లకారముతోఁ గూడిన, లోశ్చ=లువర్ణమునకును లోపము వికల్పముగ వచ్చును. ఉ. 'అంబళ్గాచి, పందిళ్వేసి. వికల్పము గనుక 'అంబళ్లు గాచి, పందిళ్లువేసి' అనియు నుండును.

(2. సూ.)

49. శ్లో. ఔపవిభక్తికలీనా
మిల్లుగ్వాళం తథైవ దుశ్చ స్యాత్,
అపి సంయుక్తసమాప్తౌ
భూయో౽ంతే లుః ప్రదృశ్యతే నామ్నామ్.

సూ. ఔపవిభక్తిలీనామిల్లుగ్వాళం తథైవ
దుశ్చ స్యాత్. ౭౭.

టీక. ఔపవిభక్తికలీనామ్=ఔపవిభక్తికమందలి, లి యను నక్షరములకు, బహుళం=బహుళముగా, ఇల్లుక్=ఇకారలోపమౌను. తత్పూర్వ=ముందు చెప్పినట్లు, డుశ్చ=బిందుయుక్తమైన డువర్ణము నగును. ఉ. గుద్దలి, గుద్దళ్లు, గుద్దండ్లు. గొడ్డలి, గొడ్డళ్లు, గొడ్డండ్లు. రోఁకలి, రోఁకళ్లు, రోఁకండ్లు. బహుళగ్రహణముచేఁ గొన్నిచోటుల నిత్యముగా వచ్చును. కొన్నిచోటుల వికల్పముగావచ్చును. రానిచోటులును గలవు. పందిలి పందిళ్లు, ఇత్యాదులు ఔపవిభక్తికము లైనను రాలేదు. వికల్పమున వచ్చుచోట్లు.—దాగండ్లు, దాగళ్లు ఔపవిభక్తికముగాకున్నను వచ్చుచోటులు.—పెండిలి, పెండిండ్లు. ఇత్యాదులు. ఔపవిభక్తిక మనఁగా విభక్తి పరమైయున్నప్పుడును, సమాసమై యున్నప్పుడును 'టింట్యాదులు' గలిగినశబ్దములు. టింట్యాదులు లేనివి యౌపవిభక్తికములు కానివి. పెండిలిశబ్దమునకు విభక్తియందుఁ గాని, సమాసమందుఁ గాని టింట్యాదులు లేవు. కాన నౌపవిభక్తికము కాదు.

సూ. అపి సంయుక్తసమాప్తౌ భూయోఽంతే లుః
ప్రదృశ్యతే నామ్నామ్. ౭౮.

టీక. లుః=లుకారము, సంయుక్తసమాప్తౌఽపి=సంయుక్తాక్షరమగుచు సమాప్తమైనదైనను, నామ్నామ్= శబ్దముల యొక్క, అంతే=తుదియందు, భూయః = తిరిగి, ప్రదృశ్యతే = కనఁబడుచున్నది. ఉ. నీళ్లు. నీళ్లులు. పండ్లు, పండ్లులు. ముళ్లు, ముళ్లులు. విళ్లు, విళ్లులు. ఇత్యాదులు మహాకవిప్రయోగానుసారముగాఁ జూచుకొనునది.

(2. సూ.)

50. శ్లో. కేషాంచిదుదంతానాం
నేతి విభక్తావునో లుక్స్యాత్,
ఔపవిభక్తికనామ్నా
మత్వం స్యాత్సప్తమీతృతీయార్థే.

సూ. కేషాంచిదుదంతానాం నేతివిభక్తా
వునో లుక్స్యాత్ ౭౯.

టీక. కేషాంచిదుదంతానాం = కొన్ని యుకారాంతము లకు, నేతివిభక్తౌ=న యను సప్తమీవిభక్తి పరమగుచుండఁగా, ఉనః=ఉన్ అనుదానికి, లుక్స్యాత్=లోప మగును. చోటున ననుసప్తమ్యంతమందు టులోనియుకారమును, నకారములోని పొల్లును గూడి 'ఉన్'ఆయెను. దానికి లోపమైనయెడలఁ జోట యని నిల్చును. ఇట్లే యూర, మీఁద, మేన—నడుమునఁగట్టు- నడుమఁగట్టు. ఇత్యాదులు చూచునది.

సూ. ఔపవిభక్తికనామ్నామత్వం స్యా
త్సప్తమీతృతీయార్థే. ౮౦.

టీక. ఔపవిభక్తిక నామ్నామ్=ఔపవిభక్తిక నామములకు, సప్తమీ తృతీయార్థే=సప్తమీతృతీయార్థములయందు, అత్వం స్యాత్=అకారమువచ్చును. ఉ. వింట, ఇంట, కంట, మింట, మంట, (విల్లు, ఇల్లు, కన్ను, మిన్ను మొదలైనయౌపవిభక్తికశబ్దములకు సప్తమ్యర్థసూచకమైన 'అ' కారము వచ్చును 'విల్లు' అన్నది యౌపవిభక్తికముగాన టింటా

దులు రాఁగా 'వింటి+అ' అనియుండ సంధిఁజేయఁగా 'వింట' అయ్యెను. ఇట్లే మిగిలినవి చూచుకొనునది.)

(2 సూ.)

51. శ్లో. అనుతాం స్త్రియాం సమానాం
సర్వస్య స్త్రీసమస్య చ సులోపః,
ఏదంతతా చ నామ్నా
మన్యతరస్యామియాంతానామ్.

సూ. అనుతాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీసమస్య చ సులోపః. ౮౧.

టీక. స్త్రియామ్ = స్త్రీలింగమందు, అనుతాం = ఉకారాంతవ్యతిరిక్తములైనట్టి, సమానామ్=తత్సమశబ్దములకును, సర్వస్య=సమస్తమైన, స్త్రీసమస్యచ = స్త్రీలింగసమమైనశబ్దమునకును, సులోపః = ప్రథమైకవచనలోపమగును. అంబాశబ్దమునకీ సూత్రముచేతనే ప్రథమైకవచనలోపము వచ్చినపిదప 'దీర్ఘానాం హ్రస్వస్స్యాత్' అను దానిచే హ్రస్వముగాఁగా 'అంబ' యని నిలిచెను. ఇటులనే—గౌరి, వాణి, మాత, దుహిత, ఛాయ, మాయ. మొదలైనశబ్దములు కనుఁగొనునది. 'అనుతామ్' అన్నందున నుకారాంత స్త్రీలింగములకైన సు లోపము రాదు. ఉ. భీరువు, చంచువు. ఇవి మునుపే చెప్పినాము.

'సర్వత్రోద్రోతోర్వ్యక్త్వవతి' అనుసూత్రముచే సుప్రత్యయమునకు వుప్రత్యయము వచ్చును. ధేనువు, రంభో

రువు. స్త్రీసమమున కుదాహరణము—చాట, పాట, మేడ, గోడ. మొ.

సూ. ఏదంతతా చ నామ్నామన్యతరస్యా
మియాంతానామ్. ౮౨.

టీక. ఇయాంతానామ్='ఇయ' అనునది తుదియందుఁ గలిగిన,నామ్నామ్=ప్రాతిపదికములకు, అన్యతరస్యామ్=వికల్పముగా, ఏదంతతా చ=ఏకారాంతత్వమును వచ్చును.ఉ. మల్లియలు, మల్లెలు. కన్నియలు, కన్నెలు. నామాంతత్వగ్రహణముచే—ముత్తియము, ముత్తెము, ముత్యము. విడియము విడెము, విడ్యము. గద్దియ, గద్దె. మిద్దియ, మిద్దె. సురియ, సురె. ఇత్యాదులు చూచుకొనునది.

(4. సూ.)

52. శ్లో. వికృతౌ సర్వే శబ్దాః
క్లీబసమాః స్త్రీసమాశ్చ నాన్యే స్యుః,
క్లీబసమా అమహద్వత్
స్త్రీవత్స్యుః స్త్రీసమాస్సమాస్తు సమాః.

సూ. వికృతౌ సర్వే శబ్దాః క్లీబసమా
స్త్రీసమాశ్చ నాన్యే స్యుః ౮౩.

టీక. వికృతౌ = తెలుఁగునందు, సర్వే శబ్దాః = సమస్తము లైన శబ్దములును, క్లీబసమాః = నపుంసకసమములును, స్త్రీసమాశ్చ = స్త్రీలింగసమములును, స్యుః=అగును. అన్యే=

మఱియొకవిధమైనవి, న = లేవు. ఈయచ్చ తెనుగునందీ రెండు విధములైన శబ్దములే కాని, యితరమైన పుంలింగసమము లేదు.

సూ. క్లీబసమా అమహాద్వత్. ౧౧.

టీక. క్లీబసమాః = నపుంసకసమానమైన శబ్దములు, అమహాద్వత్ = అమహత్తులైన తత్సమములవంటి వగును. అనఁగా 'స్వాదమహాతామ్'అను సూత్రముచే ము వచ్చును. అమహత్తులవలెనే ముప్రత్యయాంతము లైయుండును. ఉ. అందము, చందము, గుజ్జము, పల్లము ఇత్యాదులు చూచుకొనునది.

సూ. స్త్రీవత్స్యుః స్త్రీసమాః. ౧౨.

టీక. స్త్రీసమాః = స్త్రీసమశబ్దములు, స్త్రీవత్ = స్త్రీలింగములవంటివి. స్యుః = అగును. అనఁగా హ్రస్వమును, విభక్తిలోపమును వచ్చుననుట. ఉ. గోడ, మేడ. మోవి, తావి. చారు, మోరు. కొన్ని యెకారాంతములు కలవు. అవియు నిట్టివిగనే గ్రహించునది. ఒల్లె, పల్లె, మట్టె, అందె, బిందె. మొ.

సూ. సమాస్తు సమాః. ౧౩.

టీక. సమాస్తు = తత్సమములైన శబ్దములు, సమాః = యథాపూర్వముగ నుండును. ఉ. రాముఁడు, సీత, రఘుకులము. ఇత్యాదులు చూచునది.

ఇతి శ్రీసకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాంధ్ర
శబ్దచింతామణౌ వజంతపరిచ్ఛేద స్సమాప్తః.

శా. కర్ణాంతాయతచారునేత్రకమలా, కర్పూరచూర్ణత్రిపా
ద్వర్ణశ్రీకరమంత్రరూపితవిభాస్వద్రూప, చిద్రూప, సౌ
వర్ణోదంచితమంచబిందుమయదీప్యద్దివ్యసింహాసనాం
తర్నిష్పందవిహార, హారకలికోద్యత్కాంచికాభూషణా.

గద్య. ఇది శ్రీసకలభాషాకవితాస్వతంత్రభట్టారక యెలకూచి బాలసరస్వతీ
మహోపాధ్యాయప్రణీతం బైన శబ్దానుశాసనటీకా
గ్రంథమునందు నజంతపరిచ్ఛేదము
సమాప్తము.

శ్రీ

# హలంత పరిచ్ఛేదము.

(2. సూ.)

53. ప్రథమైకవచనతుల్యం
సర్వత్ర హాలంతమగుణవత్ప్రభృతి,
గుణవద్గణో ద్వితీయై
కవచనతుల్యో భవేద్వికృతౌ.

సూ. ప్రథమైకవచనతుల్యం సర్వత్ర హాలంత
మగుణవత్ప్రభృతి. ౧.

టీక. సర్వత్ర = ఈ తెలుఁగునందంతటను, ప్రథమైక వచనతుల్యమ్ = ప్రథమైకవచనమునకు సమానమైనట్టి, హాలంతమ్=హాలంతపదము, అగుణవత్ప్రభృతి = అగుణవద్గణ మని పించుకొనును.

సూ. గుణవద్గణో ద్వితీయైకవచనతుల్యో భవేద్వికృతౌ. ౨.

టీక. వికృతౌ=తెలుఁగునందు, ద్వితీయైకవచనతుల్యః = ద్వితీయైకవచనతుల్యమైన హాలంతపదము, గుణవద్గణః = గుణవద్గణము, భవేత్=అగును.

(4. సూ.)

54. శ్లో. ద్విత్వోత్వే సర్వహలాం
హ్రస్వాద్ద్విత్వం తు దీర్ఘతో బహుళమ్,
అగుణవతాం సర్వహలాం
సోర్లోపో గుణవతాం డుమూ ప్రాగ్వత్.

సూ. ద్విత్వోత్వే సర్వహలాం హ్రస్వాత్. 3.

టీక. హ్రస్వాత్ = హ్రస్వాక్షరముమీఁదనుండెడి, సర్వ హలామ్=సమస్తమైనహల్లులకు, ద్విత్వోత్వే=ద్విత్వము నుత్వ మును వచ్చును.

సూ. ద్విత్వం తు దీర్ఘతో బహుళమ్. ౪.

టీక. ద్విత్వంతు = ద్విత్వమైనయెడల, దీర్ఘతః=దీర్ఘ ముమీఁదిహల్లులకు, బహుళమ్=బహుళముగావచ్చును. ఉత్వ ము నిత్యముగావచ్చును.

సూ. అగుణవతాం సర్వహలాం సోర్లోపః. ౫.

టీక. అగుణవతామ్ = గుణవద్గణము కానట్టి, సర్వహ లాం=సమస్తమైనహలంతములయొక్క, సోః=సుప్రత్యయము నకు, లోపః = లోపమువచ్చును.

సూ. గుణవతాం డుమూ ప్రాగ్వత్. ౬.

టీక. గుణవతాం=గుణవద్గణమైన శబ్దములకు, డుమూ=

డువర్ణకముమువర్ణకములు, ప్రాగ్వత్ =ముందుఁజెప్పినట్లు, మహత్తు లకు డువర్ణకమును,నమహత్తులకు మువర్ణకమును వచ్చునని తెలియునది. ఈద్విత్వోత్వవిధానము “సర్వహాలామ్” అని చెప్పినందుచే, నగుణవర్ధనశబ్దములకు మాత్రమేయనియు, నం దులోఁ గేవలహలంత మాత్రములకేయనియుఁ దెలియునది. మఱియుఁ నదివాల్లులకేయనియుఁ దెలియనగును. ఉ. సుకర్మ, సుశర్మ, విష్ణుశర్మ, నిగమశర్మ, ఇంద్రవర్మ, వజ్రవర్మ. విశ్వజిత్తు, విశ్వజిత్తులు.విష్ణుజిత్తు,విష్ణుజిత్తులు.ఇవియగుణవర్ధనమహత్తులు. కకుప్పు,కకుప్పులు.దిక్కు,దిక్కులు. వాక్కు,వాకు. వాక్కులు, వాకులు. మధులిట్టు, మధులిట్టులు. ఇవి యగుణవర్ధనామహత్తు లు. ఈదిక్కున హ్రస్వ పరహలంతములు కల్గుటచే ద్విత్వోత్వ ములు నిత్యములని తెలియునది. ఉత్వమీదిక్కున నిత్యమే కానఁ జెప్పఁబనిలేదు. ఇదియుఁగాక సుకర్ముఁడు, సుశర్ముఁడు. ఇత్యా దు లగుణవర్ధనశబ్దములు కావ ‘అగుణతాం సర్వహాలాం సోర్లో పః’ అనుసూత్రముచే సులోపమగుణవచ్ఛబ్దములకు నిత్యమని విధించియుండఁగా ‘గుణవతాం డుము మూప్రాగ్వత్’ అను సూత్రముచే గుణవచ్ఛబ్దములకే డుము వర్ణకములు విధించి యుండఁగా, వీనికి డువర్ణకప్రాప్తియెట్లు కలదనఁగా ‘దీర్ఘత్రో బహుళమ్’ అను సూత్రమందలి బహుళశబ్దము యోగవిభా గముచే నని గ్రహించునది. ‘అగుణవతాం సర్వహాలామ్’ అను సూత్రమందలి యగుణవచ్ఛబ్దమును యోగవిభాగ ముచే వేఱుగ సేకరించుకొని ‘డుమూ’ యనునవి వేఱుగాఁ దీసికొని, యన్వయించు కొనఁగాఁ బ్రథమైకవచనతుల్యమైన యగుణవచ్ఛబ్దములకు సులోపము, డుములును, బహుళము గా వచ్చునని సిద్ధమగును గాన, సులోపము లేనిపక్షమందు

మహాత్తులకు డుజాదేశము వచ్చును. సుశర్మ్ముఁడు, సుశర్ముండు. ఇత్యాదిరూపములు సిద్ధములగును. సుశర్ముఁడు, సుకర్ముఁడు. ఇత్యాదులయందు 'మహతోత ఉత్' అనుచోవ్వాన నుత్వము వచ్చునని తెలియునది. లేదా 'అన్యేషాంచేత్యాది సూత్రముచే ముందుఁజెప్పబోవురీతిని వీనిని సాధింపనగును. గుణవచ్ఛబ్దాదులకుదాహరణము. గుణవంతుఁడు, హనుమంతుఁడు, మఘవంతుఁడు, అనడ్వాహము, సంపద, సంపదలు. ఇత్యాదిశబ్దములు ప్రయోగానుసారముఁగా నుభయత్ర తెలియునది. యాంతము లేదు. రేఫాంతము పుర్ శబ్దము గుణవర్ధనములోనిదిగనుక 'పురము' అగును. తెనుఁగు వ్యవహారమూలకముగాన గీర్ శబ్దము లేదు. అభిధానమువారు యాదవాదులు నవ్యక్తలింగములు నపుంసకలింగములుగాఁ జెప్పినారు గనుక, నవ్యక్తలింగమయిన కిమ్ శబ్దము నపుంసకప్రథమైకవచనరూపమై యుండును. కిమ్ము.

(4. సూ.)

55. శ్లో. ఆత్మన ఇమనన్తానాం
డా వా డుస్స్యాత్సదా రాజ్ఞః,
సాంతాదపయః ప్రభృతేః
ష్లోపోఽన్యేషాం చ వా లుగన్తస్య.

సూ. ఆత్మన ఇమనంతానాం డావా. ౭.

టీక. ఆత్మనః=ఆత్మ(న్) శబ్దమునకు, ఇమనంతానామ్= ఇమనిచ్ ప్రత్యయాంతమైన శబ్దములకును, వా=వికల్పముగ, డా = డా ప్రత్యయము వచ్చును. డాలోని డకారమను క్త మన్యేత్యాది న్యాయమున లోపింపఁగా 'ఆ' కారముమిగులును.

'డితిపర' ఇత్యాద్యాన్యవ్యాకరణ సంప్రదాయము చొప్పున 'టి' లోపము వచ్చి 'ఆ' అనునది చేరఁగా 'ఆత్మా, గరిమా' అనునవి మొదలగు రూపములు నిల్చును. దీర్ఘాణాం హ్రస్వ ఇత్యాదికముచే హ్రస్వము రాఁగా 'ఆత్మ, గరిమ' అను రూపము లేర్పడును. ఆత్మ, ఆత్మలు, గరిమ, గరిమలు. వికల్పము గనుక డా లేనపుడు 'ఆత్మము, గరిమము' అని యుండును. మహత్తుగా వివక్షింపఁగా 'ఆత్ముఁడు, మహాగరిముఁడు' అనియుండును. ఈలాగుననే యిమన్నంతములు. మహిమ, మహిమము. మహామహిముఁడు. ఇత్యాదికమును గ్రహించునది.

సూ. డుః స్యాత్సదా రాజ్ఞః. ౮

టీక. రాజ్ఞః=రాజ(న్)శబ్దమునకు, సదా=నిత్యముగా, డుఃస్యాత్=డు ప్రత్యయము వచ్చును. డిత్త్వసామర్థ్యమున మీఁదిసూత్రమునందువలెనే టిలోపము. ఉ. రాజు, రాజులు. ప్రథకమైవచనతుల్య మిత్యాదిసూత్రముచేత ఋక్కు, ఛాక్కు, కకుప్పు మున్నగునవి సిద్ధించును. బహుళగ్రహణముచే 'అగ్నిమథుఁడు' అనుచో ద్విత్వము లేదు. ప్రథమైకవచన సూత్రముచేతనే స్రక్కు, దిక్కు ఛాక్కు మున్నగునవి సిద్ధించును. బహుళోక్తివలన 'వాక్కు, వాకు' అను రూపద్వయమేర్పడును. తకారాంతము—భూభృత్తు మొదలగునవి. భవచ్ఛబ్దము లేదు. హనుమద్భగవచ్ఛబ్దములు కొందఱి మతమున గుణవర్ధనములోనివి కావుగాన 'హనుమానుఁడు, భగవానుఁడు' అగును. హనుమంతుఁడు 'భగవంతుఁడు' అనియు నుండును. 'అప్'శబ్దము 'అప్పు' బహు

త్వమున 'అప్పులు' అని యుండును. పైరీతినే 'ప్రశానుఁడు' అను రూపము నెన్నవలెను. దీనికి గుణవర్ణరూపము లేదు.

సూ. సాంతాదపయఃప్రభృతేః స్లోపః. ౯.

టీక. అపయః ప్రభృతేః = పయోగణము కానట్టి, సాంతాత్ = సకారముమీఁద, స్లోపః = సకారమునకు వికల్పమున లోపమువచ్చును

సూ. అన్యేషాం చ వా లుగంతస్య ౧౦.

టీక. అన్యేషాంచ = ఇతరములైన హలంతముల యొక్క, అంతస్య = అంతమునకు, వాలుక్ = వికల్పముగ లోపమువచ్చును. సకారాంతములయంతలోపమున కుదాహరణము. తమము, మనము, తేజము, ఉరము. ఇవియపయోగణములు. పయోగణమునకు లోపము లేదు. పయస్సు, వయస్సు. అంతలోపాభావపక్షమున సపయోగణశబ్దములు గూడ సగుణవర్ణములోనివని తెలియునది. కనుకనే'ద్విత్వో త్వేసర్వహలామ్' అను సూత్రముచే సంత్యసకారమునకు ద్విత్వోత్వములు వచ్చుచున్నవి. తమస్సు, మనస్సు. సకారలోపపక్షమున గుణవర్ణములోని వానికివలెనే, డు, ము, లు వచ్చుచున్నవి. ఏకశబ్దమునకే ద్వివిధకార్యము లుండుట విరుద్ధముకాదు. పాణినీయశాస్త్రమందొక ధాతువునకే గణాంతరపాఠముచేరూపభేదములు గలుగుటగలదు. ఇట్లు ప్రయోగానుసారముగాఁ జూచుకొనునది. చంద్రముఁడు, ఉశనుఁడు, చతుశ్శ్రీవుఁడు, చంద్రమసుఁడు, ఉశనసుఁడు, చతు

శ్మశ్రువసుఁడు 'అన్యేషామ్' అనుసూత్రమున కుదాహరణము. అగుణవర్ణవివక్షచేత ద్విత్వోత్వములు రాఁగా 'జగత్తు' అని యుండును. దానికి నంత్యలోపమువచ్చి ముప్రత్యయము రాఁగా జగమని సిద్ధించును. ఇట్టిశబ్దములయందుఁ బ్రయోగానుసారముగా రూపద్వయమును గనుఁగొనునది. చకార ప్రయోగమువలన నంత్యాచ్చులకు వర్ణాంతరమువచ్చి యంత్యహల్లోపమౌను. పథము.

(1. సూ.)

56. శ్లో. ప్రాకృతభవసంస్కృతభవ
సంస్కృతవత్ప్రాకృతభవవికృతిభవాః,
వ్యతిరిక్తా భూయాంసో
వ్యతిరిక్తాస్సంప్రదాయతో వేద్యాః. ౧౧

టీక. ప్రా...వాః=ప్రాకృతమువలనను గేవలాంధ్రభాష వలనను బుట్టినటువంటిశబ్దములు ప్రాకృతదేశభాషాభవముల వంటివియు సంస్కృతభవ ప్రాకృతముల వంటివియునగును, వ్యతిరిక్తాః=వర్ణాగమవర్ణలోపములచేత భిన్నములైన సంస్కృతభవ ప్రాకృతభవములు, భూయాంసః=అపరిమితములు. వ్యతిరిక్తాః=వ్యతిరిక్తశబ్దములు, సంప్రదాయతోవేద్యాః = పెద్దల ప్రయోగములవలనఁ దెలియునది.

ఉ. అంబరము, ఉదుంబరము మొదలైనశబ్దములు. జమున, జముఁడు మొదలైనవి సంస్కృతభవ ప్రాకృతసమములు. చందురుఁడు, చందమామ, సంద్రము మొదలైనవి సంస్కృతభవములు. వ్యతిరిక్తములైనవి పుడమిమొద

లైనవి.బహుళము కనుకఁ బెద్దలప్రయోగములవలనఁ దెలియు
నది. ('ఈయార్యావృత్తము సంప్రదాయవేద్యము' అని కొ
న్నిమాతృకలలో నున్నది. అట్లే కవిజనాంజనములోను ను
న్నది. కొన్నిమాతృకలలో నీశ్లోకమే లేదు. ముద్రితమగు నీ
గ్రంథమునకు మాతృకయగు 11-12-5 నెంబరుగల మాతృక
లోఁగూడ నీశ్లోకమును దీనిటీకయు హలంతపరిచ్ఛేదము ముగి
యనిచ్చి కట్టకడపట వ్రాయఁబడెను. కాఁగానీ టీక ప్రక్షిప్తమని
తోఁచెడిని)

(2. సూ.)

57. శ్లో. దేశ్యాదస్మద్యుష్మ
చ్ఛబ్దాత్సుజసోర్నమూ వురూ చ స్తః,
న్నమ్నౌ హ్రస్వశ్చాదే
రమి శశి చాన్యతరలుక్చయుక్తస్య.

సూ. దేశ్యాదస్మద్యుష్మచ్ఛబ్దాత్సుజసోర్నమూవురూచ స్తః.౧౨

టీక. దేశ్యాత్ = ఆంధ్రదేశజన్యమయిన, అస్మద్యుష్మ
చ్ఛబ్దాత్ = అస్మద్యుష్మచ్ఛబ్దములమీఁద నుండునట్టి, సుజ
సోః = ప్రథమైకవచనబహువచనములకు క్రమముగా, ను
మూ = నువర్ణక మువర్ణకములును, వురూచ = వువర్ణక
రువర్ణకములును, స్తః=వచ్చును. అస్మచ్ఛబ్దమునకు 'ను. ము'
అనువర్ణకములు, యుష్మచ్ఛబ్దమునకు 'వు, రు' అను వర్ణకము
ములు వచ్చును. యుష్మదస్మచ్ఛబ్దములకుఁ దత్సమములు లేవు.
కనుక దేశ్యపుఁదెనుఁగులే చెప్పుచున్నాఁడు. 'నా' అనునది
అస్మచ్ఛబ్దము. 'నీ' అనునదియుష్మచ్ఛబ్దము.

సూ. న్నుమ్నా హ్రస్వశ్చాదేరమి శశి చ;
అన్యతరలుక్చ యుక్తస్య. ౧౩.

టీక. అమిశశిచ = ద్వితీయైకవచన బహువచనముల యందు, న్నుమ్నూ = న్నువర్ణక మ్నువర్ణకములు రెండుశబ్దములకుఁ గ్రమముగావచ్చును. ఆదేః = ఆ రెండుశబ్దముల యొక్క యాద్యక్షరములకు, హ్రస్వశ్చ = ద్వితీయావిభక్తి యందే హ్రస్వమునువచ్చును. యుక్తస్య=సంయుక్తమైన యాదేశవర్ణములలో,అన్యతరలుక్చ=(రెంటిలో) ఒక యక్షరమునకు వికల్పమున లోపమువచ్చును.

(4. సూ.)

58. శ్లో. కిర్నజమః ప్రథమాయాం
మేదస్మద ఏతయోర్బహుత్వే మః,
హ్రస్వే టాదౌ నమవాన్
ద్వయవద్వచనద్వయేఽన్యయోరాత్తా.

సూ. కిర్నజమః. ౧౪.

టీక. జమః = షష్ఠీవిభక్తికి, కిర్న=కి రాదు, 'ఇతాంజసః కిశ్చ' అనుచొప్పున ఇకారాంతమగు నీశబ్దమునకు 'కి' రాదు, కువర్ణకమే వచ్చునని తెలియునది.

సూ. ప్రథమయా మేదస్మదః ౧౫.

టీక. అస్మదః=అస్మచ్ఛబ్దమునకు, ప్రథమాయామ్=ప్రథమావిభక్తియందు, ఏత్=ఏకారమువచ్చును.

సూ. ఏతయోర్బహుత్వే మః. ౧౬.

టీక. ఏతయోః = ఈయస్మద్యుష్మచ్ఛబ్దములకు, బహుత్వే=(సర్వవిభక్తి) బహువచనములయందు, మః=మవర్ణము వచ్చును. ఉ. నేను, మేము. నీవు, మీరు. నన్ను, నను. మమ్ము, మము. నిన్ను, నిను. మిమ్ము, మిము. నీచేత. మీచేత నాచేత, మాచేత. ఇత్యాదిరూపములు సకల విభక్తులయందుఁ దెలియునది. తత్సమములైనయుష్మదస్మచ్ఛబ్దములకుఁ బ్రయోగము లేదు కాన 'నా, నీ' అను దేశ్యదీర్ఘైకారాన్తాస్మద్యుష్మచ్ఛబ్దములకుఁ బ్రయోగవ్యవహారసామర్థ్యము కలుగుటచేత వాని గ్రహించి రూపములు విధించినాఁడని ఈవఱకే తెలుపఁబడెను.

సూ. హ్రస్వే టాదౌ నమవాన్ ద్వయవద్వచన ద్వయేఽన్యయోరాత్మా. ౧౭.

టీక. ఆత్మా=స్వపదార్థవాచకమును నాత్మశబ్దపర్యాయమునయిన 'తా' అను దేశ్యశబ్దము, టాదౌ = తృతీయాదివిభక్తులయందు, హ్రస్వే = హ్రస్వమునందుచుండఁగా, నమవాన్= 'న, మ' అను నాగమములు గలుగును. (వచనద్వయమందు వరుసగాననుట) అన్యయోః=ప్రథమాద్వితీయలయొక్క,వచనద్వయే = ఏకవచనబహువచనములయందు, ద్వయవత్ =అస్మద్యుష్మచ్ఛబ్దములు రెంటివలె వరుసగానౌను. ఏకవచనమందు

అస్మచ్ఛబ్దమువంటిదియు, బహువచనమందు యుష్మచ్ఛబ్దము వంటిదియునగుననుట. అస్మచ్ఛబ్దప్రథమా ద్వితీయల యేకవచనములు, నున్నలు, యుష్మచ్ఛబ్ద ప్రథమాద్వితీయా బహువచనములు రుమ్ములు, న్నుమ్ములయందు దాదిహ్రస్వము వచ్చును. ఉ. తాను, తారు, తన్ను, తను, తమ్ము, తము, తనచేత, తమచేత. ఇత్యాదిరూపములు సకలవిభక్తులందును దెలియునది.

(1 సూ.)

59. శ్లో. భూయ ఉభయార్థవాచీ
యః కశ్చిద్భవతి నిత్యబహువచనః,
తస్య జసో ము శసో లః
ప్రాగ్వత్సర్వం భిసాదికేఽన్యత్ర. ౧౮

టీక. భూయః = ఈయుష్మదస్మచ్ఛబ్దములుకన్న వేఱొకటియగు, ఉభయార్థవాచీ=యుష్మదస్మచ్ఛబ్దముల యర్థమును జెప్పునట్టి, యః=యేదేనైన, కశ్చిత్ = ఒకానొకశబ్దము, నిత్యబహువచనః = నిత్యబహువచనమైనది, భవతి = అగుచున్నదో, తస్య = ఆశబ్దముయొక్క, జసః=ప్రథమాబహువచనమునకు, ము = ముపర్ణకమువచ్చును. శసః=ద్వితీయాబహువచనమునకు, లః = లవర్ణకమువచ్చును. భిసాదికే = తృతీయాబహువచనము మొదలైన, అన్యత్ర = ఇతరవిభక్తిబహువచనములయందు, ప్రాగ్వత్ =యుష్మదస్మచ్ఛబ్దములకువలె,సర్వమ్=సమస్తమైనరూపమును దెలియునది.

అస్మద్యుష్మచ్ఛబ్దో భయవాచకమైనశబ్దము.'మన'అను

నది లోకవ్యవహార సిద్ధమైయున్నది. మనము, మనల, మనచేత ఇత్యాదులు చూచుకొనునది. ఆత్మ (న్) శబ్దము జీవాత్మపర మాత్మ వాచకమైనపుడు 'ఆత్మ, ఆత్ముఁడు' అను రెండురూపములు గలవు. స్వపదార్థవాచకమైనయాత్మ (న్) శబ్దము తా నను దేశ్యశబ్దము చేతనే వ్యవహరింపఁబడుచున్నది.

(1. సూ.)

60. శ్లో. కవిభల్లటైః క్రియాణాం
నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యేషు,
ప్రథమైకవచనమాత్రే
వికృతౌ నాంతాదయోఽపి కథ్యంతే. ౯౯

టీక. కవిభల్లటైః = కవిభల్లటాచార్యులనెడి పురాతన లక్షణకర్తచేత, క్రియాణామ్= క్రియలకును, నామ్నాంచ = సతరూపా[illegible]=దిన్నీ, ఉల్లోపః = అంత్యమైన యుకారము నకులోపము, ఇష్యతే = ఇచ్ఛయింపఁబడుచున్నది. ఏషు = ఈప్రదేశములయందు, ప్రథమైకవచనమాత్రే=ప్రథమైక వచమాత్రమందు, (ఈశబ్దములు అచ్చతెనుఁగులు) నాంతాదయోఽపి=నకారాంతములు మొదలైన శబ్దములును, వికృతౌ= తెనుఁగునందు, కథ్యంతే=చెప్పఁబడుచున్నవి. ఆదిశబ్దముచేత లాంతమును, రాంతమును గ్రహించుకొనునది. ఉ. మెత్తురుసులు, చూడర్జనులు, పేర్వాడి, గోర్గోపి, సేవితున్ రాముని, పోషింతున్ విప్రుని, కన్ దెఱచి, కన్ మూసి, చన్ గుడిపి, విల్నెఱకి, కల్ ద్రావి, పల్ మోపి, గోర్నాటి, ఏర్దాటి, వనముల్చేరి, శరముల్ దాఁకి. ఇత్యాది ల, ర, నాంత

ములు చూచుకొనునది. ఇదికాక రాంతములయందు అంద ర్వచ్చి, కొంద ర్వెడలి, సేవింతుర్మహారాజులు, రక్షింతుర్మహా దాతలు. ఇత్యాదులు. లోకమం దప్రసిద్ధములు కానఁ బ్రయోగింపరాదు ఇట్టిప్రయోగములు పూర్వులైన వాగ నుశాసనప్రభృతులు ప్రయోగించియుండినయెడల నట్టి ప్ర యోగములయందు 'స్థితస్య గతిశ్చింతనీయా' అను న్యాయ ముచే స్థితగతిఁజించుటమాత్ర మే కాని యిప్పటివారలు సాహ సించి ప్రయోగింపరాదు. మునుపటివారలే ప్రయోగింపక పోవుటచే నప్రసిద్ధములైనట్టి రాంతసుబంతములు, నట్టిరాంత తిజంతములు నిప్పటికవులారీతిని స్వతంత్రులై ప్రయోగించిన యెడల'ఇహ తు ప్రవ్యాహార్యం సంకేతితసుప్రసిద్ధమేవ పదమ్' అనుసూత్రన్యాయమున నట్టి సాహసప్రయోగములను శబ్దజ్ఞు లైన పెద్దలు సహింపరని తెలియునది.

(1. సూ.)

61 శ్లో. ఇదమదసేతదన్య త్త
చ్ఛబ్దాశ్శబ్దాంతరాన్వయే బహుళమ్,
హ్రస్వం ప్రపద్య దీర్ఘా
ద్విత్వముపర్యక్షరస్య జనయంతి. ౨౦

టీక. దీర్ఘాః=దీర్ఘములైన, ఇద...బ్దాః=ఇదంశబ్దము- అదస్ శబ్దము - ఏతచ్ఛబ్దము - యచ్ఛబ్దము - తచ్ఛబ్దము నెడి యీయైదుశబ్దములు, శబ్దాంతరాన్వయే=ఇతరశబ్దముతోనన్వ యముకలుగుచుండఁగా, బహుళమ్=బహుళముగా, హ్రస్వమ్ =

హ్రస్వమును, ప్రపద్య=పొంది, ఉపర్యక్షరస్య = పైనుండునక్షరమునకు, ద్విత్వమ్=ద్విత్వమును, జనయంతి=పుట్టించుచున్నవి. ఇదమద ఏతదర్థక మీాశబ్దము. యచ్ఛబ్ద మేశబ్దము. తచ్ఛబ్ద మాశబ్దము. ఉ. ఈదేశము, ఇద్దేశము. ఈకాంత, ఇక్కాంత. ఈమహిమ, ఇమ్మహిమ—ఏదేశము, ఎద్దేశము—ఆకాలము, అక్కాలము. ఆముని, అమ్ముని. ఆవేల్పు, అవ్వేల్పు. ఆయూరు, అయ్యూర్య. ఇట్లచ్చుపరమగునప్పుడు దానిని లఘుయకారయుక్తముచేసి యాయకారమునకు ద్విత్వముచేయవలెను. ఇదమదన్శబ్దైతచ్ఛబ్దము లేకార్థకములు. భేదములేదు. మఱియు నిచ్చట

'ఊష్మరేఫాన్పరిత్యజ్య ద్విత్వం సర్వహలాం మతమ్'

అని యథర్వణకారికయున్నది. ఊష్మరేఫాన్=శషసహరేఫములను, పరిత్యజ్య=విడిచిపెట్టి, సర్వహలామ్=సమస్తమైనవ్యంజనములకు, ద్విత్వమ్=ద్విత్వము, మతమ్=సమ్మతము. ఈయిదమాదిశబ్దములమీాదనుండు తక్కిన సర్వహల్లులకును ద్విత్వము వచ్చునని తాత్పర్యము. ఉ. ఈశాంతి, ఏషణ్ముఖుఁడు, ఆసరసి, ఆసరసుఁడు, ఆసేన, ఆహరి, ఆహరుఁడు, ఏహరిహయుఁడు, ఆరాచపట్టి, ఏరాముఁడు, ఈరాగము, ఈరాయి. ఇత్యాదులయందు ద్విత్వములేదు. ఇవివినా తక్కిన యక్షరములకు ద్విత్వమువచ్చును. బహుళగ్రహణమువలన నది, యిది, యేది, యిత్యాదులయందు 'అద్ది, యిద్ది, యెద్ది' అనురూపములు సిద్ధించును.

'క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః క్వచిద్విభాషా కచిదన్యదేవ'

అని బహుళశబ్దమున కర్థము నిర్ణయింపఁబడినందున లక్ష్యము కాకున్నను ద్విత్వము వచ్చినది. నన్నయభట్టుగారు సూత్ర

మందు బహుళగ్రహణముఁజేసి యుండుటచేతను, బహుళ ప్రవృత్తిచతుర్విధ మాటచేతను, సూష్మరేఫాదిస్థలముల యందుఁ బ్రవర్తింపకపోయెనని సూత్రకారతాత్పర్యము నెన్నఁగును. ఈయర్థమునే యథర్వణాచార్యులు ప్రత్యేకము గా వివరించి చెప్పినారని తెలియునది.

(4. సూ.)

62. శ్లో. దిస్స్యాత్సంబంధార్థే
సర్వస్మాద్యుష్మదస్మదాత్మభ్యః,
ద్వితివర్ణకోఽయవః స్త్రీ
విషయాస్త్వర్థే తనశ్చ వికృతౌ స్యాత్.

సూ. దిస్స్యాత్సంబంధార్థే సర్వస్మాత్. ౨౧.

టీక. సర్వస్మాత్ = సమస్తమైనశబ్దములమీఁద, సంబంధార్థే = సంబంధార్థమందు, దిఃస్యాత్ = ది యనునక్షరము వచ్చును. ఉ. రాజుది, బంటుది, పులిది, మేఁకది. రాజుదిహయము, రామదిపుస్తకము, వైశ్యునిదిధనము ఇత్యాదులు. ఈ సూత్రముచే సర్వత్ర దివర్ణకమువచ్చునుగాన నపవదించి యుష్మదస్మదాత్మ (న్) శబ్దములకు విశేషించి చెప్పుచున్నాఁడు.

సూ. యుష్మదస్మదాత్మభ్యో ద్వితివర్ణకః. ౨౨.

టీక. యుష్మదస్మదాత్మభ్యః='నీ నా తా'అను నీమూఁడు శబ్దములమీఁదను, ద్వితివర్ణకః='దు' అనువర్ణకము సంబం

ర్థమందు వచ్చును. ఉ. నాదుసొమ్ము, నీదుగరిమ, తనదు కీర్తి ఇత్యాదులు. 'తనదు' అనుచోట సంబంధార్థమందు 'హ్రస్వే టాదౌ నమవాః' అను సూత్రముచే బ్రాతిపదికమునకు హ్రస్వము నవర్ణకమువచ్చినవి. బహువచనమునకైన మకారమువచ్చును. ఆపక్షమందుఁ దమదుధనములు. యుష్మదస్మచ్ఛబ్దములకు బహుత్వమందు మత్వమువచ్చినయెడల మీాదుగృహములు, మాదుగృహములు. సూత్రకారులు విశేషించి సూత్రించినారుకాన యుష్మదస్మదాత్మ (న్) శబ్దములకు సంబంధార్థమందు దువర్ణకమే ప్రయోగింపవలయుఁగాని సర్వసాధారణమైన దివర్ణకముఁ బ్రయోగింపరాదని శబ్దజ్ఞులు తెలియునది.

సూ. అయవః స్త్రీవిషయాః. ౨౩.

టీక. అయవః (ఇది ద్వంద్వసమాసము) = 'అ, ఇ, ఉ' అను నీమూఁడును, స్త్రీవిషయాః = స్త్రీవాచకములమీాఁద వచ్చువర్ణకములని తెలియునది. ఉ. లచ్చ,లచ్చి, లచ్చు. రామ, రామి, రాము. గౌర, గౌరి, గౌరు. మల్ల, మల్లి, మల్లు పోల, పోలి,పోలు. యెల్ల,యెల్లి,యెల్లు. ఇందులో నివర్ణాంతములైన శబ్దము లల్పత్వవాచకములై బాల్యపర్యాయములు హైన్యపరములునై యుండును. అవర్ణాంతోవర్ణాంతములు బహుమానవాచకములై యుండును. ఇట్లు శబ్దతారతమ్య మెఱిఁగి ప్రయోగింపఁదగినది. ఇవే తెనుఁగు స్త్రీలింగములమీాఁదవచ్చెడివని యనవచ్చును. ముంత, పడి, తూము. ఇట్టివానిని స్త్రీసమములుచేసికొని సులోపముచేసికొన వలెను.

సూ. త్వార్థే తనశ్చ వికృతౌ స్యాత్. ౨౮.

టీక. వికృతౌ = తెనుఁగునందు. త్వార్థే = భావార్థమందు, తనశ్చ = తనయనువర్ణకము, స్యాత్ = అగును. ఉ. దొరతనము, నెఱతనము, దొడ్డతనము, పెద్దతనము, పిన్నతనము, పడుచుతనము ఇత్యాదులు. చకారగ్రహణము వలన ఱికప్రత్యయము వచ్చును. పెద్దఱికము.

(౨. సూ.)

63. శ్లో. నామ్నః కవర్ణకస్స్యా
త్స్వార్థే స్యాదుత్వమపి పరే తస్మిన్,
చురితి క్రియాపదానాం
సర్వేషాం వర్తమానకాలే స్యాత్.

సూ. నామ్నః కవర్ణకస్స్యాత్స్వార్థే స్యా
దుత్వమపి పరే తస్మిన్. ౨౯.

టీక. స్వార్థే = స్వకీయార్థమందు, నామ్నః = ప్రాతిపదికమునకు, కవర్ణకస్స్యాత్ = కవర్ణకమువచ్చును. తస్మిన్పరే = ఆకవర్ణకము పరమౌచుండఁగా, ఉత్వమపి = పూర్వాక్షరమునకు నుత్వమును, స్యాత్ = వచ్చును. తస్య యనుషష్ఠ్యంతమందు 'తస్మిన్' అని సప్తమ్యంతమును ప్రయోగించినారు. కాన నీప్రాతిపదికాంత్యమునకు 'ఉ'వర్ణము వచ్చును. ఉ పాలఁతుక, పాలఁతుకలు. నెలఁతుక, నెలఁతుకలు. మెలఁతుక, మెలఁతుకలు. నిప్పుక, నిప్పుకలు. గొంతుక, గొంతుకలు ఇత్యాది. ఆపిశబ్దస్వారస్యమున, 'మెలఁత, నెలఁత' ఇత్యాదులును నుండును.

సూ. చురితి క్రియాపదానాం సర్వేషాం
వర్తమానకాలే స్యాత్. ౨౬

టీక. సర్వేషామ్=సమస్తములైన, క్రియాపదానామ్=క్రియాపదములకు, వర్తమానకాలే = వర్తమానార్థమందు, చురితి స్యాత్=చువర్ణకమువచ్చును. ఉ. జయింపుచున్నాఁడు, రక్షింపుచున్నాఁడు. ఇత్యాదిరూపములు క్రియాపరిచ్ఛేదమందుఁ దెలియఁదగినవి. ఇచ్చటఁ బ్రసంగవశమున సూత్రించినాఁడు.

(త్రి. సూ.)

64. శ్లో. ప్రతిషేధవాచినాం ని
ర్భూతార్థానాం తు నః క్రియాణాం స్యాత్,
కర్త్రాదేః కర్తృత్వం
ప్రథమా చ నవర్ణకశ్చ తద్వత్స్యాత్.

సూ. ప్రతిషేధవాచినాం నిః. ౨౭.

టీక. ప్రతిషేధవాచినామ్=నిషేధమును జెప్పు క్రియావాచకములకు, నిః=నివర్ణకమువచ్చును. ఉ. ఘటింపనివాఁడు, రక్షింపనివాఁడు, చూడనివాఁడు. మొ.

సూ. భూతార్థానాం తు నః క్రియాణాం స్యాత్. ౨౮.

టీక. భూతార్థానామ్=భూతార్థమును జెప్పునట్టి, క్రియాణామ్=క్రియలకు, నఃస్యాత్=నవర్ణకమువచ్చును. ఉ. కొలిచినవాఁడు, బ్రతికినవాఁడు.

సూ. కర్త్రాదేః కర్తృత్వం ప్రథమా చ నవర్ణకశ్చ
తద్వత్ స్యాత్. ౨౯.

టీక. కర్త్రాదేః=కర్త్రాద్యర్థములకు, కర్తృత్వమ్= కర్తృత్వమును, ప్రథమాచ=ప్రథమావిభక్తియు, తద్వత్=ఆవిధమునసె, నవర్ణకశ్చ=నవర్ణమును, స్యాత్=అగును. ఉ. నీవు నుతించినరాజు. ఇది కర్త్రార్థకమునందు నీచే నుతింపఁబడినరాజనియుండును. నీచేత ననుతృతీయకుఁ బ్రథమవచ్చెను. నుతింపఁబడ్డ యను కర్త్రార్థమునకుఁ గర్తృత్వమును, భూతార్థమందు నవర్ణకమును వచ్చెను. ఆదిశబ్దగ్రహణమువలన నధికరణాద్యర్థములయందును, గర్తృత్వ ప్రథమానవర్ణకములు వచ్చును. నేభుజించినచోటు, నేవసించినచోటు, నీవుగెలిచినరాజ్యము, నీవుకొలిచినరాజు. ఇత్యాద్యర్థభేదములు చూచుకొనునది.

(2. సూ.)

65. శ్లో. షష్ఠీ భవేద్ద్వితీయా
తుల్యా తత్పురుషసంస్థితా నామ్నామ్,
ఇదుపోత్తమోత్తమానాం
బహువచన ఉపోత్తమేత ఉద్భవతి.

సూ. షష్ఠీ భవేద్ద్వితీయా తుల్యా తత్పురుష
సంస్థితా నామ్నామ్. ౩౦

టీక. నామ్నామ్= ప్రాతిపదికములయొక్క, తత్పురుషసంస్థితా = తత్పురుషసమాసమందుండునట్టి, షష్ఠీ=షష్ఠీవిభక్తి, ద్వితీయాతుల్యా = ద్వితీయావిభక్తితోసమమైనది, భవేత్ =

అగును. ఉ. రాముగుణములు, రామునిగుణములు. మలపట్టి. శంభురాణి. కలుములపడఁతి. కవిసేర్పు. వనముదగ్గఱ. ఇత్యాది.

సూ. ఇదుపోత్తమోత్తమానాం బహువచన
ఉపోత్తమేత ఉద్భవతి. ౩౧.

టీక. ఇదుపోత్తమోత్తమానామ్=ఉత్తమమనఁగానంత్యాక్షరము. ఉపోత్తమమనఁగా దానికి డాసినయక్షరము. ఆ రెంటను నికారముగల 'బలిమి, కలిమి, చెలిమి, వేలిమి, మేలిమి' అను జాతిశబ్దముల, ఉపోత్తమేతః=ఉపోత్తమముయొక్క యికారమునకు, బహువచనే=బహువచనమందు, ఉద్భవతి=ఉకారమువచ్చును. ఉత్తమేకారములకు 'ఉద్బహుత్వే,' అను సూత్రముచేత నుకారమువచ్చినది. ఉ. బలుములు, కలుములు, మేలుములు, చెలుములు. ఇత్యాది. ఇది ప్రాయికలక్షణముగాన 'ఇరులు, విరులు' ఇత్యాదులందు వర్తింపదు.

(4. సూ.)

66. శ్లో. అస్మద్యుష్మద్వాచ్యా
దేకత్వ ఇతో నిఃప రేషాం తు,
ధర్మోత్తమమధ్యమవ
ద్బహుషు న మధ్యవదుతోఽచ్చ సర్వేషు.

సూ. అస్మద్యుష్మద్వాచ్యా దేకత్వ ఇతో నిః. ౩౨.

టీక. అస్మద్యుష్మద్వాచ్యాత్ = అస్మద్యుష్మద్వాచ్యమైన, ఇతః = ఇకారాంతశబ్దమునకుఁ దర్వాత, ఏకత్వే= ఏక

వచనమందు, నివీ = క్రమముగా నివర్ణక వివర్ణకములు వచ్చును. (అస్మద్వాచ్యమైనప్పుడు నివర్ణకము, యుష్మద్వాచ్యమైనప్పుడు వివర్ణకమును వచ్చును.) ఉ. నేనుగవిని, నీవుకవివి. నేనుహరిని, నీవుహరివి. నేనుదల్లిని, నీవుతండ్రివి.

సూ. పరేషాం తు ధర్మోత్తమమధ్యమవత్. 33.

టీక. పరేషాంతు = ఇకారాంతవ్యతిరిక్తశబ్దములకు. ధర్మోత్తమమధ్యమవత్ - ధర్మ=తద్ధర్మక్రియలయొక్క, ఉత్తమ మధ్యమవత్ = ఉత్తమపురుషమధ్యమపురుషముల కేకవచన మందువచ్చు వర్ణకములవంటివివచ్చును. ఉ. నేను రాముఁడను, నీవు లక్ష్మణుఁడవు, నేనుజంద్రుఁడను, నీవింద్రుఁడవు, నేనుభక్తుఁడను, నీవు దేవతవు, నేను ధాతను, నీవు నేతవు. ఇవియేకవచన ప్రయోగములు.

సూ. బహుషు న మధ్యవత్. 34.

టీక. బహుషు = బహువచనములయందు, నమధ్యవత్ = తద్ధర్మ మధ్యమపురుషవర్ణములురావు. ఉత్తమపురుష ప్రథమపురుష బహువచనవర్ణకములు వచ్చును. అనఁగా మువర్ణకములువచ్చుననుట. ఉ. మేము భక్తులము. వీరు దేవతలరు.

సూ. ఉతోఽచ్చ సర్వేషు. 35.

టీక. సర్వేషు=ఈచెప్పిన 'ను, వు, ము, రు' అను నవి పరముగునప్పుడు,ఉతః=అంత్యమైన యుకారమునకు,అచ్చ=అకా

రమును వచ్చును. 'భక్తుఁడు' అనుచోట నంతో్యకారము నకు 'నువులు, మురులు' పరమైనపుడు, 'అ'కారము రాఁగా 'భక్తుఁడను భక్తుఁడవు.' 'భక్తులము, భక్తులరు' అని యుండును. 'కవిని' అనుచోట నుకారములేదు గనుక 'అ'కారములేదు. 'కవులము' అన్న చోట 'కవులు' అను నుకారమునకు నత్వమువచ్చును. సూత్రములో నస్మచ్ఛబ్దము పూర్వనిర్దిష్టమైనను వ్యవహారప్రధానము యుష్మచ్ఛబ్దము గనుకఁ బ్రథమపురుషవంటిదాయెను. 'సర్వేషు' అన్నాఁడు గనుక క్రియలయొక్క యుకారమునకును, 'అ'కారమువచ్చును. ఉ. పోగడుచున్నాఁడను. ప్రోచుచున్నాఁడవు. ఇత్యాది. 'జవరాలవు, ముద్దరాలవు' అనుచోటులను నిశ్లే 'అ'కారము తెలియునది.

(ఆ. సూ.)

67. శ్లో. సర్వవిభక్తిస్సంస్కృత
తుల్యాన్యస్యాః క్వచిత్ప్రవేచ్ఛాన్యా,
ఏకత్వం భేదకగత
బహువచనానాం చ దృశ్యతే వికృతౌ.

సూ. సర్వవిభక్తిస్సంస్కృతతుల్యా. ౩౬.

టీక. సర్వవిభక్తిః=ప్రథమాదివిభక్తులన్నియు, సంస్కృతతుల్యా = సంస్కృతముతో సమానమైయుండును. అనఁగాఁ బ్రథమాదిసప్తవిభక్తులలో సంస్కృతవ్యాకరణశాస్త్రమం దేయర్థమున నేది విధింపఁబడునో యాయర్థమందావిభక్తియే యాంధ్రమందును వ్యవహరింపఁబడునని తాత్పర్యము.

ఉ. పాడుగు, కొంచెము. తూమెడు. ప్రస్టెడు, ఇత్యాది ప్రాతి
పదికార్థపరిమాణాద్యర్థములయందుఁ బ్రథమావిభక్తివచ్చును.
హరిఁదలఁచె, అంబఁగొలిచె, గ్రామముఁబొందె. ఇత్యాది స్థల
ములయందుఁ గర్మార్థమందు ద్వితీయావిభక్తి. శూలముచేతఁ
బొడిచె, చక్రముచేత సంరక్షించె, సురలచేత నుతింపఁబడె.
ఇత్యాదిస్థలములఁ గర్తృకరణాద్యర్థములందుఁ దృతీయావిభ
క్తి. విప్రులకొఱకు ధనమిచ్చె, దేవతలకొఱకు నుపహారము,
గురువులకొఱకు దక్షిణయిచ్చె. ఇత్యాదిస్థలముల సంప్రదానా
ర్థమందుఁ జతుర్థి. గిరివలనవెడలె, చోరులవలన భయమునొం
దిరి. ఇత్యాదిస్థలములయం దపాదానార్థభయత్రాణాద్యర్థము
లయందుఁ బంచమీవిభక్తి. రాజునకుహితుఁడు, రాజుయొక్క
హితుఁడు, హరికిదాసుఁడు. ఇత్యాదులయందు సంబంధార్థ
ముల షష్ఠీవిభక్తి. కవితయందునేర్పరి, కాశియందున్నాఁడు,
కంచియందునిలిచె. ఇత్యాదులయం దధికరణార్థముల సప్తమీ
విభక్తివచ్చును. అంబనుఁబ్రోవవే, ఓయమ్మచన్నియ్యవే, ఓ
దేవీరక్షింపవే. ఇత్యాదులయందు సంబోధన ప్రథమావిభక్తి
వచ్చును. ఈ యీరీతి నాయాయర్థములయం దాయావిభ
క్తులు సంస్కృతమందువలెనే యీయాంధ్రమందును గ్రమ
ముగావచ్చునని తెలియునది.

సూ. అన్యస్యాః క్వచిద్భవేచ్చాన్యా. 3౭.

టీక. అన్యస్యాః = ఒకవిభక్తికి, అన్యా = మఱియొక
విభక్తి, క్వచిద్భవేత్ = ఒకానొకచోట నగును. ఉ. 'విప్రులకు
దానమిచ్చుట' యనుచోటఁ జతుర్థికి షష్ఠివచ్చెను. 'శిరస్సు

నందు గురుపాదుకలు వహించెను.' అను చోటఁ దృతీయకు సప్తమివచ్చెను. 'రాముఁడు దండకారణ్యా మేఁగెను.' అను చోట షష్ఠికిఁ బ్రథమవచ్చెను. 'అచ్చటికి సుఖమేఁగినాఁడు.' అనుచోటఁ దృతీయకుఁ బ్రథమవచ్చెను. ఇది కాక సుఖము గానుండె, జ్ఞానోదయముగా శివుభజించె; ఇత్యాది క్రియా విశేషణస్థలములయందు ద్వితీయకుఁ బ్రథమవచ్చెను. క్రియా విశేణములకుఁ గర్మత్వముఁ, గ్లీబత్వము, నేకవచనమును బాణి నీయసూత్రముచే విధింపఁబడినవి. కానఁ గర్మార్థమైన ద్వితీయ కుఁ బ్రథమ, క్లీబత్వముచేత ముప్రత్యయము, నేకత్వము నాంధ్రమందు వచ్చెనని తెలియునది.

సూ. ఏకత్వం భేదకగతబహువచనానాం చ
దృశ్యతే వికృతౌ. ౩౮.

టీక. వికృతౌ = తెనుఁగునందు, భేదకగతబహువచ నానామ్=విశేషణముల బహువచనములకు,ఏకత్వంచ=ఏకవచన మును, దృశ్యతే=చూడఁబడును. విశేష్యము బహువచనమై నను విశేషణ మేకవచనమైయుండును. విశేష్యానుగుణముగ విశేషణము లింగత్రయమునను, వచనద్వయమునను,దత్తద్విభ క్తులనునుండుట స్వభావసిద్ధమే కనుకఁ దద్విషయము వేఱుగాఁ జెప్పఁబనిలేదు. ఉ. 'ఇంపైన జవరాండ్రు,నీకీర్తులు విఖ్యాతమా యెను, విప్పైనకన్నులు' ఇత్యాది. లింగవ్యత్యయవచన వ్యత్యయములు సంస్కృతమందునుఁ గలవు. కనుకఁ దన్నా శ్రయముగా నిక్కడను గలదని తెలియునది.

ఇచ్చటనుండి సమాసవిధానము.

(తి. సూ.)

63. శ్లో॥ ద్విగుకర్మధారయాఁత
త్పురుషద్వంద్వా బహువ్రీహిః,
అన్యే చ కేచిదుపమా
నోత్తరపదలోపరూపకాఖ్యాద్యాః.

64. శ్లో. పరిదృశ్యా ఇహ కార్యా
ఔపవిభక్తికపదంతవిధయశ్చ,
లోపశ్చవిభక్త్యాదే
శ్శబ్దేషు స్యాత్సమాసకాంగేషు.

సూ. ద్విగుకర్మధారయాఁతత్పురుషద్వంద్వాబహువ్రీహిః,
అన్యే చ కేచిదుపమానోత్తరలోపరూపకాఖ్యాద్యాః.
పరిదృశ్యా ఇహ. ౩౯.

టీక. ద్విగుకర్మధారయౌ = ద్విగుకర్మధారయ సమాసములును, తత్పురుషద్వంద్వౌ=తత్పురుషద్వంద్వసమాసములును, తథా=అట్లు, బహువ్రీహిః=బహువ్రీహిసమాసమును, ఉపమానోత్తరపదలోపరూపకాఖ్యాద్యాః — ఉపమాన = ఉపమానపూర్వ పదోపమానోత్తర పదసమాసములు, ఉత్తర పదలోప = ఉత్తరపదలోపసమాసమును, రూపక = రూపక సమాసమును, ఆద్యాః=మొదలైన, అన్యే = తక్కిన, కేచిత్ = మఱికొన్ని సమాసములును, ఇహ = ఈ తెనుఁగునందు, పరిదృశ్యాః=చూడఁదగినవి. ఉ. ముచ్చిచ్చు, నలుదెస. ఇత్యాదులు ద్విగుసమాసములు.

*'సంఖ్యాపూర్వోద్విగుః' అనున్యాయముచే నిచ్చట ద్విగుసమాసము సంఖ్యాపూర్వముగాఁ జూచుకొనునది. త్రిలోకి. పంచపూగి. పంచవటి. పంచపాత్రము. త్రిభువనము. చతుర్యుగము. ఇత్యాది ద్విగుసమాసములు తత్సమమందుఁ జూచుకొనునది. వాలమ్ములు, పండువెన్నెలలు. ఇవి మొదలైనవి దేశ్యకర్మధారయములు. వాడిమయూఖములు, వేఁడిపయోధారలు మున్నగునవి. "ఆంధ్రం షడ్వర్ణపర్యంతం సంస్కృతేన సమస్యతే" అను నథర్వణవచనము చొప్పున సమ్మతములు. నీలఘటము, కృష్ణసర్పము, బాలలత, నీలోత్పలము. ఇవి తత్సమకర్మధారయములు. కర్మధారయ మనఁగా విశేషణవిశేష్యసమాసమనుట. సామానాధికరణ్యమున నిది యుండును. మల్లెపూవు, కోకచెఱఁగు, మామిడిచిగురు, రాజపురుషుఁడు, బ్రాహ్మణపుత్త్రుఁడు. ఇత్యాదులు తత్పురుషసమాసములు. డాలు షమాములు, తల్లిదండ్రులు, అన్నదమ్ములు, రామలక్ష్మణులు, భరతశత్రుఘ్నులు. ఇత్యాదులు ద్వంద్వసమాసములు. దంతోష్ఠము, పాణిపాదము, రథాశ్వము మొదలగుచోటులందు 'ద్వంద్వశ్చప్రాణితూర్యసేనాంగానామ్' అను సూత్రముచే నేకవద్భావము వచ్చినది. ఈశ్వరులు, బ్రాహ్మణులు. ద్వంద్వైకశేష సమాసము. అలరువిలుతుఁడు, ముక్కంటి, కఱకంఠుఁడు, వేవెలుఁగు, చలివెలుఁగు, నలువ, వేఁడివెలుఁగు, పులుఁగు, పడగ, పీతాంబరుఁడు, నీలాంబరుఁడు, పంకజోదరుఁడు. మొదలగునవి 'అన్యపదార్థప్రధానో బహువ్రీహిః' అను చొప్పున బహువ్రీహిసమాసములు. మచ్చెకంటి, చంద్రముఖి. ఇవి యుపమానపూర్వపదబహువ్రీహులు. మేఘశ్యా

ముఁడు, పురుషవ్యాఘ్రుఁడు, మెఱుఁగుఁబోఁడి, పాణిపల్లవ
ము. ఇవి యుపమానసమాసములు. జవ్వాదిసెట్టి, పచ్చళ్ల
రామక్క, వంటలరంగమ్మ, శాకపార్థివుఁడు, దేవబ్రాహ్మణుఁడు,
శివద్విజుఁడు. ఇవి యుత్తరపదలోపసమాసములు. మోవి
పండు, కేలుఁదమ్మి, పూములుకులు, చిగురుఁగటారి, పాణి
పద్మము, పుష్పబాణము. ఇవి రూపకసమాసములు. ఇవికాక
తావిమొగ్గ, వలపుగంధవాఁడి, చక్రి, కరి. ఇవి మతుప్ సమా
సములు.

సూ. కార్యా ఔపవిభక్తికవదంతవిధయశ్చ. ౪౦.

టీక. అంతవిధయశ్చ = సమాసాంతప్రత్యయవిధులును,
ఔపవిభక్తికవత్ = ఔపవిభక్తికవర్ణములవంటివిగా, కార్యాః =
చేయఁదగినవి. ఉ. పూవిలుతుఁడనుచోటఁ దకారము సమా
సాంత ప్రత్యయము. వాలుగంటి యనుచోట టకారము.
నలువ యనుచోట హ్రస్వము. కలికంతుఁ డనుచోట తకార
మును నివి సమాసాంతము లని తెలియునది. తెలుఁగున
తకారములేకున్నను స్వభావసిద్ధమయినదికాదు గనుక సమా
సాంతప్రత్యయవికారమని తెలియునది. కల్మాషపాదుఁడు, వజ్ర
కరుఁడు, వజ్రపాణి. ఇత్యాదులు సప్తమ్యుత్తరపదబహువ్రీహి
సమాసములని తెలియునది.

సూ. లోపశ్చవిభక్త్యాదే శ్శబ్దేషు స్యా
త్సమాసకాంగేషు. ౪౧.

టీక. సమాసకాంగేషు = సమాసకముఁలకవయవములైన,
(సమాసకమనఁగా నచ్ఛాంధ్రసమాసము.) శబ్దేషు = శబ్దముల

యందు, విభక్త్యాదేః=విభక్తిమొదలైనవానికి సిద్ధసమాసము లందువలెనే, లోపశ్చస్యాత్=లోపమును వచ్చును. (ఇందుచే లుక్సమాసము నలుక్సమాసము నను రెండునుగలవు) ఉ. వేల్పులయొక్క దొర వేల్పుదొర. ఇచ్చట షష్ఠికిలోపము. కైదువయొక్క దారి కైదువదారి. ఇచ్చటను షష్ఠికిలోపము. ఇట్లే వేల్పుచెట్టు, గట్టురాకొమరుఁడు ఇవి లుక్సమాసములు. ఆదిశబ్దముచే దమ్మివంటి కన్ను గలది యనుచోట నుపమానలోపము. జవ్వాది+అమ్ము+సెట్టి, జవ్వాదిసెట్టి, కఱ(నలుపు)+కంటమందుఁ గలవాఁడు కఱకంఠుఁడు. వీనియందుత్తరపదలోపమని తెలియునది. విభక్తిలోపించినను నిలలకు లోపము లేదు. వేల్పులతేనియింతి, వేల్పులయొజ్జ, జేజేల ప్రోవు,మావులతోట, గుఱ్ఱాలలాయము, రామునిగుణములు, రాజులసభ, కవులవార్తలు. ఇవియ లుక్సమాసములు.

(౨. సూ.)

70. శ్లో. కేవలవికృతిపదైర్య
స్సమాసకం తం బ్రువంతి వాక్యజ్ఞాః,
సంస్కృతవైకృత శబ్దై
ర్మిశ్రసమాసస్స ఏవ విజ్ఞేయః.

సూ. కేవలవికృతిపదైర్యస్సమాసకం తం
బ్రువంతి వాక్యజ్ఞాః. ౭౨.

టీక. యః=ఏసమాసము, కేవలవికృతిపదైః=శుద్ధాంధ్ర ...దములతో సమసింపఁబడునో, తమ్ = దానిని, వాక్యజ్ఞాః=

వైయాకరణులు, సమాసకమ్ = సమాసకమని, బ్రువంతి=చెప్పుదురు. ఉ. నిండుపున్నమజాబిల్లి, వెన్నెలతేట, వేణామనిచిగురు, క్రొమ్మావితోఁట, కెమ్మోవిపంటితేనెలు, చక్కెరఖాణపుఁదేజీవజీరుండు. ఇత్యాదులు సమాసకములని చెప్పఁబడును.

**సూ.** సంస్కృతవైకృతశబ్దైర్మిశ్రసమాసస్సఏవ విజ్ఞేయః. ౪౩

టీక. సంస్కృత...శబ్దైః=సంస్కృతములు తెలుఁగులు కూడిన, మిశ్రసమాసః=మిశ్రసమాసము, సఏవ=మిశ్రసమాసమనియే, విజ్ఞేయః=తెలియఁదగినది. ఉ పద్మాకరపుఁదావిచెలువు, సరైశ్వర్యలక్ష్మినెలవు, గట్టుదొరకన్యరామణీయకము ఇవి మిశ్రసమాసములు. సమాసవేళ 'ము' అను దానికి 'పు' వచ్చునని మునుపే చెప్పితిమి గనుక 'పద్మాకరపు' అనినైనది.

(2. సూ.)

71. శ్లో. సంస్కృతపదేన పరిమిత
మాంధ్రపదం కర్మధారయో భవతి,
స్వస్వవిభక్తివికారై
ర్బహువశ్చ యథాయథం సమస్యంతే.

**సూ.** సంస్కృతపదేన పరిమితమాంధ్రపదం
కర్మధారయో భవతి. ౪౪.

టీక. పరిమితమ్ = మిక్కిలికొంచెమైన, ఆంధ్రపదమ్ = తెనుఁగుపదము, సంస్కృతపదేన=సంస్కృత పదముతోఁగూడి,

కర్మధారయోభవతి = కర్మధారయమవును. ఉ. కలికి భుజంగ కన్యలు, వేలుపు వీరభటవర్గము, వాఁడిమయూఖములు, వాఁడి బాణములు. ఈడిక్కున నథర్వణాచార్యులు కర్మధారయసమాసమందుఁ బూర్వపదమై యాంధ్రపదముపరిమితమై యుండవలయునని పలికిన సూత్రకార తాత్పర్యమును "ఆంధ్రం షడ్వర్ణపర్యంతం సంస్కృతేన సమస్యతే" అని పరిమాణనిర్ణయముఁజేసి వివరించినారు. కావునఁ బునుఁగుం దావివవోదనము, చిన్నారిపొన్నారిపదములు సాధువులని గ్రహింపవలెను.

సూ. స్వస్వవిభక్తివికారైర్బహవశ్చ
యథాయథం సమస్యంతే. ౮౫.

టీక. బహవశ్చ=అనేకశబ్దములు, యథాయథం = యథేచ్ఛముగా, (సంస్కృతముమీఁదఁ దెనుఁగును, దెనుఁగుమీఁద సంస్కృతమును నన్యోన్యము నొకటితోనొకటి కలసిమెలసి) స్వస్వవిభక్తి వికారైః=తమతమవిభక్తి వికారములతోఁ గలిసి, సమస్యంతే = సమసించును. వికారము లనఁగా నాపవిభక్తికాదులు. ఉ. మేటిమునిరాజు, బ్రహ్మాండపుఁగ్రైదువు, ముక్కంటిగేహిని, పుట్టినింటి సంపత్తి పెంపు, అత్తింటిసౌభాగ్యలక్ష్మీ సొంపు. ఇత్యాదులు తెలియునది.

ఇతి శ్రీసకలభాషావాగనుశాసనవన్నయభట్టః రచితాంధ్రశబ్ద
శబ్దచింతామణౌ హలంతపరిచ్ఛేద స్సమాప్తః.

శా. ఆమ్నాయశ్రుతిపాద్యహృద్యమహిమా, వ్యాసాదిశిష్టైకసే
వ్యామ్నామార్గరతానుభావ్య,తులకన్యాభ్యర్చనాఖండిత
ద్యుమ్నాభీప్సితదానదక్షిణబిగత్వాఙ్ఘ్రిపంకేరుహా
నిమ్నావర్తవిశోభినాభికనుయుఙ్నిర్వృత్కృపావైభవా.

గద్య. ఇది శ్రీసకలకవితాస్వతంత్రభట్టారక యెలకూచి బాలసరస్వతీ
మహోపాధ్యాయప్రణీతంబయిన శబ్దానుశాసన టీకా
గ్రంథంబునందు హలంతపరిచ్ఛేదంబు
సమాప్తము.

శ్రీ

# క్రియాపరిచ్ఛేదము.

(4. సూ.)

72. శ్లో. ఉపకృతిపరిణతిసంవృతి
భేదాత్త్రివిధా క్రియా పుషణ్వాదిః,
ఉపకృతిరథ భూజ్యాదిః
పరిణతిరన్యా తు రంజివస్యాదిః.

సూ. ఉపకృతిపరిణతిసంవృతిభేదాత్త్రివిధా క్రియా. ౧.

టీక. ఉపకృతిపరిణతిసంవృతిభేదాత్=ఉపకృతి-పరిణతి-సంవృతి యను భేదములవలన, క్రియా=ధాతువు, త్రివిధా=మూఁడువిధములు.

సూ. పుషణ్వాదిరుపకృతిః. ౨.

టీక. పుషణ్వాదిః = 'పుషపుష్టౌ, ణుస్తుతౌ' ఇవి యాదిగాఁగల ధాతుసమూహము, ఉపకృతిః=ఉపకృతి క్రియ యనఁబడును.

సూ. అథ భూజ్యాదిః పరిణతిః. ౩.

టీక. అథ=అటుతరువాత, భూజ్యాదిః='భూసత్తాయామ్, జిజయే' అనునవి మొదలుగాఁగల ధాతుచయము. పరిణతిః=పరి

ణతి క్రియ యనఁబడును.

సూ. అన్యా తు రంజివస్యాదిః. ౮.

టీక. రంజివస్యాదిః='రంజ రాగే, వసనివాసే' అనునవి మొదలైన ధాతుసమూహము, అన్యా=సంవృతిసంజ్ఞకలది, స్యాత్=అగును. సామాన్యముగా సకలక్రియాపదములలోను గొన్ని యుపకృతి సంజ్ఞకలవియుఁ, గొన్ని పరిణతి సంజ్ఞగలవియుఁ, గొన్ని సంవృతి సంజ్ఞకలవియు నై యుండునని తెలియునది.

(3. సూ.)

73. శ్లో. స్యాదుపకృతిః కృదంతా

సా పరిణతిరయవరన్వితైవ భవేత్,

సంవృతిరహతాకారా

జ్ఞేయం త్రివిధాసు చ క్రియాస్వేవమ్.

సూ. స్యాదుపకృతిః కృదంతా. ౯.

టీక. కృదంతా=కృత్ప్రత్యయాంతమైన — క్తిన్, ఘఞ్ మొదలయిన కృత్తులతోఁగూడి నిలిచియుండెడి క్రియ, ఉపకృతిః=ఉపకృతి సంజ్ఞకలది, స్యాత్ = అగును. ఘఞంతము పోషించు. క్తిన్నంతము నుతించు.

సూ. సా పరిణతిరయవరన్వితైవ భవేత్. ౬.

టీక. అయవరన్వితైవ='అయ్, అవ్, అర్.' అను శబ్దములతోఁగూడిన క్రియయొద్దియో, సా=అది, పరిణతిః=పరిణతి

సంజ్ఞకలది, భవేత్=అగును. జయించు. (అయ్) ప్రభవించు. (అవ్) హరించు. (అ౽)

సూ. సంవృతిరహతాకారా. ౭.

టీక. అహతాకారా - అహత=మార్పునందని,ఆకారా= ఆకారముగల క్రియ, సంవృతిః = సంవృతి సంజ్ఞకలదియగును. ఉపదేశకాలమందలి స్వరూపముతోనే యుండుననుట. ఉ. రంజించు, వసించు.

సూ. జ్ఞేయం త్రివిధాసు చ క్రియాస్వేవమ్. ౮.

టీక. ఏవం=ఈప్రకారముగా, త్రివిధాసుచ = మూఁడు విధములైన, క్రియాసు = క్రియలయందు, జ్ఞేయమ్=తెలియఁదగినది.

(2. సూ.)

74. శ్లో. తద్ధర్మవర్తమానా
తీతాగామ్యర్థకాః క్రియా జ్ఞేయాః,
తత్ర ద్వితీయతుర్యౌ
యాతౌ స్తస్సానుబంధకావేవ.

సూ. తద్ధర్మవర్తమానాతీతాగామ్యర్థకాః
క్రియాః జ్ఞేయాః. ౯.

టీక. క్రియాః = ఈమూఁడువిధములైన క్రియలు, తద్ధ... కాః-తద్ధర్మ = తద్ధర్మము, వర్తమాన = వర్తమానము,

అతీత = భూతము, అనాగమ్యర్థకాః = భావి యనెడియర్థములు గలవిగా, జ్ఞేయాః = తెలియఁదగినవి. తద్ధర్మమనఁగా భూత భవిష్యద్వర్తమానార్థములకంటె విలక్షణమైన యొకానొక ధర్మము. ఆధాతువుయొక్క యర్థమే యది యగుటచేతఁ దద్ధర్మ సంజ్ఞ యన్వర్థకము.

సూ. తత్ర ద్వితీయతుర్యౌ యౌతౌ
స్తస్సానుబంధకావేవ. ౧౦.

టీక. తత్ర=ఆయర్థచతుష్టయమందు, ద్వితీయతుర్యౌ= రెండవది నాలుగవదియునగు వర్తమానభవిష్యదర్థములు గలవి, యౌ=ఎవ్విరెవో, తౌ=ఆశబ్దములు, సానుబంధకావేవ= అనుబంధముతోఁగూడినవియే, స్తః=అగును.

(2. సూ.)

75. శ్లో. వసతిరనుబంధకస్స్యా
ద్యత్ర లడర్థో వివక్షితస్తత్ర,
అస్తిరనుబంధకస్స్యా
ద్యత్ర లృడర్థో వివక్షితో ధాతోః

సూ. వసతిరనుబంధకస్స్యాద్యత్ర లడర్థో
వివక్షితస్తత్ర. ౧౧.

టీక. యత్ర=ఎచ్చట, లడర్థః = వర్తమానార్థము, వివక్షితః = వివక్షింపఁబడునో, తత్ర=అచట, ధాతోః = ధాతువునకు, వసతిః='వసనివాసే' అను ధాతువు, వసధాతువునర్థము

నిచ్చు 'ఉన్నా' అనుచని, అనుబంధకః స్యాత్ =అనుబంధకమౌను. (అనఁగా నిత్యముగా ననపాయముగా సంబంధించి యుండు ననుట.)

సూ. అస్తిరనుబంధకస్స్యాద్యత్ర లృడర్థో
వివక్షితో ధాతోః. ౧౨

టీక. యత్ర=ఎచ్చట, లృడర్థః = భవిష్యదర్థము, వివక్షితః = వివక్షింపఁబడునో, తత్ర=అచట, ధాతోః = ధాతువునకు, అస్తిః= 'అసభువి' అను ధాతువు = అసధాతువునర్థము నిచ్చుకలయనునది, అనుబంధకస్స్యాత్ =అనుబంధకమగును.

(2. సూ.)

76. శ్లో. భవతి క్రియాపదానాం
త్రివిధానామించుగాగమో దేశ్చ,
అనుబంధప్రార్థనయో
ర్ణా వ్యతిరేకాదికే చ చోః పస్స్యాత్.

సూ. భవతిక్రియాపదానాం త్రివిధానా
మించుగాగమో దేశ్చ. ౧3.

టీక. త్రివిధానామ్='ఉపకృతి, పరిణతి, సంవృతి' అను మూఁడువిధములైన, క్రియాపదానామ్=క్రియాపదములకు, దేశ్చ=ణిచ్చునకును, ఇంచుగాగమః='ఇంచుక్' అనెడియాగమము, భవతి=అగుచున్నది. అనఁగా సకర్మకముగానీ, యకర్మకముగానీస్వార్థమునందించుగాగమము వచ్చుననుట. 'హలంత్యమ్' అను

పాణినీయ సూత్రముచే నించుక్కులోని కకారమిద్వర్ణమై పోవును. ఉపకృత్యాది త్రివిధతత్సమక్రియలకు నించుగాగమము వచ్చునని చెప్పుటచేత దేశ్యక్రియలకు రాదని సిద్ధమయ్యెను. చేయు, డాయు. ణిజంతమునకును, ప్రత్యేకించి యించుగాగమము విధించినాఁడు. కాన నాణిచ్చు తత్సమదేశ్యక్రియలకు సమానము కనుక, ణిజంతమైన తత్సమక్రియలకువలెనే, ణిజంతములైన దేశ్యక్రియలకును నించుగాగమము వచ్చును. చేయించు. బ్రతికించు. వ్రాయించు.

సూ. అనుబంధప్రార్థనయోర్ణౌ వ్యతిరేకాదికే
చ చోః పస్స్యాత్. ౧౪.

టీక. అనుబంధప్రార్థనయోః=అనుబంధద్వయమందును ప్రార్థనములయందును, ణౌ=ణిచ్చునందును, వ్యతిరేకాదికేచ= వ్యతిరేకాదికమందును, చోః=చువర్ణమునకు, పః=పవర్ణమాదేశముగాను, స్యాత్=వచ్చును. తద్ధర్మార్థమున కుదాహరణము. 'పోషించును, నుతించును' అనునివి యుపకృతిక్రియలు. 'జయించును, అభినయించును, అనుభవించును, సంభవించునుహరించును, అనుసరించును, అనుకరించును.' అనునివి పరిణతిక్రియలు. అనురంజించును, అధివసించును. ఇత్యాదులు సంవృతి క్రియలు. ఈతద్ధర్మక్రియారూపములయందు 'ప్రథమైకవచనలోపః' అని ముందుఁజెప్పఁబోవు సూత్రముచేఁ బ్రథమపురుషైకవచనమైన తిప్పునకు లోపమురాఁగాఁ బయి తద్ధర్మార్థకక్రియారూపములు సిద్ధించెను. ణిచ్చున కుదాహరణము. రక్షింపించును. పోషింపించును. అనుబంధాదులందలి పత్వ

మున కుదాహృతులు - ఘటింపుచున్నాఁడు, ఘటింపఁగలఁడు. అనుబంధాలు. ఘటింపుము, ప్రార్థనము. ఘటింపించె, ణిచ్చు. ఘటింపఁడు, వ్యతిరేకము. ఆదిశబ్దముచేత ఘటింపనోపు మొదలయినచోటులను 'ప' కారమువచ్చును.

(3. సూ.)

77. శ్లో. వ్యతిరేకాదౌ భావిని
చాత్స్యాత్ క్త్వాభూతయోః క్రియాంత్యస్యేత్,
ప్రథమైకవచనలోప
స్తద్ధర్మాతీతయోః క్రియాణాం స్యాత్.

సూ. వ్యతిరేకాదౌ భావిని చాత్స్యాత్. ౧౮.

టీక. వ్యతిరేకాదౌ=వ్యతిరేకాద్యర్థములందును, భావినిచ=భవిష్యదర్థమందును, అత్స్యాత్ = అకారమువచ్చును. అత్త్వము కళాప్రదేశముకాదు గాన భావికర్త్రర్థములలో ద్రుతాంతమగును. ఉ. రక్షింపఁడు, రక్షింపఁగలఁడు. ఆదిశబ్దముచేత ఘటింపఁబడు, ఘటింపలేదు. అను కర్మార్థాదులయందును నగును.

సూ. క్త్వాభూతయోః క్రియాంత్యస్యేత్. ౧౯.

టీక. క్త్వాభూతయోః = క్త్వార్థభూతార్థములయందు, క్రియాంత్యస్య = క్రియాంత్యమునకును, ఇత్ = ఇకారము వచ్చును. అనుభవించి, అనుసరించి. అనుభవించితివి, అనుసరించితివి.

సూ. ప్రథమైకవచనలోపస్తద్ధర్మాతీతయోః
క్రియాణాం స్యాత్. ౧౬.

టీక. తద్ధర్మాతీతయోః = తద్ధర్మభూతార్థములయందు, క్రియాణామ్ = క్రియలకు, ప్రథమైకవచనలోపస్స్యాత్ = ప్రథమపురుషైకవచనమునకు లోపమువచ్చును. ఉ. హరించు, హరించె. ఇందు 'హరించె' అనుచోట 'ప్రథమైకస్యైత్వభవేచ్చ భూతార్థే' అను వక్ష్యమాణసూత్రముచేత నెత్వము వచ్చినది.

(తె. సూ.)

75. శ్లో. వ్యతిరేకార్థే లృటి లటి
డుజ్స్యాత్ స్త్ర్యర్థే పునర్దుదీ భవతః,
అన్యస్యాచ్ఛాధాతో
ర్ధాతుత్వవివక్షయైవ భవతీంచుక్.

సూ. వ్యతిరేకార్థే లృటి లటి డుజ్స్యాత్. ౧౭.

టీక. వ్యతిరేకార్థే = వ్యతిరేకార్థమందును, లృటి = భవిష్యదర్థమందును, లటి = వర్తమానార్థమునందును, పురుషకర్తృకములయిన క్రియల ప్రథమైకవచనమునకు, డుజ్ స్యాత్ = డుజ్ఞువచ్చును. జకారము 'హలంత్యమ్' అనుచోటప్పున నిత్తుగాన పోవును. డువర్ణకమిట్లు ఇత్తుగాన "సానునాసికోచ్చారణం జిత్" అను ప్రాకృతవ్యాకరణము చొప్పున నర్ధబిందు పూర్వకమగును. ఉ. రక్షింపఁడు, రక్షింపఁగలఁడు, రక్షింపుచున్నాఁడు.

సూ. స్త్ర్యర్థేపునర్డుదీ భవతః. ౧౮.

టీక. స్త్ర్యర్థేపునః=స్త్రీక ర్తృకమైనపుడు, డుదీభవతః = 'డుదీ'అనునవి వచ్చును. వ్యతిరేకమునందును, భావియందును డువర్ణకమును, వర్తమానార్థమున దివర్ణకమును వచ్చును. ఉ. రక్షింపదు, రక్షింపఁగలదు, రక్షింపుచున్నది.

ఈదిక్కున వర్తమానార్థమునందలి ప్రథమ పురుషైక వచనరూపమును రక్షధాతువునకు సాధించు ప్రక్రియ దిఙ్మాత్రముగఁ జూపఁబడుచున్నది. అనుక్తన్యాయమున రక్షధాతువునకు లట్టుచేయఁగా 'వసతిరనుబంధకస్సాన్యత్' అనుసూత్రముచే వసధాత్వర్థమైన 'ఉన్నా' అనుశబ్దము ('ఉన్న' అను పాఠాంతరము గ్రహించునపుడు పునరాగమసూత్రముచే దీర్ఘము చేసికొనవలెను.) కర్త్రర్థమం దనుబంధమై నిలుచును. 'వ్యతిరేకార్థే' అనుసూత్రముచేఁ బ్రథమ పురుషైకవచనమునకు 'డుజ్' వచ్చును. 'రక్ష+ఉన్నా+డు. అని యుండఁగా, 'భవతి క్రియాపదానామ్' అను సూత్రముచేత ధాతువునకించుగాగమము రాఁగా, నిత్యసంధిచేసికొనఁగా, రక్షించు + ఉన్నాఁడు. అనినిలిచెను. ఇంచుక్ అనునది 'ఆద్యంతౌటకితౌ' అను సూత్రముచేతఁ గిత్తుగాన నంత్యమునకువచ్చును. 'అనుబంధ ప్రార్థనయోః' అనుసూత్రముచేత 'ఉన్నా'నుబంధము పరమగుచుండఁగా నించుక్సంబంధమైన చకారమునకు 'ప' కారము వచ్చును. 'చుకితి క్రియాపదానామ్' అనుసూత్రముచే వర్తమానార్థముగావున 'చు'వర్ణకమువచ్చును. కాఁగా 'రక్షింపుచున్నాఁడు' అనురూపము సిద్ధించును.

'వినోపపదభాజః స్యుస్వాథవో భ్వాదయః క్రియాః'

అను నథర్వణవచనముచొప్పున 'ఉపపదములు' లేక భూధాతువు మున్నగుకొన్ని యాంధ్రమునఁ బ్రయోజ్యములు కావు. 'భవింపుచున్నాఁడు. కరింపుచున్నాఁడు.' అనురీతిని బ్రయోగింపరాదు. 'అనుభవింపుచున్నాఁడు, అనుకరింపుచున్నాఁడు, ఆజ్ఞాపింపుచున్నాఁడు.' అనురీతిని బ్రయోగింపవలెను.

సూ. అన్యస్మాచ్చాధాతో ర్ధాతుత్వవివక్షయైవ
భవతీంచుక్. ౧౯.

టీక. అధాతోః=ధాతువుకానట్టి, అన్యస్మాత్=ఇతరప్రకృతిపై ననఁగాఁ బ్రాతిపదికముమీఁద, ధాతుత్వవివక్షయైవ=ధాతువను వివక్షచేతనే, ఇంచుక్=ఇంచుగాగమము, భవతి=అగును. ఉ. కరుణింపుచున్నాఁడు, కరుణింపఁగలఁడు, విస్తరించును, విస్తరింపుచున్నాఁడు, విస్తరింపఁగలఁడు. ఇచట నించుగాగమ చువర్ణమునకుఁ బత్వము వచ్చుచుండఁగా "వ్యతిరేకాద్వా భావిని చాత్వాస్యాత్." అనుసూత్రముచేత నత్త్వము వచ్చి 'విస్తరింపఁగలఁడు.' అనురూపము నిష్పన్నమయ్యెను. ణిచ్చున కుదాహరణము— పోషించిపించు, పోషింపింపుచున్నాఁడు, పోషింపింపఁగలఁడు, పోషింపింపఁబడును, పోషింపింపుచున్నది. పోషింపింపఁగలదు. ఇచటఁ బోషించు, అని యుండఁగా, 'హేతుమతిచ' అను సూత్రముచేత హేతుమదర్థమందు ణిచ్చు వచ్చును. 'పోషించు + ఇ + ఉన్నాఁడు' అని యుండును. 'భవతిక్రియాపదానామ్' అను కారికయం

దలి 'ణేశ్చ' అను సూత్రముచే ణిచ్చునకును నించుగాగము వచ్చును. 'పోషించు + ఇంచు + ఉన్నాఁడు' అనియుండును. 'అనుబంధప్రార్థనయోః' అను సూత్రముచే బూర్వమైన యించుగాగమ చువర్ణమునకును, ణిచ్చుసంబంధమైన యించు గాగమ చువర్ణమునకును 'ప' వర్ణము రాఁగాఁ బోషింపింపు చున్నాఁడను రూపము సిద్ధించెను.

(2. సూ.)

79 శ్లో. తిర్యగ్జడేషు కర్తృషు
బహువచనం చైకవచనమేవ స్యాత్,
భూతే తద్ధర్మే చా
న్యత్ర పుమ్ స్త్రీవదేకవచనం తు.

సూ. తిర్యగ్జడేషు కర్తృషు బహువచనం చైకవచన
మేవ స్యాద్భూతే తద్ధర్మే చ ౨౦.

టీక. తిర్యగ్జడేషు=తిర్యక్కులు నప్రాణులు, కర్తృషు సత్సు=కర్తలవుచుండఁగా, భూతే=భూతార్థమందును, తద్ధర్మే చ=తద్ధర్మార్థమందును, బహువచనమ్=ప్రథమపురుష బహు వచనము, ఏకవచనమేవ = ఏకవచనమే, స్యాత్ = అగును. ఉ. సింహములు చరించె, గుఱ్ఱములువచ్చె. గజము లను సరించు, పర్వతములు కదలె, ఏఱులు ప్రవహించు.

సూ. అన్యత్ర పుమ్ స్త్రీవదేకవచనం తు. ౨౧.

టీక. అన్యత్ర=వ్యతిరేక భవిష్యద్వర్తమానార్థముల యందు బహుత్వమున, వువీ=వువి వర్ణములు క్రమముగా వచ్చును. ఏకవచనంతు = ఏకవచనమన్ననో, స్త్రీవత్ = స్త్ర్యర్థమందువలె నగును. 'స్త్ర్యర్థేపునః' అను సూత్రముచొప్పున వ్యతిరేక భవిష్యదర్థములలో దువర్ణకమును, వర్తమానమున దివర్ణకమును వచ్చుననుట.

'మదీ తిర్యగ్జడస్త్రీషు తేష్వర్థేష్వేకతాం గతౌ'
అని యథర్వణుఁడును జెప్పెను.

ఉ. వృక్షములు ప్రబలవు, వృక్షములు ప్రబలఁగలవు, వృక్షములు ప్రబలుచున్నవి, వృక్షము ప్రబలదు, వృక్షము ప్రబలఁగలదు, వృక్షము ప్రబలుచున్నది. ఇట్లే చిలుకలు రంజిల్లవు. చిలుకలు రంజిల్లఁగలవు, చిలుకలు రంజిల్లుచున్నవి. మొ.

(సూ. 2)

80 శ్లో. ఉత్వయుతౌ వనకారౌ
స్యాతాం మధ్యోత్తమైకవచనానామ్,
సర్వేషాం బహువచనే
రు ఇతి స్యాదుత్తమస్య తు భవేన్నుః.

సూ. ఉత్వయుతౌ వనకారౌ స్యాతాం
మధ్యోత్తమైకవచనానామ్. ౨౨.

టీక. మ...నామ్=మధ్యమపురుషోత్తమ పురుషైకవచనములకు, ఉత్వయుతౌ = ఉకారయుక్తములైన, వనకారౌ= వకార నకారములు, స్యాతామ్ = అగును. తద్ధర్మాద్యర్థము

లందుఁ బ్రవర్తించిన సమస్తమైన క్రియలకును మధ్యమపురు షైకవచనమునకు వువర్ణకము, 'ఉ' త్తమ పురుషైకవచనమునకు నువర్ణకమును వచ్చునని తెలియునది. ఉ. నీవు రక్షింతువు, నేను రక్షింతును. నీవు సేవించితివి, నేనుభజించితిని. ఈభూతార్థ క్రియారూపములయందు విధింపఁబడిన మధ్యమోత్తమైక వచన వువర్ణక నువర్ణకములకు 'భూతాదుతాం పరేషామిత్' అనుసూత్రముచేత నికారము వచ్చినదని తెలియునది. అనుభ వింపుచున్నావు, విహరింపుచున్నాను. నీవు జయింపఁగలవు. నేను విక్రమింపఁగలను. నీవు ఘటింపవు, నేను ఘటింపను.

సూ. సర్వేషాం బహువచనే రుఇతి స్యాత్;
ఉత్తమస్య తు భవేన్ముః. ౨౩.

టీక. సర్వేషామ్=సమస్తములైన పురుషములకు, బహు వచనే=బహువచనమందు, రుఇతిస్యాత్ = 'రు' అనువర్ణకము వచ్చును. ఉత్తమస్యతు = ఉత్తమపురుషబహువచనమునకు మాత్రము, ముః=మువర్ణకము, భవేత్=అగును. ఉ. వారు రక్షింతురు. మీరు హరింతురు. మేము వ్యవహరింతుము. ఈతద్ధర్మ క్రియారూపములయందు 'దుతివర్ణకౌక్రమాత్ స్తః' అను సూత్రముచే దుగాగమమువచ్చి 'బిందు పరస్య తకారః' అను సూత్రముచే దకారమునకు 'త' కారము రాఁగా నీరూపములు సిద్ధమయ్యెనని తెలియునది. భూతార్థమున నిత్వము వచ్చును. పెద్దలు రక్షించిరి. మీరంబును సేవించి తిరి. మేము భజించితిమి. వారు ఘటింపుచున్నారు. మీరు హరింపుచున్నారు. మేము వరింపుచున్నాము. 'ఘటింపుచు

న్నారము, హరింపుచున్నారము, వరింపుచున్నారము' అను చోటులందు 'ఉతోచ్చస ర్వేషు' అనుచోప్పున రుకారసంబంధమైన యుకారమునకు 'అ'కారము వచ్చినది. వా రనుభవింపఁగలరు, మీరు వినుతింపఁగలరు, మేము రక్షింపఁగలము. (కొన్ని ప్రతులలో నీసందర్భమునందెల్ల 'ఘటించు' అనునదే యుదాహరింపఁబడినది. వారు ఘటింతురు, మీరు ఘటింతురు, మేము ఘటింతుము. మొ.)

(సూ. ౩.)

81 శ్లో. ఏకత్వేఽథ బహుత్వే
ముడుజౌ సంప్రార్థనార్థకేషు స్తః,
ద్వా చోర్ధ్వక ద్ధర్తే
ప్రథమైకస్యైర్ధ్వవేచ్ఛ భూతార్థే.

సూ. ఏకత్వేఽథ బహుత్వే ముడుజౌ సంప్రార్థ
నార్థకేషు స్తః. ౨౮.

టీక. అథ=పిమ్మట, సంప్రార్థనార్థకేషు = సంప్రార్థనార్థకములక్రియలయందు, ఏకత్వే = ఏకవచనమందు, బహుత్వే = బహువచనమందు, ముడుజౌ స్తః = మువర్ణకడువర్ణకములు క్రమముగా వచ్చును.డువర్ణకము జిత్తుగాన నర్ధబిందు పూర్వకమగును. ఉ. ఏకవచనమునకు—సేవింపుము,భజింపుము.బహువచనమునకు—అనుభవింపుఁడు, ఘటింపుఁడు, పరిభవింపుఁడు, జయింపుఁడు.

ప్రార్థనార్థే మురేకత్వే కథ్యతే మధ్యమార్థకః,
విశ్లోషా తు పదంత్యేకే న ప్రాణే తు కదాచన.

అను నథర్వణవచనముచొప్పున నీమువర్ణక మచ్చుపరమైన యెడల నిత్యముగావచ్చును. హల్లుపరమైనప్పుడు వికల్పమని తెలియునది. ఉ. రక్షింపు దేవ,రక్షింపుము దేవ, రక్షింపుమంబ, పోషింపుమీశ్వరి.

సూ. దొ చోర్లుక్తద్ధర్మే. ౨౫.

టీక. తద్ధర్మే=తద్ధర్మార్థమందు, దొ=దువర్ణకముపరమై యుండఁగా, చోః=ఇంచు గాగమసంబంధియైన చువర్ణమునకు, లుక్=లోపము వచ్చును. 'బిందుపరస్య తకారో దోస్స్యాత్' అను సూత్రముచేత దకారమునకు 'త' కారము రాఁగా, 'ఘటింతువు, నటింతును, హరింతురు, రక్షింతురు. పోషింతువు, సేవింతుము, భజింతుము.' అనురీతిని సిద్ధించును.

సూ. ప్రథమైకస్యైర్భవేచ్చ భూతార్థే. ౨౬.

టీక. భూతార్థే=భూతార్థమందు, ప్రథమైకస్య=ప్రథమపురుషైకవచనమునకు, ఏత్ = ఎకారము, భవేత్=అవును. ఉ. భజించె, వరించె, ఘటించె. ఇత్యాది. 'ప్రథమైకవచన లోపస్తద్ధర్మాతీతయోః' అనుచొప్పున ప్రత్యయలోపము వచ్చెను.

(౩. సూ)

82. శ్లో. దుతివర్ణకౌ క్రమాత్ స్తో
నాద్యస్యాదేర్ద్వయోశ్చ భూతార్థే,
బిందుపరస్య తకారో
దోస్స్యాద్భూతాదుతాం పరేషామిత్.

సూ. దుతివర్ణకౌ క్రమాత్ స్తః నాద్యస్యాదేః
ద్వయోశ్చ భూతార్థే. ౨౭.

టీక. తద్ధర్మభూతార్థములందు (పూర్వశ్లోకమునుండి యథ్యాహారము) క్రమాత్=వరుసగా, దుతివర్ణకౌ=దువర్ణక తివర్ణకములు, (తద్ధర్మమందు దువర్ణకమును భూతార్థమందు తివర్ణకమును) స్తః=అగును. ఆద్యస్య = తద్ధర్మార్థముయొక్క, ఆదేః=ప్రథమపురుషైకవచనమునకు, న=ఆదువర్ణకము లేదు. ప్రథమపురుష బహువచనమునందును మధ్యమోత్తమ పురుషములందును నాదువర్ణకము వచ్చునని తెలియునది. భూతార్థే = భూతార్థమందు, ద్వయోశ్చ = ప్రథమపురుషైకవచన బహువచనములు రెండిటికిని తివర్ణకము లేదు. మధ్యమోత్తమపురుషములకు మాత్రమే వచ్చును ఉ. తద్ధర్మమునకు—నీవు పోషింతువు. బిందు పరస్యేత్యాదికముచే 'చు' లోప తకారములు వచ్చును. భూతార్థమునకు— పోషించితివి, నేను పోషించితిని. 'సేవించు, భజించు, కరుణించు, ఘటించు.' అనుచోట్ల దువర్ణకము రాలేదు. ఘటించిరి, సేవించిరి, సేవించె. అను భూతార్థవచనద్వయమందును 'తి' వర్ణకము రాలేదు.

సూ. బిందుపరస్య తకారో దోస్స్యాత్. ౨౮.

టీక. బిందుపరస్య = బిందువునకంటెఁ బరమైన, దోః = దువర్ణమునకు, తకారస్స్యాత్=తకారమువచ్చును. ఉ. ఘటింతురు, రక్షింతురు. ఘటింతువు,రక్షింతువు. ఇత్యాది. 'దాచో

ర్లుక్ తద్ధర్మే' అను చొప్పున 'చు' లోపము రాఁగా దువర్ణకము నకు బిందుపరత్వము సిద్ధించును.

సూ. భూతాదుతాం పరేషామిత్. ౨౯.

టీక. భూతాత్=భూతార్థక క్రియల తివర్ణకముకంటె, పరేషామ్=పరమైన ప్రత్యయములయొక్క, ఉతామ్=ఉకారములకు, ఇత్=ఇకారము వచ్చును. ఉ. రక్షించితివి, ఘటించితిరి, భజించితిని, ఘటించితిమి.

(2. సూ.)

83. శ్లో. లఘ్వేకాక్షరపూర్వ
క్రియాంతిమస్యానయో భవేదిద్వా,
తిజ్మధ్యనామకాస్స్వ
ర్మధ్యమపురుషాశ్చ యే రమాంతాశ్చ.

సూ. లఘ్వేకాక్షరపూర్వక్రియాంతిమస్యానయో
భవేదిద్వా. ౩౦.

టీక. అనయః=అయ్‌పరిణతిలేనట్టి, ల.........మస్య-లఘ్వేకాక్షర=లఘువగునేకాక్షరకము, పూర్వ=పూర్వమందుఁ గల, క్రియా=క్రియలయొక్క, అంతిమస్య=కడపటికి, ఇత్=ఇకారము, వా=వికల్పముగ భవేత్ = అగును. తద్ధర్మమున కుదాహరణము—— ఘటించు, ఘటియించు. భూతార్థమునకు——వరించె, వరియించె. ఘటించె, ఘటియించె. ఇత్యాది. ఘట్ అనేది లఘ్వేకాక్షరపూర్వమును, 'అయ్'

లేనిది గనుక దీని తుదిటకారముతుదను 'ఇ'త్వము రాఁగా నించుగాగమము ప్రత్యేకముగా నిల్చెను. ఘటియించె. వికల్పము గనుక ఘటించె. 'సాధించె, శోధించె' అనుచోటుల నేకాక్షరపూర్వమైనను లఘ్వక్షరపూర్వకము కాదు కాన 'ఇ'కారము రాలేదు. 'శయనించె' ఈదిక్కు నలఘుపూర్వమైనను నేకాక్షరపూర్వకము కాదు కాన 'ఇ' కారము రాలేదు. 'అనయః' అనుటచే జయించెను, నయించెను. అను క్రియలయాదేశక్రియలుగాన 'ఇ' కారము రాదయ్యెను.

సూ. తిజ్మధ్యనామకాస్స్యుర్మధ్యమపురుషాశ్చ యే రమాంతాశ్చ. ౩౧.

టీక. మధ్యమపురుషాశ్చ = మధ్యమపురుషక్రియలును, రమాంతాశ్చ = రేఫాంతమకారాంతక్రియలును, యే=ఏవి కలవో, అవి, తిజ్మధ్యనామకాస్స్యుః = తిజ్మధ్యములను పేరు కలవగును. ఉ. రక్షించితివి. రక్షించితిరి, రక్షించిరి, రక్షించితిమి. ఈతిజ్మధ్యక్రియలు కళాసంజ్ఞ కలవిగాన వీనియంతముల యందు ద్రుతములేదని తెలియునది. ఘటించి రుత్సవము,ఘటించితిరి కుశలము, చూతురు ప్రభువులు, చనిరి పురికి, వింటిమి పురాణములు, కొలుతుము పరమేశ్వరిని. ఇత్యాదులు. ఇవి ప్రథమామాత్రములు గనుక 'వినరుగాక, చూచితిమిగదా' ఇత్యాదుల గసడదవాదేశము వచ్చును.

(2. సూ.)

84 శ్లో. చోరాత్మనేపదార్థే
గృహ్ణాతావాగమస్య వేత్వం స్యాత్,
రంజతిఘట్యాదీనాం
బిందోశ్చస్యాపి లావుభౌ భవతః.

సూ. చోరాత్మనేపదార్థే గృహ్ణాతావాగస్య
వేత్వం స్యాత్. 3౨.

టీక. ఆత్మనేపదార్థే=ఆత్మనేపదార్థమునిచ్చు, గృహ్ణాతౌ =గ్రహిధాత్వర్థమైన కొనుధాతువు పరమౌచుండఁగా, ఆగమస్య=ఇంచుగాగమముయొక్క, చోః=చువర్ణమునకు, వా= వికల్పకముగా, ఇత్వంస్యాత్ = ఇత్వమువచ్చును. వహించుకొని, వహించికొని, గ్రహించుకొని, గ్రహించికొని. ఘటించుకొని, ఘటించికొని. ఆత్మనేపదార్థమనఁగాఁ క్రియాఫలము కర్తను బొందినపుడాత్మనేపదమగును. ఆత్మనేపదార్థమందు గ్రహిధాతువు పరమౌచుండఁగా నిత్వము వికల్పముగా వచ్చునని తెలియునది. ఈయిత్వమించుగాగమ చువర్ణమునకుఁ దత్సమ క్రియలయందు విహితమైనను, దేశ్యక్రియలకును వికల్పమునవచ్చునని తెలియునది. నేర్చుకొని, నేర్చికొని. పూనుకొని, పూనికొని. అంటుకొని, అంటికొని. ఇది బీజర్థమందును గలదు. ఘటియింపించుకొని, ఘటియింపించికొని. ఈ రూపములు క్త్వాంతములు.

సూ. రంజతిఘుట్యాదీనాం బిందోశ్చస్యాపి
లావుభౌ భవతః. 33.

టీక. రంజతిఘుట్యాదీనామ్='రంజరాగే, ఘుటసంఘుటనే' అనునవి మొదలైన ధాతువులసంబంధమగు నించుగాగమము యొక్క, బిందోః=సున్నకును, చస్యాపి = చకారమునకును, ఉభౌ=రెండైన, లౌ = లకారములు, భవతః = ఆదేశములై వచ్చును. ఉ. ఘుటిల్లు, రంజిల్లు, సంధిల్లు, భ్రాజిల్లు, శోభిల్లు, విస్తరిల్లు, సంఘుటిల్లు. వర్తమానార్థమునకు — రాజిల్లుచున్నాఁడు. భవిష్యదర్థమునకు—రాజిల్లఁగలఁడు. ఇత్యాదులు చూచుకొనునది. కొన్నియెడల నించుగాగమము, ల్లాదేశమును వచ్చును. చింతించె, చింతిల్లె. ఉద్భవించె, ఉద్భవిల్లె.

'తత్రోభయోర్భవేదేకో లకార ఇతి కేచన.'

అను నథర్వణ వచనముచొప్పున నొక లకారము లోపించుటయుఁ గలదు. వర్తిలు, అవతరిలు, సంధిలు. తేజరిల్లు, ప్రజ్వరిల్లు' అనురీతిని వర్ణవికారమును గలదు.

(3. సూ.)

35 శ్లో. న తు ణౌ భవేచ్చ లోపో
ణ్యర్థే యో వర్తతే పరత్రాస్య
పునరాగమః క్రియాణాం
పర్యాప్తో మన్మతే తు సంకేతః.

సూ. న తు ణౌ భవేచ్చ లోపో ణ్యర్థే యో వర్తతే
పరత్రాస్య. 34.

# వైదికగ్రంథములు

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| అమావాస్యాతర్పణము | ... | 0 | 2 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 3 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 | 3 |
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 3 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | ... | 2 | 8 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు | ... | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | 0 | 3 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) | ... | 0 | 2 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 2 |
| పంచసూక్తములు, సస్వరము | ... | 0 | 3 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 0 | 12 |
| పంచోపనిషత్తులు, బ్రహ్మమేధసహితము | ... | 0 | 6 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 2 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 3 |
| మహాన్యాసము, సస్వరము, చిన్నసైజు | ... | 0 | 12 |
| మంత్రప్రశ్నములు, మూలము | ... | 0 | 3 |
| డిటో సస్వరము (వికాగ్నికాండ | ... | 0 | 6 |
| తైత్తిరీయ ఆరణ్యకోపనిషత్తులు, పితృమే పన్నములు సహా, సస్వరము | ... | 3 | 0 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము | ... | 0 | 3 |
| డిటో పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్ర టీకాతాత్పర్యము | ... | 0 | 6 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | 0 | 12 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము | ... | 2 | 8 |
| డిటో ఆబ్దికమంత్రములు | ... | 0 | 8 |
| శ్రీవైష్ణవాహ్నికము, చిన్నసైజు | ... | 0 | 6 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము | ... | 0 | 6 |
| రుద్రము—నమకము, చమకము, సస్వరము, చిన్నసైజు | ... | 0 | 3 |
| రుద్రాధ్యాయము, సటీక | ... | 1 | 8 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | ... | 0 | 2 |

# జ్యోతిష గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| అఱువది (గత) సంవత్సరముల పంచాంగము (1867-1926) | ... | 10 | 0 |
| అష్టకవర్గు, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 4 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము | ... | 0 | 12 |
| కాలామృతము, మేలుప్రతి | ... | 2 | 0 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అను వాస్తుసారసంగ్రహము | ... | 1 | 0 |
| కేరళప్రశ్నము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 4 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు | ... | 0 | 3 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, తాత్పర్యసహితము | ... | 0 | 6 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రటీకాసహితము | ... | 0 | 6 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 12 |
| జ్యోతిషార్ణవనవనీతము | ... | 2 | 0 |
| నక్షత్రచూడామణి, చక్కని ప్రతి | ... | 0 | 6 |
| పుష్పబంధము, సాధారణప్రతి | ... | 0 | 8 |
| బృహద్యోగరత్నాకరము, తెనుగువచనము | ... | 0 | 12 |